

భువనేశ్వరాలయగోపురదృశ్యం

—ఫొటో: 'ఎస్సార్', రాజమహేంద్రి]

104 పేజీలు **ఆంధ్రపత్రిక** 25 నయాపైసలు

సచిత్ర వారపత్రిక

# వచ్చేదే సంక్రాంతి సంచిక!

## "చంద్రలోకయాత్ర"

బహుమతిపొందిన కథ

## "దగాపడిన తమ్ముడు"

కొత్త సీరియల్ ప్రారంభం

"ఆంధ్రమహాభారతం" నుంచి ఒక ఘట్టం

ఇంకా కథలు, వ్యాసాలు, గేయాలు వగైరా.

## ప్రత్యేక సినిమా శీర్షిక

విజయా ప్రొడక్షన్స్, వాహినీ స్టుడియో

చరిత్రకు, నిర్వహణానికి సంబంధించిన సచిత్ర సమగ్ర వ్యాసం

## నేటి సంగీతంపై సినీతార భానుమతి రచన

తెలుగు సినిమా ప్రముఖులతో ఇంటర్వ్యూలు, వారి వ్యాసాలు

తెలుగు, తమిళ, బెంగాలీ, హిందీ చిత్రపరిశ్రమల సమీక్ష

వనితాలోకం, బాలసాహితి, శీర్షికలు

ఇంకా ఎన్నో పండుగచిత్రాలు, విశేషాలు

**నేడే మీకాపీ రిజర్వు చేసుకోండి!**

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 20
8-1-58

**Founder : K. NAGESWARA RAO**

హేవిళంబి పుష్య, శుద్ధ తృతీయ బుధవారం

## ★ విషయానుక్రమణిక ★



ముఖచిత్రం:

పొన్నలూరివారి 'శోభ'లో రాజ సులోచన





హైదరాబాద్ నవ్య సాహితీ సమితి పంచమ వార్షిక సభ విశేషాలు

# ఇతివృత్తంకంటె కథా సంవిధానం ముఖ్యం

★ "ప్రవీణ్" ★

పూర్వం రాజసభలో సభ్యత్వాన్ని అర్థించి కవులు, గాయకులు గళమెత్తి పాడేవారు నేడు రాజ్యసభలో సభ్యత్వాన్ని అపేక్షించి కవులు వందిమాగధ ధ్వనులు చేస్తున్నారు కవిసార్వభౌమ బిరుదాన్ని తనది చేసుకోవడానికి ఆనాడు శ్రీనాథుడు డిండిమభట్టారకుని ఓడించి, అతని కంచుఢక్క పగులగొట్టించవలసివచ్చింది. ఇరవైయ్యో శతాబ్దపు నాగరికత సౌకర్యాల నాగరికత దుష్కరమనుకున్న పనులను సాధించడానికి, సుకరమైన మార్గాలను సూచించే నాగరికత, తెలుగులో తిరుపతి రావు పెద్దకవి అనిపించుకోడానికి, ఏ మరాఠీ పెద్దమనిషో ఏ న్యూయార్కు టైమ్సు పత్రికలోనో వ్రాస్తేచాలు వ్యాసం రాసినవానికి తెలుగు రానక్కర్లేదు, ప్రచురించినవానికి అసలే అవసరంలేదు

సముచిత విమర్శ సమకాలీన ఆంధ్ర సారస్వతంలో నానాటికీ దూరమైపోతూంది కవులను, కళాకారులను సన్మానించడం మంచిదే! కాని 'నీవు నేను మదరాసులో సన్మానంచేస్తాను; నువ్వు నాకు హైదరాబాదులో సన్మానంచేస్తావా?' అని ఒప్పందాలు కుదుర్చుకొనే ఈరోజుల్లో—, రాజకీయ ప్రయోజనాల ప్రాతిపదికపై సాహిత్య విమర్శ జరుగుతున్న ఈరోజుల్లో—, రాజకీయ నాయకులుకూడా తాము సంపత్కృతి వల్లకాక సంపదవల్లమాత్రమే నాయకుల మయ్యామన్న సంగతి విస్మరించి, సాహిత్యానికి విలువలు కట్టడానికి పూనుకొంటున్న ఈరోజుల్లో — సన్మానాలకు విలువ పూర్తిగా పోయిందన్నమాట నిజమే! కాని ఈ కారణంవల్లనే ఉత్తమ కవులను, కళాకారులను సన్మానించడం పొరపాటవుతుందా?

హైదరాబాదు నవ్య సాహితీ సమితి సభ్యులు సమితి పంచమవార్షికోత్సవాలను నారాయణగూడా న్యూసైన్సు కళాశాల ఆవరణంలో జయప్రదంగా జరుపుకొన్నారు. వార్షికోత్సవ కార్యక్రమ ప్రధానాంశాలలో కురుగంటి సీతారామ భట్టాచార్యులకు సన్మానం ఒకటి

అన్ని రంగాలలోవలెనే సాహితీ రంగంలోకూడా యువకులు ఎప్పుడూ విప్లవవాదులు ఉన్నది నాశనంచేసి, కొత్తది నిర్మించాలనే ఆవేశపరులు. పురాతన సాహితీ సౌధాలను సమూల నాశనంచేయడం సాధ్యం



హైదరాబాదు నవ్యసాహితీసమితి పంచమ వార్షికోత్సవాలు న్యూసైన్సు కళాశాలలో జరిగాయి. రెండవనాటి కార్యక్రమానికి అధ్యక్షత వహించిన శ్రీ గోపాలరెడ్డి ఉపన్యసిస్తున్నారు.



నవ్యసాహితీసమితి వార్షికోత్సవాలకు డా॥ పట్టాభి ప్రారంభోత్సవం జరిపారు శ్రీ డి సంజీవయ్య అధ్యక్షులు
చిత్రంలో శ్రీయుతులు కురుగంటి, న్యా॥ భీమశంకరం, డా॥ పట్టాభి, శ్రీ సంజీవయ్య, శ్రీ పోతుకూచి సాంబశివరావు, శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి

# ఇతివృత్తంకంటె కథాసంవిధానం ముఖ్యం

కొనిపని ఆవేశపూరితులైన యువకులు సాహితీసౌధాలను కొంతవరకు విస్తృతం చేసి, వాటికి కొంతవరకు మెరుగులు దిద్ది, తాను కూడా వృద్ధులౌతారు వృద్ధాప్యంలో తాముకూడా పురాతన సాహితీ సౌధాలను చూసి మురిసి పోవటం ప్రారంభిస్తారు ఏ కాలంలో, ఏ సంఘంలో, ఏ సంస్థలో యువకులకీ వృద్ధులకీ సామరస్యం కుదురుతుందో, ఆ కాలం, ఆ సంస్థ కొత్తపాతల మేలు కలయికను సంఘటించి పేరు తెచ్చుకొంటాయి

ఒకనాడు కురుగంటివారిని నవ్యసాహిత్య పరిషత్తు సన్మానించి, భట్టాచార్యులను చేసింది ఈనాడు నవ్యసాహితీసమితి వారిని సన్మానించింది రెండు తరాల యువకులు చేసిన సన్మానాన్ని పొందటానికి, వారి సహృదయతా పూర్వకమైన, భయరహితమైన, విమర్శనాదృక్పథమే కారణం అనుకుంటాను వయోవృద్ధులు వారు; జ్ఞానవృద్ధులు. కాని భావాలలో వృద్ధులు కారు వారిని సన్మానించడంలో, తమ ఉచితానుచిత వివక్షణా జ్ఞానాన్ని సమితి సభ్యులు ప్రకటించుకొన్నారు

## పోతన: భాగవతం

సమితి పంచమ వార్షికోత్సవాలు డిసెంబరు 21 వ తేదీ శనివారం సాయంకాలం ప్రారంభమయ్యాయి ఉత్సవాలను డా॥ పట్టాభి ప్రారంభంచేస్తూ, మనకు భాషా సంబంధమైన బానిసత్వ చిహ్నాలు వదలనందుకు విచారాన్ని ప్రకటించారు వెల్లూరు కారాగారంలో ఉన్నప్పుడు మధ్యప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి కీ॥ శే॥ రవిశంకర శుక్లా పోతన భాగవతాన్ని విని ఆనందించారని, ముఖ్యమంత్రిగా ఆ మహాగ్రంథాన్ని మరాఠీ భాషలోనికి అనువదించడానికి డబ్బు మంజూరు చేయించారని డా॥ పట్టాభి వెల్లడించారు రచయితలు సహకార సంఘాలుగా ఏర్పడి పుస్తక ప్రచురణకు పూనుకోవాలని కార్మికమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య హెచ్చరించారు తమ గ్రంథాలకు ప్రజల నుంచి ప్రోత్సాహం లేదని రచయితలు నిరుత్సాహపడటం తగదని, అందరు ప్రజల్ని మెప్పించడం సాధ్యంకాక పోయినా, అధిక సంఖ్యాకులైన ప్రజలు అభిలషించే సాహిత్యాన్నే రచయితలు సృష్టించాలని శ్రీ సంజీవయ్య అన్నారు ఆంధ్ర ప్రదేశ్ ప్రధాన న్యాయస్థానం న్యాయమూర్తి శ్రీ కందా భీమశంకరం సమితిసభ్యుల పుస్తకాల, చిత్రాల ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేశారు

ఆనాటి వినోద కార్యక్రమంలో శ్రీ హెచ్. పి సుందర్, ఇంద్రజాలం, శ్రీ బి కృష్ణంరాజు ఏకపాత్రాభినయం, సెంట్రల్ రైల్వే సోషల్ వెల్ఫేర్ సెంటర్ (లాలాగూడా) 'భక్తరామదాసు' అనే వ్యంగ్యనాటికా ప్రదర్శనం ప్రధానాంశాలు సాహితీసంస్థలైనా, నాటక సమాజాలైనా-సంస్థలకన్నింటికీ సభ్యుల వ్యక్తిత్వాలకు అతీతమైన వ్యక్తిత్వం ఉంటుంది సభ్యుడు సంస్థలో ఎంతప్రముఖుడైనా, 'నేనే సంస్థ, సంస్థయే నేను' అని తాదాత్మ్యత ఆపాదించుకోవడం తగదు; స్వార్థప్రయోజనాలకు సంస్థను ఉపయోగించుకోవడం న్యాయం కాదు 'భక్తరామదాసు' వ్యంగ్యనాటిక ఇచ్చే సందేశం ఇది

రచన, దర్శకత్వం శ్రీ డి రాజేశ్వరరావు, పాత్రధారుల నటన ఉత్తమస్థాయిలో ఉంది ప్రధానంగా శ్రీయుతులు వెంకటరావు, హరి మూర్తి కే సూర్యనారాయణమూర్తి చక్కగా నటించారు రచయిత గురించు కోవలసిన ఒక విషయం ఎంత భావుకుడైనా రచయిత వాస్తవిక పరిస్థితులను కొన్నింటిని దృష్టిలో ఉంచుకొని రచన సాగిస్తాడు, కథాకల్పనం చేస్తాడు కాని రచయిత ఒక జీవిత సత్యాన్ని తన రచనలో అందీయకపోతే, రచన కళాత్మకం కాజాలదు

## తెలుగు, తమిళ సంస్థలు

ఆంధ్రులు స్థాపించిన సంస్థలు, సంస్థలలోని వ్యక్తుల సంఘర్షణలవల్ల నాశనమౌతున్నాయి కాని తమిళులలో మాత్రం తగాదాలు లేవా? వారు స్థాపించిన సంస్థలు ఎలా వికసిస్తున్నాయి? ఈ ప్రశ్నకు సమాధానం శ్రీ సోమంచి యజ్ఞన్న శాస్త్రి ఇచ్చారు హాస్యరచయిగా ఆంధ్రులందరికీ శ్రీ సోమంచి సుపరిచితులు వారు బొంబాయి ఆంధ్రమహాసభకు మూడు సంవత్సరాలకాలం అధ్యక్షపదవి నిర్వహించారు ప్రస్తుతం బొంబాయి పురపాలక సంఘానికి డిప్యూటీ కమిషనర్‌గా ఉంటున్నారు. త్వరలో ఇథియోపియాలో స్థానిక పరిపాలనా వ్యవస్థను నెలకొల్పడానికి అక్కడికి వెళుతున్నారు వారు, ప్రస్తుతం బొంబాయి ఆంధ్రమహాసభ అధ్యక్షులు శ్రీ వి రామలింగస్వామి ఇరువురూ నవ్యసాహితీసమితి వార్షికోత్సవాలలో పాల్గొనడానికి హైదరాబాదు వచ్చారు

వీరిద్దరూ రెండవనాటి సాయంత్రం సభలో పాల్గొన్నారు శ్రీ సోమంచి తమ ఉపన్యాసాన్ని ప్రారంభిస్తూ, తన పరిస్థితి కాశీమజిలీ కథలలో కథానాయకుడిలా అయిందన్నారు తాము ప్రేక్షకుని వలె ఉత్సవాలలో పాల్గొందామని వస్తే, నిర్వాహకులు ఉపన్యాసమిమ్మన్నారు. కాశీమజిలీ కథలలో కూడా ఇంతే! కొత్తగా ఏనుగొకటివచ్చి మెడలో దండవేసి, పన్నీరు జల్లుతుంది ప్రయాణీకుడుగా వచ్చిన కథానాయకుడు పట్టాభిషిక్తుడౌతాడు! (ఇక్కడ అధ్యక్షత వహించిన ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డికి హాస్యంగా ఒక చక్కని సందేహం వచ్చింది; 'కాశీమజిలీ కథలలో రాజకుమార్తెను తెచ్చి పెళ్ళిచేయడం కూడా ఉంటుంది కదా?' అని!) "ఎక్కడికి వెళ్ళినా, శ్రీ స్వామి, నేను కలిసి ఉపన్యాసాలు ఇవ్వవలసి వస్తూంటుంది 'విజయావారి పిక్చర్సు విజ్ఞానానికి, వినోదానికి' అన్నట్టు వారిఉపన్యాసాలు విజ్ఞానానికి, నా



హైదరాబాదు నవ్యసాహితీసమితి వార్షికోత్సవాలలో శ్రీ కురుగంటి సీతారామయ్యకు సన్మానం జరిగింది అధ్యక్షత వహించిన బి. గోపాలరెడ్డి, కురుగంటి, పోతుకూచి సాంబశివరావు, సోమంచి యజ్ఞన్నశాస్త్రి చిత్రంలో వున్నారు

ఉపన్యాసాలు వినోదానికి' అని చమత్కరించారు శ్రీ యజ్ఞన్నశాస్త్రి

ఆంధ్రదేశానికి కొన్ని వందల మైళ్ళ దూరంలో జీవనోపాధికోసం నివాసమేర్పరుచుకొన్న ప్రవాసాంధ్రులకి విద్యాబోధనాది సౌకర్యాలు లేవు బొంబాయి నగరంలోని ఆంధ్రులలో ఐకమత్యం సంఘటించి, బొంబాయి ఆంధ్రమహాసభ చేసిన, చేస్తూన్న కృషిని వివరించారు శ్రీ రామలింగస్వామి ఆంధ్రదేశ ప్రజలనుండి, ప్రభుత్వం నుండి, రాష్ట్రేతరాంధ్రులు వాంఛిస్తున్నదేదో వివరంగా తెలిపారు

ఆంధ్రులలో వలెనే తమిళులలో కూడా పరస్పర కలహాలున్నాయని, ఆంధ్రులు ఈ తగాదాలను పురస్కరించుకొని తమ తమ సంస్థలను నాశనం చేసుకొంటారని; తమిళులు మళ్ళీ కలహాలు కొత్త కొత్త సంస్థలు ఏర్పడడానికి పనికివస్తాయి కాని పాతవి నాశనం కావడానికి కాదన్నారు శ్రీ యజ్ఞన్నశాస్త్రి అన్నారు.

సీతారామ భట్టాచార్యుల సన్మాన కార్యక్రమానికి ఆర్థికమంత్రి అధ్యక్షత వహించారు నోరి నరసింహశాస్త్రి ప్రభృతులు ప్రసంగించారు ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆర్ట్సు కామర్సు కళాశాల తెలుగు విద్యార్థులు తరఫున తెలుగులోను, శ్రీ చిఫుళుల అప్పయ్యశాస్త్రి సంస్కృతంలోను సన్మానపత్రాలు సమర్పించారు. నవ్యసాహితీ సమితి తరఫున కార్యదర్శి శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి సన్మానపత్రం సమర్పించారు. ఇన్‌కమ్ టాక్సు రిక్రియేషన్ క్లబ్ వారు సమర్పించిన 'ఏడు సున్నలు' నాటిక (రచన శ్రీ పోతుకూచి సాంబశివరావు) కుమారికలు రమ, కిళాంబి రాజకుమారిల నృత్యప్రదర్శనాలు రెండవదినం సాయంత్రపు కార్యక్రమంలో ప్రధానాంశాలు

## కవి కథక సమ్మేళనం

ఆదివారం మధ్యాహ్నం జరిగిన కవి కథక సమ్మేళనానికి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి అధ్యక్షత వహించారు. శ్రీ బోయి భీమన్న, కుందుర్తి, దాశరథి, నారాయణరెడ్డి ఉత్పల, వంటూరి సుబ్బరాజు, భద్రిరాజు, పైడిపాటి, పి ఎస్ ఆర్ ఆంజనేయశాస్త్రి కాళోజీ, వేదాల తిరువెంగళాచార్యులు, మహాబూబ్ కావ్యగానం చేశారు శ్రీయుతులు కొమర్రాజు వేణుగోపాలరావు, ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి, పాలంకి వెంకట రామచంద్రమూర్తి, తురగా కృష్ణమోహన్ రావు, కుమారి యం. జానకిరాణి, శ్రీమతి టి వి రత్నావళి కథలు చదివారు.

ఆదివారం ఉదయం జరిగిన సాహిత్య గోష్ఠికి శ్రీ నోరి నరసింహశాస్త్రి అధ్యక్షత వహించారు సాహిత్యాభివృద్ధికి సద్విమర్శ అవసరాన్ని గురించి అధ్యక్షులు తమ ఉపన్యాసంలో ప్రస్తావించారు 'ప్రేమ, ఆకలి ఈ రెంటిని తప్పిస్తే సమకాలీన కథకులకు వస్తువులే దొరకడంలేదని శ్రీ గోరాశాస్త్రి తమ విచారాన్ని వెలిబుచ్చారు. కావ్యంలోని కవి కృషిని విమర్శకుడు నిర్దేశించి, ఇల్లడిస్తాడు కనుక విమర్శకుడుకూడా లక్షణకారునివంటి వాడే నని డా. దివాకర్ల ప్రతిపాదించారు. చేతనసంయుతము, సంభావితములై, లయాన్వితమైన సువ్యక్తభాషలద్వారా వ్యక్తీకరింపబడే ప్రతిభ కవిత్వమని శ్రీ కేతవరపు రామకోటి శాస్త్రి నిర్వచించారు నవలలో స్వయంసంపూర్తితే అది నాటకంకంటె అధిక విశిష్టత నందుకొనడానికి దోహదం చేసిందని శ్రీ బొడ్డపాటి కుటుంబరాయశర్మ అన్నారు. ప్రాచీనకవులు ప్రజాజీవితానికి ప్రాధాన్యత ఇవ్వలేదనడం పొరపాటని, సంస్కృత నాటికలలో అభివర్ణితమైన ప్రజాజీవితం నేడుస్పష్టంకావడం వల్ల, వాటి లక్ష్యలక్షణాలు నేడు గ్రాహ్యం కాకుండా ఉన్నాయని శ్రీ పి ఎస్ ఆర్. అప్పారావు అన్నారు.

సాహిత్యగోష్ఠియొక్క లక్ష్యం ఇంతవరకు జరిగినదానిని సమీక్షించి, ముందుకు పోవలసిన దారిని సూచించడం; పాల్గొన్న వ్యక్తుల పురాతనాభిప్రాయాల పునరావృత్తి కాదు. నవ్యసాహితీసమితి ఏర్పరచిన సాహిత్య గోష్ఠి పూర్తిగా ప్రయోజనకరమైందని భావించడానికి వీలులేదు కొన్ని వేల సంవత్సరాలనుండి కథాకల్పన చేయబడుతోంది. మరి కొన్ని వేల సంవత్సరాలవరకు ఇది సాగుతూనే ఉంటుంది కాళిదాసు శాకుంతలానికీ, షేక్స్పియర్ విషాదాంత నాటకాలలో కొన్నింటికీ ప్రేమే కథావస్తువు. సూక్ష్మంగా పరిశీలిస్తే సాహిత్యసృష్టికి ఐదారు ప్రధాన వస్తువులకంటె లేవు అందువల్లనే వస్తువుకంటె, పద్ధతికి ప్రాధాన్యం ఎక్కువ సాహిత్యగోష్ఠులు రచనా పద్ధతులను సునిశితంగా పరిశీలించకపోతే, వాటివల్ల ప్రయోజనం ఏది సిద్ధించబోదు.

సభ్యుల కథలను పుస్తకాలను ఇంగ్లీషు భాషలోకి, ఇతర భారతీయ భాషలలోనికి అనువదింపజేయాలని సంకల్పించినట్లు, ప్రయత్నాలు సాగుతూన్నట్లు కార్యదర్శి తమనివేదికలో తెలిపారు కొత్తదారులు తొక్కి, కొత్తమార్గాలను చూపి, 'నవ్యసాహితీసమితి' తన పేరును సార్థకం చేసుకొంటుందని విశ్వసించవచ్చు.




గాయకులపాలిటి అదృష్టదేవత!

# కిన్నెర స్వరదాత

చక్కని కంఠస్వరము నిచ్చు దివ్యౌషధము వత్తి బొంగురు కీచుమన్నగునవి నశించును.
సీసా రు 2-8-0 పోష్టుఖర్చు రు. 1-0-0
• వర్తకులకు మంచి కమీషన్:
వివరములకు :
శ్రీ వేంకటేశ్వర్ అండు కో,
మునగాలవారి వీధి, కాకినాడ.




## నంద్యాల కొండమాచార్యులు

హాస్యమునకు ఫలితము హాసము. హాస్యము నిత్య జీవిత కషాలను కరగిస్తుంది. 'నవ్వు' ఆరోగ్యాన్ని పెంపొందిస్తుంది.

తఅము నవ్వనివాడు, సంగీతాన్ని ప్రేమించనివాడు ప్రమాదకరమైన వ్యక్తులు. అన్న దమ్ములనందరిని చంపి రాజ్యానికి వచ్చిన ఔరంగజేబు హాస్యమును ప్రేమించేవాడు కాదు. సంగీతాన్ని గోతిలో పాతిపెట్టమన్నాడు. అతడే తరువాత దారుణమయిన హిందువుల కష్టాలకు కారకుడయ్యాడు. షేక్స్పియర్ తన జూలియస్ సీజర్ డ్రామాలో 'సీజర్' చేత కాషియస్‌ను గురించి ఇలా చెప్పించాడు. "He hears no music, seldom he smiles" కాబట్టి కాషియస్ ప్రమాదకరమయిన వ్యక్తియని 'సీజర్' భావం.

పూర్వ కవుల కావ్యాలు, చాటువులు తిలకిస్తే మన పూర్వులెంత హాస్యప్రియులో చతురులో బోధపడుతుంది. హాస్యరససృష్టిలో ఆధునికులకన్నా పూర్వులేమీ తీసిపోరు. అందుకనే పూర్వకవి వర్ణిత పుస్తక లతాళిపై వికసించి నేటికీ వాడిపోకుండా వున్న కొన్ని హాస్యపుష్పాలను అపచయించి పూలమాలగా సమర్పించుకుంటున్నాను.

కావ్యానికి శోభనిచ్చే అలంకారాలలో కొన్ని నవ్వు పుట్టించేవి యున్నవి. నిందా, స్తుతులలో ఉపమాలంకారం ఉపయోగిస్తారు. అందు నిందలో లోభివానిని గురించి "మునలావె వ్రేలు జన్నుల పసవంటిది లోభివాని బ్రతుకు ధరిత్రిన్" అని చెప్ప బడ్డది. చపలాతిశయోక్త్యలంకారము చూడండి "నేను ప్రయాణమై పోవుచున్నానని నెనిమిటి చెప్పగా నేయునతికి ఉంగరము కడియమాయెను." అనగా వెంటనే అంత కృశించిపోయినదన్నమాట! ప్రతి విషయంలోను 'అతి' మనకు నవ్వు తెప్పిస్తుందిగదా!

కాళిదాసుహాస్యం గంభీరంగావుంటుంది. హృదయాన్ని నవ్విస్తుంది. ప్రసిద్ధ నాటకమయిన శాకుంతలంలోని మొదటి అంకంలో శకుంతల తన చెలికత్తెయయిన ప్రియంవదతో "నా కంచుకమును (రవిక) చాల బిగుతుగ కట్టినావు. బాధగానున్నది కొంచెము వదులు చెయ్యి" అంటుంది. అపుడు ప్రియంవద "పయోధర విస్తారయిత్రృకమాత్మనో యౌవన ముపాలభస్వ" అన్న దానిలో "నా తప్పేమీ లేదు నీకు రవిక వదులుగానే కట్టబడ్డది. యౌవనంచేత ప్రతిక్షణం ఉబుకుతూ పెరుగుతున్న నీ స్తనములే నీ రవిక బిగుతుకు కారణం. కాబట్టి నీ యౌవనాన్ని నిందించుకో" అంటుంది. పై కాళిదాసుహాస్యం శృంగార మిళితమై చక్కగా వుంది.

తెనాలిరామలింగడు హాస్యకవి. అతడి హాస్యకథలు చాలమందికి విదితములే. వృద్ధాప్యములోకూడ నాతడు స్వభావసిద్ధమగు హాస్యమును విడువలేదు. ప్రాయంపు ప్రొద్దు పడమటికి తిరిగిన తరువాత రచించిన పాండురంగ మాహాత్మ్యములోకూడ అతని హాస్యమును చవిచూడగలము.

"ప్రతిదిన కేశలుంచనపురాయిడి
నెట్టన బట్టగట్టిపైఁ
బుతపుతమంచు నున్నకుబు
బోడితలన్ ధరియింప నోడియన్
శతమకు సామ్యగానవిడ
జాలవుగా శిఖిపింఛవల్లిసా
గతమతధుర్య దాని గతె
గట్టుము పుట్టము మిన్న కేటికిన్"

అను దానిలో — నెమిలి పింఛము శ్రీకృష్ణునకు ప్రియమయిన శిరాలంకారము. బౌద్ధావతార సమయమున అతని తల బట్టకట్టుటచే (బోడితల) నెమిలిపింఛమును ధరించుటకు వీలు లేదు. ప్రియమైన అలంకారము కనుక వీడుటకుకూడ వీలుపడదు. కాబట్టి మొలకు కట్టుకున్న బట్టను విప్పివేసి నెమిలి పింఛమును గట్టుకొనుటమేలు! ఇట్లు చేయుట వలన మొలకట్టవలసిన బట్ట తలగట్టుటచే (బట్ట తలయగుటచే) బట్టకట్టిన ఫలితమును, పింఛమును మొలకు కట్టుకొనుటచే పింఛమును ధరించిన ఫలితమును దక్కును.

శ్రీనాథకవిచాటువులు హాస్యాన్ని చిందుతూంటవి. ఆయన జొన్నన్నమునుగురించి చాలనిరసనగా హాస్యోక్తులాడినాడు. ఆయన విష్ణుమూర్తిని పూతన చన్నులచేదు త్రావితివని, దవాగ్ని మ్రింగినాన చెప్పుకుంటావే! "తింత్రిణీపల్లవ యుక్తమానుడుకు బచ్చలిశాకము జొన్నకూటితో మెల్లననొక్క ముద్ద దిగమ్రింగుమ నీపస కాన నయ్యెడిన్" అని సవాలుచేశాడు. ఆయనే పలనాటిని గురించి హాస్యంగా ఇలా అన్నాడు.

"రసికుఁడు పోవఁడు పల్నా
డెసగంగా రంభయైన నేకులె వడకున్
వసుధీశుఁడైన దున్నును
గుసుమాస్త్రుండైన జొన్న కూడే కుడుచున్!"

దేవలూరి కేశవరెడ్డి యను నాతడు ఒక బ్రాహ్మణకవిని "ఓహో కవీశ్వరులా" యని గేలిచేసెనట! ఆకవి హాస్యముగ:

'శ్రీ' పటేవటు నోరను
'శ్రీ' పట్టదదేమి? నీకు 'వీపీ' లందున్
'బీ' పయి రుచిపుట్టెనొ నీ
కీపట్టున దేవలూరి కేశవరెడ్డీ" అని సిగ్గిల జేసెను.

నారయప్పారావుగారి సంస్థానము నకు జమాబందికివచ్చి యట చిరకాలము ఉండవలసివచ్చిన కరణమొకడు ఆయనవద్ద హాస్యముగా ఇట్లు చెప్పెను:

"శీత జలస్నానంబుల్
భూతల శయనంబు వంటపూటకీనంబున్
నాతిగల బ్రహ్మచర్యము
నాతిరమా పూటగడప నారయభూపా"

ఈపద్యంలో నేడుకూడా జమాబందీలకు వచ్చి బస్తీలలో అయిదారురోజులు కష్టంగా గడిపే కరణాలు కనుపిస్తారు.

నల్లి బాధను గురించి ఒక కవి:

"శివుడద్రినిశయనించుట
రవిచంద్రులు మింట నుంట రాజీవాక్షుండ విరళముగ శేషునిపై
బవళించుట నల్లిబాధపడలేక సుమీ!"

కొంత మంది కవులు రాజును పొగడు విధానము మనకు నవ్వు తెప్పిస్తుంది. ఒక కవి

"ఓ రాజా నీవు నాకు చాలా ఖేదం కలిగిస్తున్నావు. ఎందుచేతనంటే ముల్లోకముల వ్యాపించే నీ తెల్లని కీర్తివల్ల నా ప్రియురాలి జుట్టుకూడ తెల్లబడిపోతున్నది." ఇంకొక కవి "ఓ రాజా నీ శత్రువుల భార్యలు తమ కుచములయందున్న కాఠిన్యమును తమ పాదములకెందు కివ్వలేదా"యని భగవంతుని దూరుచున్నారు. అనగా ఆ రాజువల్ల ఓడి, భయపడి పరుగెత్తే శత్రురాజుల భార్యల కాళ్లు నొప్పిపెట్టి ఆ విధముగ అనుచున్నారని యర్థము.

వీరేశలింగం గారు విద్యార్థులకు 'ఆటవెలది' పద్య లక్షణాలను బోధించి బోర్డు మీద ఈ విధంగా వ్రాశారట:

"ఆట వెలది మీరు లారసిచేయుడి
చేయకున్న మీకు సిగ్గుపాటు."

అపుడు విద్యార్థిగా యున్న, కూచి నరసింహం గారు బోర్డు మీద నే దాని నిట్లు పూర్తి చేసిరట.

"సిగ్గు లెన్ని యున్నఁ జెదరిపోవును గద
ఆట వెలఁది పొంతె నార్యులార!"

ఆట వెలదికి మఱొక అర్థం 'వేశ్య' అన్న సంగతి తెలుసుగదా!

కందుకూరి, పానుగంటి, చిలకమర్తి మొదలగు వారు మనకు గద్య రూపాత్మక హాస్యమును చిలికారు. "వీరేశలింగము గారి హాస్యము చిక్కనిది. లక్ష్మీనరసింహముగారి హాస్యము పలుచనిది. లక్ష్మీనరసింహము గారి హాస్యము గిలిగింతలుపెట్టి నవ్వించును. వీరేశలింగముగారి హాస్యము గిల్లి బాధించును" లక్ష్మీనరసింహముగారి ఎనుబది మూడు ప్రహసనములలోనిదైన 'గ్రంథ ప్రకటనము' అను దానినుండి కొన్ని పంక్తులు: "వెఱ్ఱిపప్పయము' మీద కొంకిపక్క గురులింగశాస్త్రి గారి యభిప్రాయము"...

"...ఇందలి పద్యములు గారిముక్కలవలె నెంతో రుచిగా నున్నవి. వీనికి అల్లపు పచ్చడివలె చిన్న వ్యాఖ్యానముకూడ గ్రంథకర్తగారే రచించినందున సర్వజన గ్రాహ్యమై యున్నది. ఇట్టి గ్రంథము జన్మయెత్తి చూచియెఱుగను. ఇకముందు చూడబోను. ఇంకొక జన్మమునకు గూడ జూడగలనని నమ్మకము లేదు. ఇందలి వీరరస పద్యములు రెండు చదవగనే నా కావేశమెత్తి గొడుగుకామతో నా భార్యను మెత్తగా మర్దించితిని. మీ గ్రంథమందలి పై రెండు పద్యములు నేను చదువుచుండగా దగ్గఱనుండి విన్న మా నీళ్ళబ్రాహ్మణుడు కూడ ఆ రసము గ్రహించి కావడిబద్ద తిరగవేసి నన్ను వెన్నుపూస విరుగునట్లు కొట్టెను. కాబట్టి ఈ గ్రంథ మందరు కొనదగినది."

వీరేశలింగంగారు 'ఆచారము' అను ప్రహసనములో చేదస్తపు చెలమమ్మచేత ఇలా అనిపించారు: "నేను రోజుకు రెండు వందల స్నానములు చేస్తాను. ఇవాళమట్టుకు ఇప్పటికి పదిస్నానాలు చేశాను. తెల్లవారి లేచి దొడ్లోకి వెళ్ళినపుడు కాలికింద ఏమో మెత్తగా తగిలి అది ఏమి గుడ్డో అని తలనిండా స్నానము చేసినాను...గోదావరికి వెళ్ళి స్నానముచేసి బిందెయెత్తుకొని వస్తూ బట్టలు ఉతుక్కునేవాళ్ళ నీళ్లుపడ్డట్టు తోచి మళ్ళీ వెళ్ళి మునిగినాను...తరవాత బిందెత్తుకొని సఘందూరం వచ్చేటప్పటికి ఇరవైగజాల దూరంలో మాలవాడు కనబడుటచే, నీళ్లు నడివీధిలో పారబోసి వాణ్ణి నాలుగు తిట్టి వాడి జీవానికి ఉసూరుమంటూ మళ్ళీ వెనుకకు గోదావరికి వెళ్ళి స్నానముచేసి నీళ్లు తెచ్చుకున్నాను." ★



# అవిలోపాలా?



మానవుడనే ప్రతీవాడికీ మొత్తం మీద లోపం అనేది ఏదో ఒకటి వుంటూనే ఉంటుంది. ఆ లోపాలకి, ఆంధ్రులు, బెంగాలీలు, తమిళులు అనే భాషాభేదం కాని, హిందువులు ముస్లింలు అనే మతభేదం కాని ఏమీ ఉండదు. ఆంధ్ర ప్రజానీకం కూడ మానవుల్లోకే వస్తారు కనుక, వాళ్ళకి కూడ ఏవో "లోపాలు" అనేవి వుంటాయని ఒప్పుకోకతప్పదు. కాని 6-11-57 పత్రికలో శ్రీ బి. వి. నరసింహారావు ఆంధ్రులమీద ఆపాదించిన లోపాల మాట అటుంచి, ఆంధ్రులలో ఉన్న కొన్ని ఉన్నతి విషయాలను తీసుకొని వాటిని లోపాలుగా ఎంచడం ఆంధ్రులలో ఒక లోపంఅని చెప్పక తప్పదు.

కేవలం పంచభక్ష్య పరమాన్నం, సాంబారు ప్రాతిపదికగా తీసుకుని ఆత్మ పరిశీలన చెద్దాం అంటే ఎట్లా కుదురుతుంది చెప్పండి? జిహ్వకోకరుచీ పుర్రెకోకబుద్ధి అన్నారు. దానికి ఆంధ్రత్వంఅంటకడితే ఎలా? అలా గేస్నేహం కూడా. తెలుగువాళ్ళలో తెలుగువాళ్ళ సామరస్యంమాట అటుంచి, బెంగాలీలు గుజరాతీలు, హిందూస్థానీ వాళ్ళతో స్నేహం అంటే తెలుగు వాళ్ళకి ఇషం అంటే బాగులేదు. కసుధైక ప్రభుత్వ స్థాపనకై అంతర్జాతీయనాయకులు గోలచేస్తూంటే, అంతర్జాతీయంగా సాంఘిక, ఆర్థిక సాంస్కృతిక సమాఖ్యలు అసంఖ్యాకంగా బహుళ ప్రచారం చేస్తూంటే, కనీసం ఒకేదేశంలో భాష వేరైనంతమాత్రాన ఆ మాత్రం స్నేహం కలవడం, కలుపుకోవడం మంచిదేకదా? నిజంగా అలా కలుపుకోకపోవడం విచారకరంకూడా. ఐనా, ఎంత సామరస్యం, సంఘీభావం లేకపోతే కష్టతరమైన ఆంధ్రరాష్ట్రం సిద్ధించింది? అంతేకాదు. మళ్ళీ గిర్రున మూడు ఏళ్ళలో విశాలాంధ్రకూడా సిద్ధించిందే? ఇవి ఆంధ్రుల సంఘీభావానికి తార్కాణం కాదా?

నేను బెంగాలు వెళితే బెంగాలీవాణ్ణి అవుతాను, మహారాష్ట్రంవెళ్తే మరాఠీ వాణ్ణి అవుతాను అంటే, అంత కలసికట్టుగా, ఎక్కడకు వెళ్ళినా ఆ ప్రాంతీయులతో అంత సన్నిహితంగా ఉండటం తెలుగువారి ఔన్నత్యాన్నే తెల్పుతుంది కాని లోపం ఎలా అవుతుంది?

అదేవిధంగా భాష తీసుకుంటే, మనం ఏ ప్రాంతానికివెళ్తే, ఆ భాష మాట్లాడ్డం సమంజసం. ఆ భాష రాకపోతే, వేరేవిషయం. ఒక హిందీ మాట్లాడే ప్రాంతానికి మనం వెళ్ళినపుడు, మనం హిందీ మాట్లాడ్డం ఉత్తమం. ఒక సిటీబస్‌లో మనం తెలుగు మాట్లాడుతాం అనుకోండి. అందులో ఏమైనా భిన్నమైన మాటలు లేకపోయినా, పైవారికి అపార్థం కల్గించేలా ధ్వనించవచ్చు. అదే ఆ ప్రాంతీయభాషలో మనం మాట్లాడితే (వచ్చివుంటే) ఏ బాధా వుండదు. ఈ విషయంలోనూ, తెలుగువారు అభినందనీయులు. వారు ఏ ప్రాంతం వెళ్తే, సాధ్యమైనంతవరకు వారు ఆ భాషే మాట్లాడుతారు. కొన్ని ఇతర భాషలవారు మనప్రాంతం వస్తే వారికి తెలుగు వచ్చినా, వారిభాషలోనే మాట్లాడుతారు. అది వారి లోపం కాకపోయినా, వారు కూడా తెలుగులో మాట్లాడ్డం సమంజసం.

ఇక అవధి అనేదే లేని కళారంగంలోకి, సాహిత్యరంగంలోకి భాషా, ప్రాంతీయాభిమానులు తీసుకువెళ్ళడం విచారకరం. వేరు వేరు భాషలకి వేరు వేరు మతా లున్నట్లు ఎక్కడా వినంకదా?

అందుచేత శ్రీ నరసింహారావు వ్రాసిన వ్యాసాన్ని బట్టి (వ్యంగ్యమైనా) నిజంగా ఎక్కువమంది ఆంధ్రుల్లో లోపాలు లేవుగాని, చాల తక్కువమంది ఆంధ్రులలో (మానవ సహజమైన) లోపాలు కొన్ని ఉన్నట్లు చెప్పవలసివస్తుంది. వాటికి, ఆంధ్రత్వానికి సంబంధమేమిటి?

—గిరిజ, బి. ఏ.]



# సంస్కర్త

పతితులను సంస్కరించి, సన్మార్గ రతులను కావించి సంతోషించే కోవలో వారే అవధాని మాష్టారు. పాపపంకిలమైన ప్రాపంచిక, సుఖాలలో మునిగి తేలుతూన్న అనేక మంది, అభాగ్యులను, అనామకులను బ్రోచి రక్షించిన ఘనత అవధాని మాష్టారికే దక్కింది. తనయావజ్జీవితాన్ని సంస్కరణలో వెచ్చించి తన జీవితమే సంస్కరణ, సంస్కరణయే తన జీవితమనే అపూర్వస్థితి కొచ్చిన మహామహులనే చెప్పాలి మాష్టారిని. సంస్కర్తగా తానెన్ని సత్కార్యాలను నిర్వహించారో, ఆయనకే సరిగా తెలియదు. మాష్టారిని గురించి అతిశయోక్తి లేకుండా సత్యదూరం కాని విషయం ఒక్కటి చెప్పాలంటే 'ఆయన ఆశయాదర్శాలను నిత్య జీవితంలో సాధిస్తూ, సంతసించే మహాజ్ఞాని' అని మాత్రమే!

మాష్టారు రామాపురం చేరిన కొత్తల్లో జూదరిగా, త్రాగుబోతుగా, పచ్చి రౌడీగా తిరుగుతూ లోకానికి వెరవని వెంకన్న కాపు ఈనాడు పెద్ద మనుషుల జాబితాలో చేరి లక్షణంగా పెళ్ళాం బిడ్డలతో కాపురం చేసుకుంటూ, బ్రతుకుతున్నాడంటే అవధాని మాష్టారి చలవే!

ప్రక్కవూరి కరణంగారి పెద్ద కొడుకు భగ్నహృదయుడుగా మారిపోయి, వేళకు అన్నపానాదులు మాని పిచ్చి పిచ్చి వేషాలు వేస్తుంటే అర్ధ రాత్రికి అర్ధరాత్రి మాష్టారిని తీసికొని వెళ్ళి, చెట్టంత కొడుకును కరణంగారు దక్కించుకొన్నారంటే, అవధాని మాష్టారి ప్రతిభవల్లనే కాదా? ఇలా చెప్పుకుపోతే ఎన్నో సంఘటనలు కళ్ళకు కొట్టొచ్చినట్లు కన్పిస్తాయి.

అసలు మాష్టారి దగ్గరవున్న సంస్కరణాస్త్రాలలో దివ్యాస్త్రాలు, వారి సహజ వాగ్ధోరణి, ప్రతినిత్యం వారుచేసే పురాణ కాలక్షేపం ఈ రెంటితోనే మూడు పూవ్వులు ఆయన ప్రతిభ అలా వెలుగుతోంది.

మాష్టారిసంస్కరణకు అర్థం కేవలం, మన సమాజంలో జీర్ణించిన మూఢాభిప్రాయాలను, ఆచారాల పేరుతో పేరుకుపోయిన కుళ్ళును కడిగి వేయటమే కాదు, ప్రతిగృహంలోనూ కొద్దిపాటి అజ్ఞానంవల్ల చెలరేగి చిల్లరకలతలను త్రుంచివేసి, శాంతిభద్రతలను నెలకొల్పటం లాంటివికూడ చేస్తాయి.

ఇంతబాదరబందిపడి ప్రతినిత్యం పరుల జీవితాలను సరిదిద్దటంలో జీవితాన్ని ఖర్చు చేసికొనటం కేవలం నిస్వార్థంగానేనా? అనే ప్రశ్న వేస్తే "అవును" అని గట్టిగా చెప్పవచ్చు.

జీవితంలో మోసపోయి, దగాపడి, నానా బీభత్సమై లెక్కలేనన్ని చెడుమార్గాల పతనమైనవారిని సైతం ఓపికతో, సహనంతో, దయతో సంస్కరించి వారలకొక మార్గాన్ని చూపేవరకు నిద్రించేవారు కాదాయన.

అవధానిమాష్టారు బి. ఏ. చదివేరోజుల్లో కూడ, కళాశాలలో సంస్కారభావాలకు, విశాలహృదయానికి పేరెన్నికగన్నారు. అప్పట్లో కొనుతెగగొట్టె సినిమాలకుహాజరయ్యే

---

గంధం యాజ్ఞవల్క్య శర్మ

---

విద్యార్థులనుసంస్కరించటంలో కృతకృత్యులవుతూ వుండేవా రాయన. కాలపరిభ్రమణంతోపాటు అవధాని గారు, బి. ఏ. బి. ఇడి. గా మారి మాష్టారయ్యారు. అసలే సంస్కారణాభిమాని' తోడుగా బి. ఇడి. లో చదివిన ఫిలాసఫీ, సైకాలజీలు, వంట జీర్ణించుకోవటంతో, కాళ్ళదగ్గరికొచ్చిన హైస్కూలు వుద్యోగాన్ని కాదని కోరికోరి ఎలిమెంటరీ స్కూలుమాష్టారుగా వేంచేశారు. అలా చేయటానికి కారణం, తన ఆశయనిర్వహణ, ఆదర్శసాధనలు, పల్లెలలో కాని కొనసాగవని ప్రజాసేవకు అనువైన ప్రదేశాలు పల్లెలేనని, ఆయనకున్న స్థిరాభిప్రాయంమాత్రమే.

ఉపాధ్యాయవృత్తిలో చేరిన కొద్దిరోజులకే అవధాని మాష్టారి అసాధారణ ప్రతిభ సుగంధంలా నలుమూలలా వ్యాపించింది. మాష్టారు యెక్కడకు బదిలీఅయినా అక్కడల్లా ఆయనంటే ఓవిధమైన గౌరవం లభించేది.

కష్టాలలో సైతం ధైర్యాన్ని అవలంభించి, తను పవిత్రంగా నమ్మినదానిని నెరవేర్చటానికి వెనుకాడరాదనే ఆయన ప్రబోధాలు మామూలు మాటలైనా మాష్టారి నోటివెంటవెలువడటంతో అవేవో గావుం చేవి కానిస్తున్నట్లు.

మాష్టారిభార్య జానకమ్మగారి చావు తరువాత సంఘటనలు పరిశీలిస్తే మాష్టారి ప్రబోధాలు, కేవలం పరులకే కాదు, ఆయన నిత్య జీవితంలో కూడ వాటి నాచరించగలడనే అభిప్రాయం గలుగుతుంది.

అవధాని మాష్టారు రామాపురం బదిలీఅయి వచ్చిన కొద్దిరోజులకే టైఫాయిడ్ వచ్చి జానకమ్మగారిహాలోకయాత్ర చాలించారు. కంట తడిపెట్టనివారు లేరావూరిలో, అలాంటి కష్టదశలోనూ కష్టాలలో ధైర్యాన్ని విడనాడరాదనే మాటలను స్మరిస్తూనే తలవొగ్గాడా దైవనిర్ణయానికి మాష్టారు. ఆనాటినుండి అవధాని మాష్టారు సామాన్య మానవులుగా కాక ఒక అసాధారణ వ్యక్తిగాను, భగవత్స్వరూపంగాను మెదిలారు ప్రజలదృష్టిలో

ఆదర్శసాధనలో మాష్టారిది ఏనాడూ వెనుకంజకానే కాదు.

జానకమ్మగారు చనిపోయేనాటికి మాష్టారికి నిండా ౩౫ సంవత్సరాలు పూర్తికాలేదు. బంధుమిత్రులు, ఆప్తులు మాష్టారిని మళ్ళీ వివాహం చేసికోమని సలహా లివ్వసాగారు. మాష్టారి బాబాయి రంగనాథంగారు ప్రత్యేకించి కొన్ని సంబంధాలనుగూర్చి వాకబుచేసి మరీ వచ్చారు రామాపురం. కాని ససేమిరా మాష్టారి ప్రయత్నాలకు వొప్పుదల చూపలే. 'గతించిందేదో గతించింది. మళ్లీ నన్నాఊబిలోకి లాగకండి' అంటూ తమ నిర్ణయాన్ని బయటపెట్టారు. 'ఒంటరిగానే తన జీవిత శేషాన్ని తన చిట్టితల్లి పెంపకానికి వినియోగిస్తాననికూడ తేల్చి చెప్పారు. అవధాని గారి నిర్ణయానికి సామాన్యంగా అడ్డే లేదు.

"అదేమిటి పంతులుగారూ, తమరు పెద్దలు, మంచి చెడ్డా తెలిసినోరు; నాలాంటి యెదవని సైతం బాగుచేసినోరు; అటువుంటి మీరే అట్టా మాట్టాడితే, యెట్టా? ఆపసికందు కోసమైనా ఒక ఆడకూతురిచేత వట్టింట దీపం పెట్టించండి' అంటూ ఓనాటి సాయంత్రం కొలువుగట్టువ సంధ్యవార్చుకొని వస్తూన్న అవధానిగారితో, గతంలో వారిచే సంస్కరింపబడ్డ వెంకన్న కాపు అంటే మాష్టారేమన్నారు?

నిండుకుండలా ఓ చిరునవ్వు నవ్వి... "వెంకన్నా నీ వన్నట్లు పెద్దనే అయితే, నా కిప్పుడు మళ్ళ పెళ్ళెందుకు చెప్పు, అపని కందుకోసమే నే వెళ్ళాడాననుకో! రేపా వచ్చే మారుతల్లి, సరిగా చూడక పోతే నా చిట్టితల్లి శోభ యెంతటి పిచ్చి వంట అవుతుందో వూహించు" అన్నారు. వెంకన్న కాపు ఏదో నీళ్లు నమిలినట్లు మాట్లాడాడే కాని, మాష్టారి మాటలకు తిరిగి గట్టిగా సమాధానం చెప్పలేక పోయాడు.

అదే రోజు మంచిచెడ్డా మాట్లాడడాని కొచ్చిన కరణంగారూ, అదే విషయాన్ని కదిలించి చూచారు మాష్టారి దగ్గర.

సమాధానంగా మాష్టారు 'కరణంగారూ! కేవలం స్వార్థచింతతో మన మొక్కప్పుడాచరించె కార్యాలు యెంతటి దుష్ఫలితాలిస్తాయో, చెప్పలేం చూడండి. కాక పోయినా అనుభవించాల్సిన జీవిత సుఖాన్ని అనుభవించాం! ఇక అనాది మానవుడితో పోలిస్తే చెప్పలేం కాని, యీ కాలానికి 35 సం॥ లంటే 'సంధ్య' అన్న మాట, ఏమంటారు?" అంటూ సూటిగా ప్రశ్నించే పాటికి, కరణంగారు, మళ్ళీ మాట్లాడ లేక పోయారు.

అవధానిగారు తమ నిర్ణయాన్ని స్పష్టంగా చెప్పినా, వారి బాబాయి రంగనాథం గారు మరికొన్ని పాచికలు వేసి చూచారు.

ప్రతిరోజూ రివాజుగా పంతులుగారి పురాణ కాలక్షేపానికి, అతిభక్తి శ్రద్ధలతో హాజరయ్యే పెద్దముత్తైదువ సీతమ్మగారు, ఓ నాడు పురాణ కాలక్షేపానంతరం పంతులుగారిని పరామర్శించి "నాయనా! ఆ చిట్టితల్లితో యెన్నాళ్ళని అవస్థ పడుతూ చెయి కాల్చుకొంటావు? ఈ జీవితం వచ్చే పొద్దా, పోయే పొద్దా. నా మాట విను" అంటూ తల్లిలా బుజ్జగించింది. అందుకు మాష్టారు తల్లిదగ్గర మసలే కొడుకు లాగనే "పిన్నిగారూ! మానవ జీవితాలలో వచ్చే ప్రొద్దులేవో, పోయే ప్రొద్దులేవో మనం నిర్ణయించలేము గాని యీ క్షణిక జీవితంలో ఆటు పోటు లెప్పుడు సంభవిస్తాయో ఎవరికి తెలుస్తవి కనుక? యీ జన్మకు చేతులు కడుక్కొన్నాను. మళ్ళీ నన్నా మాయలో కాహ్వానింపకమ్మా" అంటూ నమస్కరించాడు. సీతమ్మగారు మాత్ర మేమిచేస్తారు? 'మహాజ్ఞానికి మనమూ చెప్పేవాళ్ళు' మనుకొంటూ, 'సుఖీభవ నాయనా' అంటూ సాగిపోయారు.

రంగనాథంగారు చివరిసారిగా ప్రయత్నించిచూచారు.

వేకువజామున నిద్రమేల్కొని "పంజీకటి కవ్వల యెవ్వం డేకాకృతివెల్గు అతని నే సేవింతున్" అంటూ దైవప్రార్థన చేసికొంటూన్న పంతులుగారిని "నాన్నా నీవు పెళ్ళెందుకు చేసికోవూ" అంటూ ప్రశ్నించిన చిట్టితల్లికి, వెంటనే సమాధానమేం చెప్పాలో తోచక గతుక్కుమన్నారు మాష్టారు. ఆ అమాయికకు సమాధానమెలా యివ్వాలో వెంటనే ఆలోచింపలేక పోయినా, యీ ప్రశ్న ఆ చిన్నహృదయంలో వుద్భవించలేదని గ్రహించారు. అందుకే ఆ చిట్టితల్లి మనసు నొచ్చకుండా. ప్రక్కగదిలోవున్న బాబాయికి వినబడేలా "తప్పమ్మా. జీవి, ఒక జన్మలో జన్మించే దొకసారి మరణించేదొకసారి," అందుకే పెళ్ళిచేసికొనేది వొకసారే, ఈ ధర్మాన్ని భగవంతుడు మనకు ప్రసాదించారమ్మా. ఈ ధర్మాన్ని మన మపవిత్రం చెయ్యకూడదు కదూ?" అంటూ బుజ్జగించారు. ఈ మాటలు విన్న రంగనాథంగారు చాల అభిమానపడి మరునాడే రామాపురంనుండి వెళ్ళిపోయారు. దానికి కారణం, ఆయన తన యాభయ్యోపడిలో మూడవ వివాహం చేసికోవటమే.

మాష్టారిలా అనటానికి కారణం, తన నిర్ణయాన్ని ఖండితంగా చెప్పటమే కాని పోటు మాటగా బాబాయి మనస్సు నొప్పించటం కానే కాదు. అసలా మాటకొస్తే మాష్టారి గారికి వారి బాబాయంటే భక్తిభావం, పితృభావం పెనవేసికొనే వున్నాయి. రంగనాథంగారిలా చిన్నపుచ్చుకొన్నారని తెలిసి మాష్టారి మనసు చివుక్కుమంది. తనకు చెప్పకుండా బాబాయి వెళ్ళిపోయినందుకు బాధవేసింది. కాని యేంలాభం. బాబాయే తనకు కన్పిస్తే క్షమాపణ కోరేవుండేవారు. అవసరమైతే ఆయన మనసును సంస్కరించేవారు.

మాష్టారి వివాహసందర్భంలో యిలాగే మరికొందరు జోక్యంచేసికొని, వారి నిశ్చయానికి కలవరపడి విరమించుకొన్నారు తమ ప్రయత్నాలను. అలా జోక్యంచేసికొని విఫలురైనవారెవ్వరూ, యీషణ్మాత్రం బాధపడలేదు, ఆయనంటే అసహ్యాన్ని పెంపొందించుకోలేదు మాష్టారి బాబాయిగారొక్కరుతప్ప. పైగా మరికొందరికి మాష్టారంటే భక్తిప్రపత్తు లెక్కువయ్యాయి.

అవధానిమాష్టారుమాత్రం తనకు జరిగిన పరీక్షకు, ఆత్మవిశ్వాసంతోనూ, ధైర్యంతోనూ, త్రికరణశుద్ధితోనూ ఎదురునిల్చారు ఓ ప్రక్క యిందరిమాట కాదంటున్నాననే బాధావీచిక పొడచూపినా!

ఇంత విషయం ఎందుకు చెప్పాల్సివచ్చిందంటే, మాష్టారి ఆశయాదర్శాలకు ఆచరణకు గల సంబంధాన్ని తెలియజేయటానికే.

* * *

ప్రశాంతంగా మామూలుదారినే నడుస్తోన్న మాష్టారి జీవితశకటం, ఓ నాడు ఆశించని ఓ వొంపు తిరగటానికి దాసనే పాత్రధారి కారణమౌతాడని యెవరూహించారు?

దాసంటే ఎవరో కాదు, మాష్టారి పురాణ కాలక్షేపానికి రివాజుగా హాజరయ్యే సీతమ్మగారి పుత్రరత్నమే! అసలు పేరేదోగాని వ్యవహారనామం మాత్రం దాసనే ప్రపంచానికి తెలుసు.

దాసు పట్నంలో బి. ఎస్‌సి. చదువుతూ వున్నవాడు కాస్తా పిడుగులా ఊడిపడ్డాడోనాటి సాయంత్రం రామాపురానికి — వస్తూనే అత్యవసరంగా తనకు 'ప్రక్కింటి సరోజతో పెళ్ళికావా'లంటూ కూర్చున్నాడు. సీతమ్మగారిగుండెలు గుభేలుమన్నాయి. తమవర్ణంగాని పిల్లను వివాహమాడతాననటం! అదికాక తరతరాలనుండి ఆ వెంకయ్యగారి కుటుంబానికి తమకి బద్ధవైరం కూడాను! 'కూడదని' చెప్పిన సీతమ్మగారికి 'వీల్లేదని' ఖండితంగా పలికిన తండ్రి రాఘవయ్యగారికి "కూడాలి, వీలుపడాలి" అంటూ సమాధానం చెప్పాడు దాసు. ఎందరు ఎలా చెప్పినా లాభం లేకపోయింది. ప్రతినిత్యం రాద్ధాంతాలు, తగాదాలు — సీతమ్మగారి హృదయం క్షోభించింది. చెట్టంత కొడుకు చేతికి కాకుండా పోతున్నాడనే బాధతో...కంట తడితో సీతమ్మగారు అవధాని మాష్టారిదగ్గరికొచ్చి గాథంతా చెప్పి దాసు మనసుమార్చి పరిస్థితులు చక్కబరచమని బ్రతిమిలాడింది.

"సరేలే పిన్నీ...ఏదో చిన్నతనం... దాసునోసారి నేను రమ్మన్నానని చెప్పూ' అంటూ భరవసా యిచ్చారు మాష్టారు.

ఆనాటి సాయంత్రం దాసు, మాష్టారు రామాపురపు పిల్లకాలువవొడ్డున కూర్చొని మాట్లాడి, చాల ప్రొద్దుపోయాక తిరిగి వచ్చారు — ఇంటికి తిరిగివచ్చిన మాష్టారిలో కొద్దిమార్పు కానవొచ్చింది. ఇన్నాళ్ళుగా మాష్టారికి మరొకరిని సంస్కరించటమే తెలుసుకాని, దాసుతో మాట్లాడాక తననెలా సంస్కరించుకోవాలో కూడ గోచరమైంది.

'మాష్టారూ చూడండి! నేనే తన సర్వస్వమని నమ్మిన ఓ అమాయకురాలిని ఎలా తిరస్కరించమంటారు? మీ కేపవిత్రభావాన్ని జానకమ్మగారిపట్ల చూపించారో, అదే భావాన్ని, అంతే పవిత్రతతో, నేనూ, నా సరోజపైవు ప్రసరింపనీయాలంటారా? లేదా?'అని దాసుప్రశ్నిస్తే, మాష్టారు నిరుత్తరులై, సమాధానంకోసం తికమకపడి 'అవుననుకో దాసు' అంటూ అంగీకరించారు.

"అందుకే మాష్టారూ! మనస్ఫూర్తిగా, పవిత్రంగా నేను నమ్మినదానిని, త్రికరణశుద్ధిగా ఆచరించటానికి ప్రయత్నిస్తాను. కాదనే నైతికబలం మీకుందా?" అన్న దాసుకు ముక్తసరిగా 'లేదు' అనే సమాధానమిచ్చారు మాష్టారు.

ఆ రాత్రి మాష్టారిలో ఆలోచనా తరం



# సంస్కర్త



గాలి ఉవ్వెత్తుగా లేస్తూ పడుతూ, చిందరగా ఛిద్రాలయ్యాయి. మథనపరిచాయి. దాసు వాదనలోనూ సత్యం లేకపోలేదనిపించింది. ప్రేమకు వివాహాలకు వర్ణభేదమొక పరిహద్దు కాదనిపించింది; అవును, దాసును ప్రేమిస్తున్నట్లు, సరోజ వ్రాసిన జాబులు కళ్ళముందర కన్పిస్తూ, దాసూ సరోజల బాంధవ్యాన్ని నిరూపిస్తుంటే, కాదటానికి తనకేం హక్కుంది? సాంఘిక నియమాల పేరుతో, దాసును నీచంగా వర్తించమంటూ శాసించటానికి యెవరికి అధికారముంది? అసలీ దోషభూయిష్ఠమైన సమాజధోరణి నెందుకు సంస్కరించకూడదు?

అవధాని మాష్టారిలో వున్న మరొక సద్గుణం—తన విధానము లోపభూయిష్ఠమని గ్రహిస్తే తక్షణం సరిదిద్దుకోగల ఉదారతే.

తెల తెలవారుతూనే కొండంత ఆశతో వచ్చింది సీతమ్మగారు, "ఏం నాయనా" అంటూ. "అవును పిన్నిగారూ! దాసు చెప్పిందాంట్లోనూ అర్థం లేకపోలేదు. అయినా యీ కాలంలోనూ పాత ఆచారాలను, నియమాలను పట్టుకు వూగులాడటం కూడ వాంఛనీయం కాదు. కాలమాన పరిస్థితులనుబట్టి మనుషులు మనస్తత్వాలూ మారాలి" అంటూ మొదలెట్టి, చివరికి "వాళ్ళిద్దరి అభీష్టప్రకారం చేయటం తనకిష్టమే" నన్నట్లు తేల్చిచెప్పారు మాష్టారు. సీతమ్మగారు మారు మాట్లాడలేకపోయారు. అవధానిలాంటి అబ్బాయి చెప్పటం దానికి తను తిరిగి మాట్లాడటమూ, అనుకొంది.

కాని సరోజ తండ్రి వెంకయ్యగారు తన పిల్లను దాసుకిచ్చి వివాహం చేస్తాడా అన్నది మరో ప్రశ్న. ఈ భారం మాష్టారిమీదే పడ్డది.

సమస్యలతో అతిసులువుగా పోట్లాడగల మాష్టారికి, యీ సమస్యా పరిష్కారంలో మాత్రం కొన్ని చిక్కులు ప్రారంభమయ్యాయి. వెంకయ్యగారు అందరిలాంటి మనిషి కాదు. మీ అమ్మాయిని దాసుకిమ్మని మాష్టారుగాని మరెవ్వరైనాగాని చొరవచేసి అడిగితే, తక్షణం ఆ అమ్మాయిని మరొకరికిచ్చి చేతులు కడుక్కోనేరకం. రామాపురంలో మాష్టారికి తెలియనివారు కాని మాష్టారుదగ్గరకు రానివారుగాని లేనేలేరని చెప్పాలి, ఒక్క వెంకయ్యగారిని మినహాయించి. వెంకయ్యగారి విషయం చెప్పాలిసివస్తే, ఆయన అతి ఖచ్చితమైన మనిషి. ఒకరితో లావాదేవీలు మరేలాంటి సంబంధాలు పెట్టుకొనే మనిషి కాదు. 'కులాసానా' అని ప్రక్కవాణ్ణి పలకరించే పాపానా పోడు; పోనీ, మరెవ్వరైనా క్షేమసమాచారాలను కూర్చి వాకబు చేస్తే, మోమాటానికైనా వారికి తిన్నగా సమాధానమిచ్చే మనస్తత్వమూ కాదాయనది. ప్రక్కవూరిలో దగ్ధయోగం జరిగితే, ఇక్కడ మడిగోచీపెట్టి జాగ్రత్తపడేపాటి మానవుడు.

మాష్టారి, 15 ఏండ్ల మాష్టరుగిరిలో 20 ఏండ్ల జ్ఞానసముపార్జనలో వివిధ మనస్తత్వాలుగల వారిని చూచినా, వెంకయ్యగారి పాత్ర కొత్తగానే వుంది.

మాష్టరుగారికి మాత్రం దాసునో ఒడ్డున పారవేయాలనే సంకల్పం బలపడింది. అందుకే వుదయాన్నే పొలం వెళుతూన్న వెంకయ్యగారికేసి ఓ నమస్కారాన్ని పారవేసి, 'కులాసానా' అంటూ సాదరంగా పల్కరించారు. తీరా దానిఫలితం చూచాక తానా పనిచేయటం సమయోచితం కాదేమోననిపించింది.

ఎలాంటివారినైనా, తన సంస్కరణాస్త్రాలతోనూ, వాగ్ధోరణితోనూ తన వారినిగా చేసుకోగలననే, మాష్టారి నమ్మకం రెండవసారి దెబ్బతింది. ఒకసారి దాసుదగ్గర—మరోసారి వెంకయ్యగారివద్ద. కాని ఈ సారి మాష్టరు పట్టుదల మరీ ఎక్కువైంది!

మాష్టారు రాత్రింబవళ్లు తన జీవితనౌకకు చుక్కాని కావాలనే తాపత్రయంలో నిమగ్నులయ్యారని గ్రహించిన దాసుకు మాష్టారిమీద అమితమైన భక్తిశ్రద్ధలు గురికుదిరాయి.

అవధానిగారు కొద్ది దినాలలోనే గ్రహించిన మరికొన్ని ముఖ్యమైన విషయాలతో తమ కార్యక్రమాన్నే మార్చి మరో నూతన స్వరూపాన్నిచ్చారు.

గాలి తాకిడికి విచ్ఛిన్నమైన మేఘావళిలా చిక్కులన్నీ విడిబడి పోవటానికి కారణభూతురాలైన మరోపాత్ర సమయానికి తారసిల్లింది మాష్టారి దృష్టిపథంలో. ఆమె పూర్వసువాసిని-సుశీలమ్మగారు.

సుశీలమ్మగారు, బాలవింతువుగా రామాపురంలో తన జీవనయాత్ర సాగించింది. సుశీలమ్మగారిలోనూ చాల ప్రత్యేకత వుంది. ఆమెలోనూ చాల అభిప్రాయాలు, లెక్కలేనన్ని ప్రతిభలు యక్షనిక్షిప్తమై వున్నాయి. వాటిలో అనన్య సామాన్యమైన ప్రతిభ, యెదటివారెంతటివారైనాసరే, యిట్టేవారి మనసులోని అంతరార్థాన్ని గ్రహించివేయగల శక్తి, ప్రతివాదు లెంతటి ఘటికులైనా, నిమేషమాత్రంలో వారిని తనవాదనతో లొంగదీసుకోగల శక్తి ఆమెకు కరతలామలకాలు. అసలా రామాపురంలో మాష్టారి ప్రతిభమీద దెబ్బతీయగల సమర్థతగలిగివుండి సబబుగా వుండటానికి కారణం, కొద్దో గొప్పో ఆమెకు మాష్టారి విధానాలు నచ్చటం వలన, ఆమెకు పురాణశ్రవణంలో ఆసక్తి వుండటంమూలాన్నేమో.

సామాన్యంగా తినా, గుడువా వున్న స్త్రీలు ముఖ్యంగా వితంతువులు, యెవరికీ తగాదాలు పెట్టకుండాను, అటుమాట ఇటు ఇటుమాట అటు చెప్పకుండానూ వుండలేరు. కాని అంతటి శ్రీమంతురాలైన సుశీలమ్మగారలాంటిది మాత్రంగాదు. అనవసర విషయాలలో కల్పించుకోదు. అంత అవసరమేవస్తే కొద్దో గొప్పో తనకు లాభించనిది అసలు కల్పించుకోదు. ఇదే ఆమెలోని ప్రత్యేకత. రామాపురంలో ఉపాధ్యాయ వృత్తిలో చేరిన క్రొత్తలోనే మాష్టారికి సుశీలమ్మగారిని గురించి యెవరో మాటల సందర్భంలో చెప్పారు. ఆనాటినుండి సుశీలమ్మగారు కొద్దిగా పరిచయమే.

పురాణ కాలక్షేపానికి వేంచేసిన సుశీలమ్మ గారిని మాష్టారు ఆరోజు శ్రద్ధగాపలకరించి మంచీచెడ్డా వాకబుచేసి, ఆమె భక్తిని ప్రశంసించారు. తిరిగీ వెళ్ళిపోయేముందొకసారి కన్పించమని చెప్పారు. పురాణశ్రవణానంతరం సుశీలమ్మగారు 'విశేషమేమంటూ' ఆప్యాయంగా ప్రశ్నించారు.

"అబ్బే మరేంలేదు," అంటూ మాష్టారు దాసు సమస్యను ఆమె ముందర పడవేసి సత్వర పరిష్కారమార్గాన్ని అభ్యర్థించారు. "సుశీలమ్మగారూ! ఈ భారం మీమీదుంచాను, కాదనకండి" అని మరీ మరీ చెప్పారు.

సుశీలమ్మగారు కాదనలేదు, అవునూ అనలేదు. చిరునవ్వు నవ్వి "ఆలోచిద్దాం మాష్టారూ! ఆఅమ్మాయి నాదగ్గరకు పాటలు నేర్చుకోవటానికి వస్తుంది. అసలు దాని మనసులో ఏముందో తెలుసుకోవాలిగా!" అంది.

"కనుక్కోవటానికేముంది? ఆ అమ్మాయి దాసుకువ్రాసిన జాబు నేను చూచాను. తన తల్లితండ్రులు తన మేనరికం చేయాలని చూస్తున్నారని, కానీ తను దాసునే వివాహమాడటానికే నిశ్చయించుకొన్నానని వ్రాసింది కాబట్టి మీరు ఆ అమ్మాయిని కనుక్కోవాల్సిందల్లా, సాహసించి పటణానికి ఒంటరిగా రిజిస్టరు పెళ్ళికి రాగలదేమో కనుక్కోవటమే" అన్నారు అవధానిగారు.

సుశీలమ్మగారు మరో చిరునవ్వు నవ్వి "ఎంతటి అమాయకులండీ మాష్టారూ! 'మీరు మాట్లాడేజాబు దాసుకు నెలరోజులక్రితం అందింది. అంటే మన్య వ్యవధి '30 దినాలు' మీరే చెప్పారుగా 18 రోజులలో భారత యుద్ధంలాంటిదే ముగిసిందని. ఎవరిమనసులు, ఎప్పుడు ఎలావుంటాయో, ఎలామారతాయో

(47-వ పేజీ చూడండి)

# రాగరేఖలు

పన్నెండేళ్ళు నిండి పదమూడో ఏడు వస్తుంది. ఆ వేళే పుట్టినరోజు. వరహాల్ని తెల్లతెల్లవారగట్లే లేపి తలంటిపోసింది వాళ్ళమ్మ.

తలంటిన దగ్గరనుంచీ రమణమ్మకి "ఈ ఏడు కూతురికి పెళ్ళిచెయ్యాలి" అని ఒక్కటే ఆలోచన పట్టుకుంది. వరహాలు జబ్బసత్తువ వున్న పిల్ల. కనుక నే వయస్సుకన్నా ముందు శరీరం నునుపుదేరింది. పొడుగు ఎదక్క పోయినా కాస్త నిండుగా, బొద్దుగా, ఎక్కడ వుండే అంగసౌష్ఠం అక్కడ... చక్కగా పెరిగింది వరహాలు. వంట వండుతున్నంతసేపూ రమణమ్మ పిల్లపెండ్లి గురించే ఆలోచిస్తోంది.

"అబ్బా! ఆయన మరీని. ఎక్కడి జాప్యం దాపురించిందబ్బా" అంటూ కొంచెం తీవ్రంగానే ఆలోచించనారంభించింది. ఆలోచనల తీవ్రతలో అప్పుడే రెండు బొబ్బట్లు కూడా మాడ్చేసింది. అవునుమరి—ఈవాళా నిన్నటిదీనా, ఈ విషయం రెండేళ్ళ నుంచి తాను వెంకన్న పంతులుగారితో చెపుతూనే వుంది.

"ఒక్కగానొక్క అమ్మాయీ...దీనికేనా ఈ జేరకుండా పెళ్ళిచెయవద్దుటండీ!" అంటూ ఎన్నిసార్లు చెప్పిందని—

"ఒసే!...తలుపు తీ"...అంటూ కేక వినపడింది.

"అమ్మాయీ...నాన్నొచ్చారు తలుపు తియ్యి"...అని వంటింట్లోంచే కేకపెట్టింది రమణమ్మ. రమణమ్మ గొంతు విన్నవాళ్ళు, అచ్చం కోకిలకంఠమే అనటంకద్దు. కాని అమ్మాయి పెళ్ళి ఆలోచనల బరువుతో గడ్డకట్టి బొంగురుపోయింది.

"పంజాబ్ సింధు గుజరాత్ మరాఠా... ద్రావిడ వుత్కళవంగా"...అని పాడుతున్న వరహాలు, తటుక్కున లేచి, కుట్టుతున్న సూది జేబురుమాలూ—చేతిలోనే వుండగా పాట కూడా మానకుండానే వీధితలుపు దగ్గరకు పరుగెట్టింది. నిజానికి వరహాలు పరుగెడుతున్నప్పటికంటె, నడుస్తున్నప్పుడే ఎక్కువ హుందాగా వుంటుంది. సాజాగుగా భుజాలు కదలడం అది ఎంతో చక్కగా వుంటుందని! తలుపు తీసింది. తీస్తూనే 'నాన్నా!' అంది ముద్దుగా.

"ఏంమ్మా వరాలూ—' అంటూ వెంకన్న పంతులు అమ్మాయిని పైకెత్తేడు. ఒక్కమారుగా చేతిమీద వేసుకుని లోపలికి తీసుకు వచ్చాడు. తిన్నగా వాళ్లఅమ్మదగ్గరకే తీసుకెళ్ళాడు. "ఏవే! మా అమ్మకి ఏం తెమ్మన్నావే?" అన్నాడు. చిన్నప్పటి పైలాపచ్చీసువల్ల కాస్త లొంగిపోకపోతే, అసలు వెంకన్న పంతులుది ఏనుగుబలమే!!—అతని గంభీర కంఠంలో కొండవాగులు సుళ్ళు తిరుగుతాయి. తన పాతికేళ్ళ సర్వీసు ఆ పల్లెటూరు బడికే దానంచేయడంవల్ల, ఆట్టే అంత లౌక్యం అబ్బలే దతనికి.

అరటాకులో బొబ్బట్లవుండ పళ్ళగా పరుస్తూ భర్తకేసి కోరగా చూసింది రమణమ్మ! "అమ్మాయికి ఏంతెస్తారు?.. మొగుణ్ణి తెండి త్వరగా!..." అంది. తన మనస్సులోని బాధంతా వెడలగ్రక్కేసింది రమణమ్మ.

'[illegible]'

"యిదిగో — యీ బట్టలు చూడూ!" అన్నాడు వెంకన్నపంతులు. తన భార్య ప్రస్తావించిన విషయాన్ని విననట్టేలేదు. చేతి సంచీలోవున్న బట్టలపేకట్టు విప్పుతున్నాడు. "ఇదుగో—యీ చీర నీకు... బాగుందా? నాకివి...మా బంగారుతల్లి కివి" అన్నాడు గబగబా. నవ్వుతూ ముందర పళ్ళు పైకెత్తి కత్తిరించిన మీసాలు ముక్కుకు తగిలించాడు. అంచేతనే కొబోలు అదోవిధముగా చూచాడు.

పొయ్యి పొగకి రమణమ్మ కళ్ళనుండి నీళ్లు వస్తున్నాయి. కళ్ళు తుడుచుకుంటూ పెదవిమీద చిరునవ్వు చిందులాడిస్తూ 'మనకెందుకండీ, యీ బట్టలు! మీకు మరీ చిన్నతనం వస్తోంది' అంది. వెంకన్న పంతులేమీ జవాబు చెప్పలేదు. అదేదో శృంగారంగా నవ్వేడు. అతనికి రమణమ్మంటే చెప్పలేనంత గారాం, ముద్దున్నూ. తాను ఏభయ్యోపడిలో ప్రవేశిస్తున్నాడా, అయినా ఇంకా ఆమెతో సరసాలాడుతూ, అప్పుడప్పుడూ చీవాట్లు తింటూనే వుంటాడు.

వరహాలు తన బట్టలపేకట్టు విప్పి చూచుకొంటోంది. పరికిణీ తీసి భుజంమీద వేసుకుంది. జాకెట్టు చేతులు ఎలా కుట్టాడోనని పరిశీలిస్తోంది. రమణమ్మ వరహాల్ని చూస్తూ—

"యివేమండీ—వోణీలు తేలేదేం? అమ్మాయికివేళ పమిటె వేయించాలి" అంది. ఆ మాటలతనికి భీకరంగానే వినిపించాయి.

"అదేమిటే అలా అంటావు? మా అమ్మకి అప్పుడే పవిటెందుకే నీ మొహంలా వుంది" అంటూ గొణిగాడు వెంకన్నపంతులు. కూతురంటే అతనికి వెర్రి ఆపేక్ష. అతని కళ్ళకి వరహాలు ఎదుగుతున్నట్లే కనిపించలేదు. నిన్నగాక మొన్ననే కదా పుట్టిందని ఆ వెర్రిబ్రాహ్మడి వుద్దేశ్యం.

"చాల్లెండి. ఏళ్ళు ఎగసన్నమవుతుంటే బుద్ధి దిగసన్నమవుతోంది. మాఅమ్మా నేనూ కూడా పదమూడేళ్ళకే పెద్దమనుషులమయ్యాం. ఆ కాస్త పనీ జరక్కుండా, మూడుముళ్లూ పడితే, విన్నవాళ్లంతా ఎంత ఆనందిస్తారు? ఇంకా చిన్న కూచే అనుకుంటూంటే సరిపోయిందికాబోలు." అంది రమణమ్మ. ఝుణఝుణ లాడించేసింది.

"బావుందే-నీ చాదస్తం నీవూనూ! మా తల్లికి బి. ఏ. ప్యాసయ్యేదాకా పెళ్ళే చేయను" అన్నాడు పరిహాసంగా నవ్వుతూ.

"చాల్లెండి! మతిపోలేసని, ఆడదానికి బి. ఏ. లు, యం. ఏ. లూనూ!...సంబంధం వెతికి తీసుకురండి. వైశాఖంలో పెళ్ళి చేసెయ్యమ్మా!" అని రమణమ్మ సాజాగుగా కంఠం సవరించుకుంటూ చెప్పేసరికి, అతనికి మారుమాట తోచలేదు. వెర్రి వెంకన్నపంతులు హిందూ హృదయంలో ఒక్కసారిగా "అష్టవర్షే భవేత్కన్యా..." అన్నవాక్యం రింగురింగుమంది.

నాన్నకీ అమ్మకీ తన పెండ్లివిషయంలో వాదాలు జరుగుతుంటే వరహాలు చల్లగా జారుకుంది. తనగదిలోకి వెళ్ళి అల్లికపని చూచుకుంటోంది.

## 2

భోజనాలకు కూర్చున్నారు. బొబ్బట్లు తింటున్నంతసేపూ, వెంకన్నపంతు లెన్నిసార్లు పొగిడాడని! ఎన్ని తిన్నాడో అతనికే తెలియలేదు, పెళ్ళికొడుకున్న కుర్రాళ్ళ జాబితా చదువుతున్న రమణమ్మకీ తెలియలేదు. వరహాలికి తల్లిమీద ఎప్పుడూ యింత కోపం రాలేదు. వెంకన్నపంతులు ప్రతిదానికి "ఊఁ! ఊఁ!" అంటూనే వున్నాడు. అతని మనస్సు ఆ విషయాన్ని ఆటేపట్టించుకుంటున్నట్టూ లేదు. 'అల్లుడుగాడిదల'



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో 14 వ మంత్రిగా శ్రీ అనగాని భగవంతరావుచేత డిసెంబరు 26 న గవర్నరు శ్రీ సచార్ ప్రమాణ స్వీకరణ చేయించారు.

# ★ రాగరేఖలు ★

నిరంకుశత్వము, పనికిరాని పెంకితనము అతని బుర్రలో బాగా పనిచేస్తున్నట్టున్నాయి.

చివరికి సందేహిస్తూనే ఇలా అన్నాడు: 'ఏమమ్మా వరాలూ! ఈయేడు పెళ్ళి చేసుకుంటావా అమ్మా?' అని ముద్దుగా అడిగాడు. మాటవరసకే అడిగాడు. కాని వరాలు మాత్రం మూతి బుడాయించింది. తండ్రి ప్రశ్నకు జవాబు చెప్పలేదు. అంగీకార సూచనకూడా చేయలేదు. కేవలం మౌనం వహించి చేయికడుక్కోడానికన్నట్టుగా చురుగ్గా లేచి వెళ్ళిపోయింది. వెళ్తున్నప్పుడు అడుగులు కొస్త జోరుగాపడ్డాయి. బడిపంతులు గనుక కూతురుకు యిష్టంలేని ప్రసంగం కానెత్తేనని యిట్టే గ్రహించాడు.

అసలే నుగ్గునుగ్గుల తలేమో—తలంటి పోసుకుంటే మరీ బాగుంది. ముంగురులు ఉంగరాలుగా చుట్టబెట్టుకుని వ్రేలాడుతున్నాయి. సాధారణంగా స్థూలంగా బొద్దుగావున్న పిల్లలు మద్దుగా వుంటారు. కాని వరహాలు విషయంలో మటుకు యీ విషయం సుతరామూ సరిపడదు. వరహాలు బలేచురుకుగా వుంటుంది. కనుకనే అందరికీ స్నేహితురాలైంది. బంగారంలాంటి శరీర ఛ్ఛాయకి ఎర్రరంగు పూల పరికిణీ, కాఫీ పొడుంరంగు వోణీ ఎంతో అందమిచ్చాయి. అందంలోనూ, అలంకరణలోనూ యెంత నేర్పరితనం లేకపోతే, వాళ్ళ పంతులమ్మగారు పన్నెండు రూపాయలుపెట్టి ఎంబ్రాయిడరీ ఫ్రేము, సూదులు, పూలుపిడులు, దారాలు, పుస్తకాలు కొనిసుంది వరహాలకి! వరహాలు అసలుపేరు రత్నమాల. అయినా అంతా ముద్దుగా వరహాలని పిలవడమే అలవాటయిపోయింది.

ఎనిమిదేళ్ళ నుంచీ ట్రాన్సఫర్ వగైరా వడిదుడుకులేమీ లేక పోవడం చేతను, వెంకన్న పంతులుగారి కుటుంబం చాలా మంచిదవడం చేతనూ, ఆ వూళ్ళో వాళ్ళ జీవితం చీకూచింతా లేకుండా సుఖంగానే గడిచిపోతోంది. పైగా వరహాలు తెలివితేటలంటే అందరికీ అభిమానమే.

కొత్త కంకువా పైట వేసుకోవడంచేత, మెడమీద చక్కిలిగింతలు కలుగుతున్నాయి వరహాలకి. అమ్మా, నాన్నా తన పెళ్ళిమాట ఎత్తినందుకు మొదట్లో కొస్త కోపంవచ్చినా క్రొత్త ఆలోచనలు పెదవుల మీద బులిబులినవ్వుల తెలుపు పూస్తున్నాయి. ఎందుకో ఆమె మనస్సులో స్థిమితం కలగడంలేదు. యీగదిలోంచి ఆగదిలోకి, యిక్కడినుంచి అక్కడికీ, ఒకటే పచార్లు చేస్తోంది.

వరహాల్ని దీవించడానికని పంతులమ్మగారు స్వయంగానే వచ్చింది. వస్తూనే వీధిలోంచి 'వరహాలూ' అని పిలిచింది. త్వరత్వరగా పరుగెట్టి "రండమ్మా" అంటూ ఆమె చెయ్యి పట్టుకుంది వరహాలు. లోపలికి తీసుకెళ్ళి మంచంమీద కూర్చోబెట్టింది. త్వరగా కాఫీ, టిఫెను, యమ్మని తల్లితో చెప్పి వచ్చింది.

"యిదుగో వమ్మా—నీకు ప్రెజెంటు తీసుక్కొవచ్చాను. 'ఆంఖ్ కీ కిర్కిరీ' అని దీని పేరు. విశ్వకవి రవీంద్రుడిదమ్మ 'కంటిలోని నలక' అని చాలా బాగుంటుంది. దీని శైలి కూడా ఎంత చమత్కారంగా వుంటుందనుకున్నావు?" అంటూ చిరునవ్వు ముఖంతో చూస్తోంది సుశీలమ్మ.

సుశీలమ్మ మామూలు బి.యిడీ. యేకాదు, హిందీలో కూడా 'విశారద' ప్యాసయింది. కనుకనే హిందీలోగాని, తెలుగులోగాని, యింగ్లీషులోగాని-ఆమె ఎన్ని పుస్తకాలో చదివింది. స్వతహాగా తెలివైంది. కనకనే తన హెడ్ మిస్ట్రెస్ పనిని అతి నైపుణ్యంగా నిర్వహించుకు వస్తోంది. ఆడపిల్లల నందర్నీ కన్నబిడ్డల్లా చూచుకుంటుంది. అంచేతనే ఆమిడిల్ స్కూలుకు మరో నూరుమంది బాలికలను సంపాదించింది. వచ్చి మూడేళ్ళే అయినా—స్కూలెంతో అభివృద్ధి అయిందని ప్రతివారూ అనుకుంటూనే వుంటారు. తన ముద్దు శిష్యురాలికి తనకున్న విద్యంతా ధారపోద్దామని సుశీలమ్మ వుద్దేశ్యం. ఎన్నో బహుమతులిచ్చింది. ఎన్నో పుస్తకాలు చదివించిందామె. రవీంద్రుని యింగ్లీషు పుస్తకాలు చదివి బోధపరచేది. వరహాలుకి సుశీలమ్మమీద గౌరవంకన్న ప్రేమే ఎక్కువ. వరహాలు రాష్ట్రభాష ప్యాసైందంటే దానికి కారణం సుశీలమ్మే.

## 3

తాను చదివిన నవలల్లోని నాయికలతో తన్ను పోల్చుకునేది వరహాలు. నలుగురూ తన్ను మంచిదని పొగడ్డం వల్లనైతేనేం, సుశీలమ్మగారు "చాలా గొప్పదానివౌతావు వరహాలూ' అంటూ యిచ్చిన రిమార్కుని, తల్చుకున్నప్పుడైతేనేం-కొంచెం తనలో తానే గర్విస్తూవుండేది. తనకి సోమేశ్వరరావు మీద వున్న అభిమానం నవలల్లోని నాయికానాయకుల ప్రేమవంటిదా—కాదా! అని యిప్పటికీ సందేహమే! అయినా అలాంటి పెద్దవిషయాలకి అట్టే ప్రమేయం వుండే వయస్సుకాదుకనుక అట్టే యిబ్బంది కలుగలేదు.

వెంకన్నపంతులు ఆవూరు వచ్చిన మొదట్లో అతన్ని ఆదరించినది ఒక్క కరణం సుబ్బారావుగారే. వారింట్లో ఒకవాటా ఖాళీచేసి పంతులికి బసయేర్పాటుచేశారు. యిల్లు పెద్దదైనా చాలాకాలం అద్దె తీసుకోనేలేదు. బాగుండదని - తరువాత తరువాత నాలుగు రూపాయలు చొప్పున వెంకన్న పంతులు యిస్తూనే వున్నాడు. కష్టంగా గడుపు

(48-వ పేజీ చూడండి)

# ఊహాగానాలు

'క్రికెట్ ప్లీజ్' అన్నాడు కండక్టరు.

అందరిదగ్గరా 'టికెట్' అంటూ దాచిన పొమ్మ తిరిగి యిమ్మన్నట్టు గద్దించిన అతను పొంగుతున్న పాలమీద నీటి చుక్కలు పడ్డట్టు ఒక్కసారి చల్లబడిపోయి 'ప్లీజ్' అనే తోక తగిలించగానే ఆ ప్రత్యేక గౌరవంపొందే అదృష్టం కొందరికే వుందన్న సంగతి అవగాహన అయ్యే వుంటుంది. అందులో అందమైన అమ్మాయిలు రాకుండా వుంటారా?

పెక్కు మాటలేల?

సాంబానికెదురుగావున్న సీట్లో కూర్చుని బస్సు కుదుపులోకూడా తన్ను తాను మరచి 'రచన' చదువుతున్న అమ్మాయి వులిక్కిపడింది. పర్సుతీయటానికి గాజులు జాకెట్టులోకి చెయ్యిపోనిచ్చింది. అంతే!...కౌటుక ముసుగులో కరిగిపోతూన్న ఆ లేడికళ్లు ఏ రాక్షసుడో తరుముకొస్తున్నట్టు బెదరిపోయి అటూ ఇటూ చూశాయి. సన్నగా, పొడుగావున్న ఆ వేళ్లు పుస్తకంలో పేజీలన్నిటినీ ఒక్కసారి తిప్పివేశాయి. శత్రువుల చేజిక్కిన రాకుమార్తెలా చూసింది. 'అయ్యో!...నా పర్సు ఎవరో కొట్టేశారు' అంది కోయిలకంఠంతో. అందరూ గొల్లుమన్నారు.

'అందరూ తమ తమ దంత సముదాయపు సౌందర్యాన్ని ప్రదర్శించారు. బాగానే వుంది. కాని తనతోబాటు ఒకే తరగతిలో చదువుతూన్న ఈ సాంబమూర్తికూడా తన్ను వేళాకోళం చేయటమేనా? తోటి విద్యార్థి నన్నభావం పిసరంతైనా లేదు.'

ఇదీ ఆమె హృదయంలో చెలరేగిన భావ తరంపరల సారాంశం. 'పట్నం గనక దొంగలెక్కువగా వుంటారండి. మనం ప్రతివాడిమీద కన్ను వేసి వుంచాలి.' అని వుచితంగా సలహా యిచ్చాడు కండక్టరు. ఆమె పుస్తకం మూసింది. 'శారద' అని ఇండియన్ ఇంకుతో పెయింటు చేయబడిన అక్షరాలు కొట్టొచ్చినట్టు కనపడ్డాయి. బస్సు విడిచి దిగిపోదామని నిలబడింది. 'మరేం ఫరవాలేదు. టిక్కట్టు నేను తీసుకుంటాను. మీరు మరోవిధంగా భావించవద్దు.' అన్నాడు సాంబం (పదిసార్లు తనలో రిహార్సలు వేసుకుని.)

శారద అతని సాయాన్ని మొదలంటా తుంచివేసేదే! కాని పావుగంటలో కాలేజీ చేరుకోవాలి. అదికాక, బస్సు తన స్వంతమైనట్టు ఇంతసేపూ ధీమాగా ప్రయాణంచేసి ఇప్పుడు దిగిపోతే ఎలా? అందుకని సగం మనసుతో ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చుంది.

ఆ బస్సులోవున్న ఇద్దరు ముగ్గురు 'రోడ్ సైడ్ రోమియోలు,' 'ముసిముసి నవ్వులు,' 'వెకిలి నవ్వులు' లాంటి కొన్ని మచ్చుతునకలు ప్రదర్శించారు. అయిదు నిమిషాల్లో ఇద్దరూ కాలేజి మెయిన్ గేటు దగ్గర వున్నారు.

'థాంక్స్!...మీ రెండణాలు రేపు వడ్డీతో సహా తిరిగిస్తానులెండి...అలా విరగబడి నవ్వవలసినంత హాస్యం ఇందులో లేదు' అంది. ఆ మాటల్లో వీసె గుంటూరు మిరపకాయల కారం కనబడింది. 'క్షమించండి... నేను నవ్వటం అనుకోకుండా జరిగింది. మీకు కలిగిన ఆపదకు ఎవ్వరూ నవ్వలేదు. మీరేమీ భావించకుండావుంటే, అంతటి సురక్షితమైన స్థానంనుండి పర్సు దొంగలించటానికి ఏ మగాడికి ధైర్యంవచ్చిందని—ఒకవేళ పర్సు ఇంటిదగ్గర మర్చిపోయుంటారు.'

ఆర్. ఎం. చిదంబరం

సాంబం తాపీగా జవాబివ్వగానే శారద నాలిక్కరచుకుంది.

'సాయాన్ని ఉపసంహరించుకుంటున్నాను' అన్నట్టు అతనికేసి ప్రసన్నంగా చూసి వెయిటింగ్ రూంవైపు కదిలిపోయింది. ఆమె నడుస్తుంటే ఉదయ సూర్య కిరణాల కాంతిలో విచిత్రవర్ణాలలో మెరిసిపోతూన్న ఆమె సిల్కుచీరవంక కన్నార్పకుండా చూశాడు.

సాంబం గర్వంగా నవ్వుకున్నాడు. శారదతో మాట్లాడాలని ప్రయత్నించి విఫలులైన కాలేజి విద్యార్థులపేర్లు నలభై పేజీల పుస్తకంనిండా వ్రాయవచ్చు. అలాంటి శారద తనతో మాట్లాడటం లఘువృత్తి ఖండమైతే ఆమెకు తను సహాయం చేయగలడం గురువృత్తి ఖండం. శారద తల్లిదండ్రుల్ని గురించి అతనకేమీ తెలియదు. అవన్నీ నెమ్మదిగా తెలుసుకోవచ్చు. అతనికి క్లాసులో, చివరి గేలరీలో ఎడంపక్క మూలకూర్చోవటం అలవాటు—దానికొక్కారణం [illegible] ముగ్గురు నలుగురు మిత్రులు అతన్ని గుచ్చి గుచ్చి అడిగారు. అక్కడ కూర్చుంటే తనకు 'నల్లబల్ల' స్పష్టంగా కన్పిస్తుందని వివరించినా అసలురహస్యం వేరు. అక్కణ్ణుంచి పెద్దతలకాయల ఆటంకం లేకుండా శారద అద్దంలో ప్రతిబింబంలా స్ఫుటంగా కనిపిస్తుంది. ఆమెను చూస్తూకూర్చోవటం (పెద్దలదృష్టిలో కలి ముదురుతున్నందుకు చిహ్నమైనా) ఓ గొప్పఅనుభవం. ఎలాగూ సందర్భం దొరికింది. ఇంక ఆమెతో స్నేహాన్ని అభివృద్ధి చేసుకుని చివరకు వివాహంచేసుకోవాలి. ఇరవయ్యో శతాబ్దంలో వుండికూడా పెద్దలు నిర్ణయించిన 'బొమ్మకు' తాళికట్టటం అతనిదృష్టిలో అపరాధం.

ఆవేళ కాలేజీనుండి సాంబం ఆఫీసుకు వచ్చేసరికి పదకొండున్నరైంది. అప్పటికే మేనేజరు వచ్చివుంటాడని అతనికి తెలుసు. 'మిస్టర్ రోల్' ఆయనదగ్గరే వుంటుంది కనక అక్కడకువెళ్ళక తప్పిందికాదు.

సాంబాన్ని చూడగానే మేనేజరు సీతాపతిగారు తలెత్తారు.

"ఏంవయ్యా!...మిస్టర్ సాంబమూర్తీ. నీ చేతిగడియారం హార్ క్వాలిటీ X డియారం లావుందే! అయినా ఇంతటి సువిశాలమైన పట్నంలో నీకు టైం తెలియకపోవటం ఎనిమిదో చిత్రం," అని ఉరిమారు.

సాంబం దివాలాతీసిన మొహంపెట్టి 'క్షమించండి. కాలేజి విడిచిపెట్టాక సరిగ్గా ట్రెయిన్ అందలేదు' అన్నాడు.

'సరే!...ఏదో మనవాడివికదాని ఆదరించి వుద్యోగం యిచ్చాను. నువ్వితిన్నగా నడుచుకోకపోతే నల్లటోపీ తగిలించవలసి వుంటుంది - ఇదే చివరి హెచ్చరిక!'

'బ్రతుకు జీవుడా!' అని పిల్లిలా బయటపడ్డ సాంబం సింహంలా తన టైపు మిషను ముందుకూర్చుని ఏదో లెటర్ టైప్ చెయ్యబోయాడు. కాని ఖర్మ!...కీబోర్డు నిండా శారద ప్రతిబింబాలు కనిపించాయి. ఛీ!... ఏమిటి తనకీ చంచలత్వం! ఏదో కొకవిధంగా అన్నీ పూర్తిచేసుకుని సంతకాల కోసం ఆయనదగ్గరకెళ్లాడు. ఆయన ఒక్కొక్క వుత్తరం చదువుకుని ఎర్రసిరా గీతలుగీసుకుంటూ వెళ్ళారు. అందుకు సమాంతరంగా ఆయన నుదుటిమీద కూడా గీతలు పడ్డ

# ఊహాగానాలు

పోతూవున్నాయి. సాంబానికి అమాంతం ఆయన్ని మింగేయాలనిపించింది. కాని రెండువందల పైచిలుకు పౌనుల బరువున్న ఆ మనిషిని మింగటమెలాగ?...నల్లగా నున్నని శివలింగంలా-దుక్కలావున్నారు. కళ్లల్లో క్రూరత్వం తాండవమాడుతూంది. ఆకంపెనీ ఓ జర్మనీ ఆసామిది. అతను బక్కపల్చగా చీపురుపుల్లలా 'పుఫ్' అంటే వందపల్టీలు కొట్టేటట్టువుంటాడు. అందుకే గున్న ఏనుగులావున్న సీతాపతిగార్ని చూసి జడుసుకుని 'నువ్వు మేనేజరుగా వుండు బాబూ!' అని వుంటాడు. ఇది సాంబం అల్లినకథ - ఎవరు నమ్మినా, నమ్మకపోయినా అతను విశ్వసిస్తాడు.

'ఇదుగో మిస్టర్!...నీ బుర్ర ఎక్కడ స్వైరవిహారం చేస్తోందయ్యా? దాన్నిపట్టి యీడ్చుకురా. ఇవన్నీ రీటైపుచేయి'

ఈసారతనికి కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి. ఎందుకో, తనెంత కష్టపడిపనిచేసినా చివాట్లు తప్పవు - అయినా ఆయనకు తను చేసిన 'అవ్యక్త అపరాధ' మేమిటి? తను మార్నింగు క్లాసుకువెడుతూ కాలేజీలో ఇంటరు చదవటం ఆయన కిష్టంలేదా?...

ఆలోచించి ఆలోచించి అమాంతం ఊరుకున్నాడు.

## 2

తరువాత రెండు రోజుల వరకూ శారదతో మాటాడటానికి తగిన అవకాశం దొరకలేదు. నాలుగోనాడు అతను కాంపౌండులో అడుగుపెట్టగానే మిత్రుడొకడు ఎదురుపడి 'సాంబశివా! ఈమధ్య చాలా హుషారుగా కనిపిస్తున్నావు. ఏదో రహస్యంవుంది... అదిసరేకాని మెట్రోలో కొత్త సినిమా గురించి వినేవుంటావు. నిన్న నేను రెండు టిక్కట్లు అడ్వాన్సు బుకింగ్ తీసుకున్నాను. కాని వెంటనేరమ్మని నాన్నగారు టెలిగ్రాం యిచ్చారు. ఈ టిక్కట్లు అమ్మిపెట్టాలి' అనడిగాడు. సాంబం 'సరే' నని తీసుకున్నాడు.

తలవంచుకుని ఆలోచిస్తూ నడుస్తుంటే నవ్వుదొంతరలు గిలిగింతలుపెట్టాయి. తలెత్తి చూశాడు. అదుగో! సినిమాలోలాగ అప్పుడే 'విలన్' తయారు. శారదా, రమణా నవ్వుకుంటూ వస్తున్నారు. ఇద్దరిమధ్యా రెండడుగుల ఎడంకూడా లేదు. సాంబం సలసల కాగే నూనెలో ఈదులాడుతున్నట్టు ఫీలయ్యాడు. విజయపతాకం ఎగురవేద్దామనుకుంటుంటే ఈ ఋణసంఖ్య లేమిటి?

'గుడ్‌మార్నింగ్ మిస్ శారదా!...మీరెప్పుడు వచ్చారు? మీకోసం బస్ స్టాప్ దగ్గర పావుగంట వేచివున్నాను. ఏదైనా మారువేషంలో వచ్చారా ఏమిటి?'

'సారీ!—ఇంక సిటీబస్‌లో వెళ్ళకూడదని శపథంపట్టాను. మహా న్యూసెన్సుగా వుంది. 'రమణ ఎలాగూ కారులో వెడుతున్నాడు కనక నువ్వూ అతనితో వెళ్ళు'— అని నాన్నగారు శాసించారు. సరే—ఈ పీడ వదలుతుందని అతనితోపాటు కారులో రావటానికే నిర్ణయించుకున్నాను.'

సాంబం మూడౌన్సుల ఆముదంతాగాడు. అతని మొహం వయాపైనంతయింది.

'అయితే రమణను మీకు బాగాతెలుసా?' అనడిగాడు. ఆప్రశ్న విని రమణ, శారద ఒకరివంక మరొకరు చూసుకుని ముసిముసిగా నవ్వుకున్నారు.

'మీ ప్రశ్న మరీ విచిత్రంగా ఉంది. చిన్నప్పట్నుంచీ ఇద్దరం కలిసి మెలిసి పెరిగాం' అన్నాడు రమణ.

'ఇంక చాలు. అనుమానం పెనుభూతమన్నట్టు ఆయన విపరీతార్థాలు తీయరూ' అని శారద ఆ విషయాన్ని తుంచివేసింది.

'మెట్రోలో కొత్త పిక్చర్ వచ్చింది', అన్నాడు సాంబం ఏదో కోటనుపట్టటానికి పన్నాగం పన్నుతూ.

'అవును. ఇవేళ ఆఖరురోజు కూడా. టిక్కట్ బుక్ చెయ్యమని రమణతో చెప్పాను, కానతను వినిపించుకోలేదు. నిజానికి నా కిది హిమాలయ పర్వతంఅంతటి ఆశాభంగం.' కాటుక కళ్ళ లోయాను నల్లదనం ముఖంనిండా వ్యాపించింది.

'నేను రెండు బుక్ చేశాను. ఒకటి మీరు తీసుకోండి.'

'థాంక్స్' అంది తీసుకుంటూ.

'మూడు గంటలకుషో. వర్స్నకుమ్మ లేదీన్ని కూడా పరదత్తం చేయకండి' అని చిన్న జోక్ విసిరి క్లాసుకు చక్కాపోయాడు.

రమణ తన్ను మోసం చేస్తాడేమో నన్న భయం, ఈర్ష్య అతన్ని ఒకవంక పీడిస్తూనేవున్నాయి. అయినా సినిమాలో శారదను కలుసుకోటం తప్పదు కనక ఆమెను తనవైపుకు తిప్పుకోవచ్చు. ఇంతవరకూ తను ఏ అవినీతికార్యమూ తలపెట్టలేదు. తన ప్రణయం వివాహంతో సుఖాంతం కావాలన్నదే తనకోరిక-సినిమాకు వెళ్లాలంటే ముందు ఆఫీసులో సెలవు సంపాదించాలి. తిన్నగా వెళ్ళి సీతాపతిగారి ముందర నిలబడ్డాడు.

'ఏమిటి విశేషం?' అనడిగా రాయన.

'తలనెప్పి దంచేస్తోందండి.' కంఠ ధ్వనికి వణుకు చేర్చి, ముఖానికి అవవంకరలూ సరిదిద్దుకుని ఓ చెయ్యి తలమీద వుంచుకుని అభినయిస్తూ అన్నాడు.

'అలాగా!...అనాసిన్ మాత్రలు మింగవయ్యా!'

'జ్వరంకూడా వుందండి.'

'అవును. క్లైమేటు బాగాలేదు. రెండో ఫ్లోరులో డాక్టరు వున్నాడు. ఆలస్యం చెయ్యకు.'

'అది కాదండి...మరి...మరి...'

'ఆగిపోయావేం? కొత్త పెళ్ళికొడుకులా ధీమాగా చెప్పవయ్యా!'

'ఇవేళ సెలవు కావాలండి.'

అతన్ని భస్మంచేస్తున్నట్టు ఓమాటు చూసి 'సరే!...ఈ మాయదారి జ్వరం అనుకోకుండా వచ్చిపడుతుందిగామాలు!' అని వురిమారు.




### పూవు మీ అదృష్టం చెప్పగలదు

నీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్ని, నీ సరియైన చర్యనుగురించిన్ని నీవు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టు కార్డుపైన నీకు యిష్టమగు ఒక పుష్పము పేరున్నూ, నీవు వ్రాయు తేదీ, వేళ వివరములున్నూ, నీ సరియైన చిరునామాయున్నూ వెంటనే వ్రాసి పంపుము.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, నీవు కార్డువ్రాసిన తేదీ లగాయతు 12 మాసములలోను నీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, నీ వ్యవహారములో నీకు జయము కలుగునో, నీ ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్ద్రవ్యలాభము మొదలగు వానినిగురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు. 1-4-0 లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. చార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహము లేవయినా వున్న యెడల శాంతిచేయు విధానంకూడా తెలుపగలము. వివరములు మా పూచీపైన పంపబడును. మేము పంపిన భోగట్టా మీకు తృప్తిగా నుండనియెడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించి చూడుడు. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

Pt. DevDutt Shastri, Raj Jyotishi (WP-13) Jullundur City.

# 3

సాంబం ఉత్సాహంతో తన గదికివెళ్ళి అమ్మాయికంటె ఎక్కువగా ముస్తాబై రెండూ నలభైఅయిదుకు మెట్రో చేరుకున్నాడు. అతని కళ్ళు శారదకోసం గాలించాయి. కాని ఆమె జాడ ఎక్కడా లేదు.

రమణే అతన్ని విష్ చేశాడు.

'సారీ!...మిస్టర్ సాంబం! శారద తన తొందరవల్ల రాలేకపోయింది. ఆమె అనుమతి మీదట ఆ టిక్కట్టు నేను సద్వినియోగ పర్చుకుంటున్నాను. రండి...ఇద్దరం కలిసి పిక్చర్ ఎంజాయ్ చేద్దాం' అన్నాడు.

సాంబానికి అతని కాళ్ళూ చేతులూ విరగ్గొట్టి వాటితో ఆడుకోవాలనిపించింది. కాని తను భీమసేనుడు—అతను జరాసంధుడు కారుగా! ఎలాగో వోకలాగ రెండున్నర గంటలూ థియేటర్‌లో ఏడుస్తూ కూర్చుని ఇంటిముఖం పట్టాడు.

దోవంతా ఈ 'హైరోడ్ క్రాసింగ్ రాస్కెల్' రమణ గురించే అతని ఆలోచనలు. అతన్ని ఏవిధంగా ఓడించటమని—

మర్నాడు వంద సార్లు పరీక్ష తప్పిన మొహంతో ఆఫీసులో అడుగుపెట్టాడు.

'మిమ్మల్ని మేనేజరుగారు వెంటబెట్టుకు రమ్మన్నారు' అంటూ ఆఫీసు ప్యూను స్వాగతం పలికాడు.

'నువ్వు పోను కెళ్ళక్కర్లేదు. నేనే వస్తున్నా-' అంటూ ఆయన ముందు హాజరయ్యాడు.

'ఒంట్లో సులువుగా వుందా? విశ్రాంతి తీసుకున్నావా?' అని తాపీగా అడిగారు.

'ఇప్పుడు కొంత నయమండి' అని వణికాడు. తుఫానుకు ముందు సముద్రం ప్రశాంతంగా వుంటుందన్నట్టు ఆ నవ్వు వెనక ప్రళయాలు దాగివున్నాయని అతనికి తెలుసు.

'మెట్రో థియేటర్‌లో తలనొప్పికీ, జ్వరానికీ మందిచ్చి చికిత్స చేస్తున్నారన్న సంగతి నా కింతవరకూ తెలియదుసుమా! నీ మూలంగానైనా తెలిసింది.'

'సుడిగుండంలో చిక్కుకున్నానురా!' అంటూ స్వగతం పలికి, 'క్షమించండి' అంటూ సాగదీశాడు.

'ఎన్నిసార్లయ్యా ఈ వెకిలినవ్వు చూసి నిన్ను క్షమించేది! ఈ క్షణంలో నిన్నెందుకు డిస్‌మిస్ చెయ్యకూడదని అడుగుతున్నాను.'

సిగ్గుతో తల వంచేసుకున్నాడు.

'ఈ మాటిలా ప్రవర్తించావంటే!' అంటూ టేబిలుమీద గుద్దారు. పక్కనున్న కాలింగ్ బెల్ మాడలిపోయి నోరు తెరిచింది. సాంబం బయటకొచ్చాడు. తనకూ, మేనేజరుకూ మధ్య ఏ సి. ఐ. డీ పని చేస్తున్నాడో అతని కర్థంకాలేదు. సాయంత్రం




## అరటి పండ్ల గుజ్జుతో కొత్త ఫలహారము

నిలువునా సగముగా కోయబడిన 6 పెద్ద అరటి పండ్లు, కస్టర్డ్ (బ్రౌన్ అండ్ పాల్సన్ కస్టర్డ్ పౌడర్‌తో తయారుచేయబడినది). స్ట్రాబెర్రీ జామ్. 1 కప్పు క్రీమ్

ఒక అరటి పండు సగం బద్ద మీద జామ్ పూసి, రెండవ సగము బద్దను దానిపైనుంచి రెండున్ను మెల్లగా అద్ది, ఒకటిపై నొకటి కప్పుగా గాజు గిన్నెలోవేసి దానిపైన కస్టర్డును పోసి, క్రీమును చిక్కని గుజ్జుగా అగునట్లు చిలికి పైన పోయండి. దానిపైన బాదము పప్పుగాని లేక పిస్తా అనుసార పప్పు గింజలనుగాని పొదగండి.

### ఆరోగ్యమునకు సులభ సాధనం

పిల్లలందరూ మీగడవంటి, రుచియైన, ఆరోగ్యకరమగు కస్టర్డును ఇష్టపడుదురు. అది ఆరోగ్యము గలిగించు పాలతో నిండియున్నది. బ్రౌన్ అండ్ పాల్సన్ కస్టర్డ్ పౌడర్ శుద్ధమైన కాయగూరలనుండి తయారుచేయబడినట్టిది అని జ్ఞాపకముంచుకోండి. మీరు సరకులను కొనుటకు బజారుకు వెళ్ళినప్పుడు, బ్రౌన్ అండ్ పాల్సన్‌చే తయారుచేయబడిన ఇతర రకముల పదార్థములైన — బ్రెస్లీ, పేటెంట్ కార్న్‌ఫ్లవర్, బ్లమాంజ్ కోసం చూడండి.




**ఉచిత** ఉల్లాసకరమైన కొత్త ఫలహారముల పుస్తకము, కోసం దిగువ ఫారమును పూరించి పంపండి.

అయ్యా, దానిలోనున్న మీ ఉచిత ఫలహారముల పుస్తకమును దయచేసి నాకు పంపుడు.

నా పేరు..........................................

నా చిరునామా......................................

..................................................

తపాలా ఖర్చుల నిమిత్తం 15 నయా పైసల తపాలా బిళ్లలను నేను ఇందులో జతపర్చియున్నాను

డిపార్టుమెంట్ A P W కార్న్ ప్రాడక్ట్స్ కో. (ఇండియా) ప్రైవేట్ లి.
పోస్టు బాక్స నం. 994 బొంబాయి—1



కార్న్ ప్రాడక్ట్స్ కో., (ఇండియా) ప్రయివేట్ లి.,

ఏజెంట్లు: పారీ అండ్ కో. లిమిటెడ్.,

#  ఊహాగానాలు 

ఇంటికి తిరిగివెడుతుంటే శారద ఎదురైంది- చూడనట్టు వెళ్ళిపోయాడు. కొంత వుదాసీనత ప్రదర్శించి ఆమెను వంచాలని వూహాగానం చేసుకున్నాడు.

## 4

సాంబం ఆశ్చర్యసముద్రంలో మునిగి ఉక్కిరిబిక్కిరై పోయాడు. సీతాపతిగారు తన్ను పిలిచి ఆదరంగా ఎదురుగా కూర్చోపెట్టుకుని కాఫీ తెప్పించి తాగుతున్నారంటే ఏమనుకోవాలి? 'సాంబం!...నువ్వు చాలా మంచివాడివి పాపం! కష్టపడి రాత్రింబగళ్ళు ఎండనక, వాననక పనిచేశావు. అటువంటి నిన్ను పనిలోంచి తప్పించటానికి బాధకరంగా వున్నా తప్పనిసరి-ఈ అరకప్పు కాఫీతాగి కాత్రిమీద గుద్దేసుకుని బండి ఎక్కిత్వ,' అని సీతాపతిగారు సానుభూతి చూపడానికి తన్ను పిలిచారని నిర్ణయించుకుని ఎదురుగా కూర్చున్నాడు. 'సాంబం!...కంగారు పడకు. ఇంత కాలంగా నేను చేసినదంతా నీ సహనానికి, మంచితనానికి పరీక్ష-నువ్వు నెగ్గావు. రేపు నా రెండో అమ్మాయికి పుట్టినరోజు. నువ్వు భోజనానికి వుండేట్టు పొద్దున్నే రావాలి. ఇదుగో ఎడ్రసు-డిజప్పాయింటు చెయ్యకుసుమా!' అన్నారు.

సాంబం సంభ్రమాశ్చర్యాలతో కృతజ్ఞత చెప్పటంకూడా మర్చిపోయాడు.

ఆ మర్నాడు అతిజాగ్రత్తగా 'మేకప్' చేసుకుని తొమ్మిది గంటలకు టంచనుగా సీతాపతి గారింట్లో వాలాడు. మెత్తం మూడుగదులు. అందులో ఒకటి డ్రాయింగ్ రూం-ఓ అమ్మాయి సుస్వాగతం పలికింది. అమావాస్య చీకటిని సహితం వెక్కిరించే శరీరచ్ఛాయ. మానవత్వాన్ని అపహరించే చిరునవ్వు.

'చచ్చాం భో!...ఇంతవరకూ దెయ్యాల్ని గురించి వినటమే కాని చూడలేదే!' అనుకున్నాడు సాంబం. భోజనాలయ్యాక వెంట తీసుకొచ్చిన పుస్తకం బహూకరించాడు.


శ్రీ కాఫ్
దగ్గు, ఉబ్బసములకు
దివ్యౌషధము
శ్రీవత్స కెమికల్స్ & డ్రగ్స్
లిమిటెడ్, మదరాసు-30


'అమ్మాయ్!...పెద్దబ్బాయి ఎప్పుడు వస్తానన్నాడు?'

'అక్కయ్య, అన్నయ్య మూడు గంటలకు వస్తామన్నారు.'

సాంబానికి అర్థమైంది. ఆ అమ్మాయి సీతాపతిగారి పుత్రికారత్నమన్న మాట. ఆయన శివుడి ముందు కాపలా కాసే నంది విగ్రహమైతే ఆ అమ్మాయి ఆయన భూతగణాల్లో ఒకతె.

'అయితే సాంబం!...నువ్వు మా వాళ్ళు కలిసే వుంటున్నారని విన్నాను. ఓ మాటు ఆయన్ని వచ్చి నన్ను చూడమనవోయ్, ఆయనకు కబురు పంపించాననుకో- మీ కులగోత్రాలు తెలుసుకున్నాను... అమ్మాయ్! మంచినీళ్ళు' అన్నారు.

సాంబం గుండెల్లో మూడు మణుగుల రాయి పడింది.

సీతాపతిగారి ఎత్తు-చిటికెలో అర్థమైంది. ఆ 'రక్షసి'ని తన మెడకు ఇనుపగొలుసుల్తో బంధించటానికి మంత్రాంగం జరుగుతుందన్నమాట.

ఆ అమ్మాయి నీళ్ళు తీసుకొచ్చింది గ్లాసులో.

సాంబం తప్పక అంది పుచ్చుకుని గ్లాసు ఖాళీ చేశాడు.

అతనింటికొచ్చేసరికి ఆరు దాటింది. సాంబం తండ్రి అతని కోసం ఎదురుచూస్తూ నిలబడ్డారు.

'అబ్బాయ్!...మీ మేనేజరుగార్ని గురించి విన్నాను. ఆయన అమ్మాయిని నీ కిచ్చి వివాహం జరిపించాలని ఇందాకా రాయబారం వచ్చింది. ఏమంటావ్?'

సాంబం కోపంగా చూశాడు.

'అటు సూర్యుడు ఇటు పొడిచినా ఆ అమ్మాయిని చేసుకోటం జరగని పని. మీరు ఏమీ ఎరగనట్టు వూరుకోండి. అంతా నేను చూసుకుంటాను.'

రాత్రి తొమ్మిది గంటల దాకా యోచించాడు. ఎలాంటి ఆలోచనా తట్టలేదు. అక్కడికి రెండుఫర్లాంగుల దూరంలోవున్న ఓ మిత్రుడి గదికి వెళ్ళాడు. అతనూ సాంబం ఒకే కంపెనీలో పనిచేస్తున్నారు. అతనికీ, సీతాపతిగారికీ నిసలైన బంగారంలాంటి స్నేహం వుంది. సాంబం తన కథంతా పలువలు చిలవలతో వర్ణించాడు.

'మరేం భరవాలేదు. ఆయనకు నీ మీద అసహ్యం కలిగేట్టు చేస్తాను.' అని అభయహస్తం చూపెట్టాడు మిత్రుడు.

'అంటే?...మర్నాడే వుద్యోగం పీకేస్తారేమో!' అని భయం వ్యక్తపరిచాడు సాంబం.

'అభయం నీ కక్కర్లేదు. అన్నింటికీ నేవున్నానుగా. నీకు సిగరెట్లు తాగడం, పేకాడటంలాంటి దురభ్యాసాలున్నాయని, నువ్వు జీవితంలో నిలకడగా వుండేవాడివి కాదని చెప్తాను.'

## 5

మిత్రుడిప్రభావమే అయుండాలి. లేకపోతే సీతాపతిగారు ఆవిషయం మళ్ళీప్రస్తావించనేలేదు. కొలరోజులు గడిచాయి. ఈ కొలరోజుల్లో సాంబం శారదనుచూడటం తటస్థించలేదు - కారణంసెలవులు - ఓనాడు సీతాపతిగారు అతన్ని పిలిచి శుభలేఖ అందించారు.

'మా అమ్మాయిపెళ్ళి-నువ్వు తప్పకుండా రావాలి.' అన్నారు.

'శని వదలింది' అనుకుంటూ శుభలేఖ చూశాడు.

'శారద' అన్నది పెళ్ళికూతురుపేరు. మొదట్లో కంగారుపడినా 'కోటిమంది శారదలు వుంటారు. ఇది నా శారదని ఎందుకనుకోవాలి? అయినా సీతాపతిగారమ్మాయిని నే నెరగను గనకనా? ఒకవేళ శారదే అయినా అంతగా ఏడ్వవక్కర్లేదు. ఆరవణంటే ఆమె కెందు కంతయిది?' అని తన్ను తాను వూరడించుకున్నాడు.

శారద పెళ్ళికూతురైంది.

సాంబానికి కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి. అతనిముందున్న వస్తువులన్నీ గిరగిర తిరిగాయి. రవణ అతనిభుజంమీద చెయ్యివేశాడు.

'మా చెల్లాయిపెళ్ళికి వచ్చినందుకు థాంక్స్' అన్నాడు.

'ఆ!...శారద మీ చెల్లెలా?'

అవును. ఓమాటు చెప్పానూ...జ్ఞాపకం లేదా? మేంయిద్దరం చిన్నప్పట్నుంచీ కలిసి మెలిసి పెరిగామని - మరో విషయం చెప్తాను - నాన్నగారు ఒప్పుకునివుంటే శారద మిమ్మల్నే పెళ్ళాడేది - కాని ఎందుకో నాన్నగారు ఒక్కసారిగా పరివర్తన చెందారు.'

సాంబం శారదవంక చూశాడు - కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి. ఛీ! ... తన భ్రమ కాని హోమధూమం కన్నీటికెరటాల్ని కదిలించింది అంతే!

వాస్తవికతను ఎదుర్కోటానికి భయపడి వూహాగానాలుచేసేవారికి చివరికి లభించే ప్రతిఫలం ఏమిటో అతను అర్థం చేసుకున్నాడు. కళ్ళు తుడుచుకుందామని జేబురుమాలుకోసం వెదికాడు.

కాని అతని కన్నీరు తుడిచే వస్తువు ఎక్కడా కనపడలేదు. 

# నల్లపిల్లి

నిద్రపోతున్న పరమేశం—"ఓహో నా రాణీ--పూలపాన్పుమీద కేళీ మేళ్కొల్పు తాడుతే అని మైమరిచి నిద్రపోతున్నావా—" అని పలవరించ సాగాడు. అకస్మాత్తుగా అతని కలలో వర్షం పడింది. గబుక్కున లేచి కూర్చున్నాడు.

ఎదురుగా కమల గ్లాసుడు నీళ్ళతో నిలబడి వుండటం చూచి, పరిస్థితిని అర్థం చేసుకుని, "ఎందుకు లేపావు" అన్నాడు పరం.

"మీ డ్యూటీ ఎన్నిగంటలకండీ" అంది కమల.

"డ్యూటీ—అవును సుమా—మరిచిపోయా – అయినా ఇవ్వాళ ఆదివారం?" అన్నాడు పరం బద్ధకంగా ఆవులిస్తూ.

"ఆదివారం, అష్టమీ నక్షత్రం, వర్జ్యం ఉదయం నాలుగు గంటలకు ప్రవేశించి నాలుగన్నరకు వెళ్ళిపోతుంది, రాహుకాలం ఉదయం తొమ్మిదిగంటలనుంచి, తొమ్మిదిన్నరవరకూ. యమగండం రాత్రి పన్నెండు గంటలనుంచి తెల్లవారు రెండుగంటల వరకూ—ఏం చాలా?"—అంది కమల గుక్క తిప్పుకుని.

"అయితే ఇవ్వాళ మనం పరలోకానికే ప్రయాణం కట్టామన్న మాట" అన్నాడు పరం.

"ఛా—ఏం మాటలండీ—అవి—" అంది కమల.

ఏం చెయ్యను—రాత్రి పన్నెండు గంటలకు యమగండం, అప్పుడే మన డ్యూటీ—ఏం చెయ్యనూ" అన్నాడు పరం.

"తర్వాత ఆలోచిద్దాం కానీ—ముందు మీరు లెమ్మలండి అప్పుడే ఎనిమిదయ్యింది-" అంది కమల వెళ్ళిపోతూ.

ఇప్పుడు కమలతో దెబ్బలాడితే, ఆ కోపం కొద్దీ, కాఫీలో పంచదార తగ్గించి తెస్తుంది. అని అనుభవంవల్ల తెలుసుకున్న పరం కాల కృత్యాలకోసం వెళ్లాడు.

కొంత సేపటికి వంటింట్లోవున్న కమలకు "కమలా—నల్లపిల్లికికూడా కాఫీ తీసుకురా" అనే పరం కేక వినపడే సరికి కమల 'నల్లపిల్లి ఎవరా' అని డ్రాయింగు రూమ్‌లోకి తొంగిచూచి, అక్కడో కుర్చీలో కూర్చుని పరంతో మాట్లాడుతున్న ఓ నల్లబ్బాయిని చూచి "ఓహో ఈ అబ్బాయేనా నల్లపిల్లి, పేరుసరిగ్గా కుదిరింది" అనుకుని, కాఫీ తీసుకెళ్ళిచ్చింది.

కొంత సేపటికి ఆ నల్లపిల్లి నామధేయుడు వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిపోగానే కమల లోపలికి వచ్చి, "ఏమండీ ఈ అబ్బాయెవరు" అంది కుర్చీలో కూర్చుంటూ.

"అప్పుడే మర్చిపోయావా—మన పెళ్ళిలో చదివింపులు చదువుతూ, సీ్రఫెండ్ ఆకాడే విచ్చిన బహుమతిని మిష్టర్ అకాడే విచ్చిన బహుమతి అని చదివాడే—అతను" అన్నాడు పరం.

---

కోకా శ్రీసుధ

---

"ఆ సంగతి తెలుసు. అతని నామధేయమేమి, అతని రాకకు కతంబేమి" అంది కమల రాగయుక్తంగా.

"పేరు—ఎన్ - పి—ధాముడు. అతని వివాహం ఎల్లుండి-ఆహ్వానించడానికి వచ్చాడు-తీరాయా సందేహాలు" అన్నాడు పరం.

"అయితే పెళ్ళెన్నిగంటలకు" అంది కమల.

"ఎల్లుండి మధ్యాహ్నం ఒంటి గంటకు" అన్నాడు పరం.

"మిట్టమధ్యాహ్నం పూట పెళ్లేమిటండీ" అంది కమల.

"లేకపోతే అర్ధరాత్రప్పుడు పెట్టమన్నావా" అన్నాడతను.

"ఏం-పెళ్తే" అని అంది కమల.

"తీళ్ళ్—దొంగలు వస్తా" రన్నాడు పరం.

"అది-మీ తీరా"-అంది కమల కాఫీ కప్పులు ట్రేలో పుచ్చుకుని.

"అనుభవంతో చెప్తున్నా - మేడమ్"-అన్నాడు పరం.

"మీ అనుభవా లన్నీ ఒక పుస్తకంగా రాసి పబ్లిష్ చేస్తే-మీరు అనుభవం అన్నప్పుడల్లా పుస్తకం రిఫర్ చేస్తా—"అంది కమల లేచి.

"నేను రాస్తె పబ్లిష్ చేసే నాధుడెవ్వడో కొ—" అన్నాడు పరం.

"మీరే-" అంటూ నవ్వి - ఖాళీ కాఫీ కప్పులను తీసుకుని వెళ్ళిపోయింది.

"హా చంద్రముఖీ" అనుకున్నాడతను కమలకు వినిపించకుండా. పెళ్ళినాడు - కమల పరమేశం, గుడివాడవెళ్లి బంధువు లింట్లో భోజనంచేసి, బస్సెక్కి నానపాము లలో దిగి, అక్కడ్నుంచి రెండు మైళ్ళు నడచి పెళ్ళివారూరు చేరారు.

పెళ్లి పందిట్లో, పెళ్ళికొడుకు కనపడి-వాళ్ళను ఆత్రుతతో ఆహ్వానించి, పరాన్ని ప్రక్కకు పిలిచి.

"బ్రదర్-సౌభాగ్యం వచ్చి గోలచేస్తున్న దోయ్" అన్నాడు.

"ఏం - ప్రేమలేఖేమన్నా రాశావా" అన్నాడు పరం.

"అదిగాదు బ్రదర్-ఆ రోజు హాస్టలులో సర్దాగా రాసిచ్చిన కాగితం నా కాబోయే మామగారికి చూపెడుతుందట – " అన్నాడు నల్లపిల్లి నామధేయుడైన ఎన్. పి. ధాముడు.

"మా పెట్టనీ-ప్రేమలేఖ కానప్పుడు-నీకు భయమెందుకోయ్ చిట్టీ" అన్నాడు పరం.

"అబ్బబ్బ - గుర్తుకు రాలా నీకింకా - ఆ కాగితం ఎలా గినా చేజిక్కించుకో బ్రదర్ నీకు పుణ్యం వుంటుంది" అన్నాడు. ఎన్. పి. ధాముడు.

"ఓహో ఆ కాగితమా-"అని "సౌభాగ్యం ఎక్కడుంది" అని అడిగాడు పరం.




* ఇనుప పెట్టెలు * బీరువాలు

* క్యాషుబాక్సులు * ఆఫీసురాక్సు

ముప్పది సంవత్సరములుగా నాణ్యమునకు, మన్నికకు, నరసమైన ధరలకు ప్రసిద్ధిచెందినవి.

అల్లారాం అండ్ కో

(స్థాపితము : 1928.)

(H. O.) వెలగలేటివారి వీధి, విజయవాడ - 1.

(బ్రాంచి) 2/156, బ్రాడ్వే, మద్రాసు - 1.

క్రొత్త షోరూమ్ మారుతీ సినిమా ఎదురుగా.

NVKR, VJA

#  నల్లపిల్లి 

"లోపలుంది బ్రదర్" అన్నాడు ఎస్. పి. ధాముడు.

"అయితే నేను పిలుస్తున్నా నని కబురంపు" అని కమల దగ్గరకు వచ్చాడు పరం. అతన్ని చూడగానే కమల.

"ఏమిటండీ రహస్యంగా మాట్లాడు కున్నారు పెళ్ళికూతురు వరారా? అని అడిగింది నవ్వుతూ.

"ధా - అటువంటి దేమీ జరగలేదు కానీ - మనం ఒక చిన్నపని అతి చాకచక్యంగా ఎవ్వరికీ తెలియకుండా చెయ్యా" అన్నాడు పరం.

"ఏం - ఒక్కసారి డిటెక్టివ్ అయిపోదా మనుకున్నారా" అంది కమల నవ్వుతూ.

"అబ్బబ్బ - నీ థాట్ చాలించు గాని, లోపల సౌభాగ్యం వచ్చిందట పిలుద్దూ" అని పరం అంటూండగానే సౌభాగ్యం వచ్చి.

"హల్లో డాక్టర్ గారూ" అంది.

"నీకు నూరేళ్ళాయుష్షు - నీ సంగతే మాట్లాడుకున్నాం" అంది కమల.

"నీతో మాట్లాడాలి పద" అంటూ ఆ అమ్మాయిని ప్రక్కనున్న గదిలోకి తీసుకు వెళ్ళాడు పరం. కమల వాళ్ళను అనుసరించింది. లోపలకు వెళ్ళాక గడియపెటి - "ఓ సౌభాగ్యమా - నీవు చాలా దొడ్డదానివి సుమా - నల్లపిల్లి వస్తావేమో నిమ్మ" అన్నాడు పరం.

"మీకేమన్నా అప్పువున్నా లేమండీ" అని అడిగింది కమల అర్థంకాక.

"అది నేను సమయంచూచి బయట పెడదామని అనుకుంటూవుంటే మీరు కావాలంటా రేంటండీ" అంది సౌభాగ్యం.

"నేను నీకంటే తెలివితేటలతో బయట పెడ్తాగా" అన్నాడు పరం. వానిటి బాగ్ లోంచి సౌభాగ్యం కాగితం ఇస్తూ - "దీన్ని మీ రెలా బయటపెడ్తారో చెప్పండి" అంది. సౌభాగ్యం.

ఆ కాగితాన్ని జేబులో పెడ్తూ - ఏముంది సరిగ్గా కట్నం ఇచ్చేసమయంలో కట్నం పళ్ళెంలోకి విసిరేస్తా - ఏం బ్రహ్మాండంగా లేదూ - మన ఐడియా" అన్నాడు పరం.

"కొంపతీసి మీరు అలా చేయకపోతే" అంది సౌభాగ్యం అనుమానంగా.

"నో - నో - నా నెప్పుడైనా అబద్ధాలాడానా?" అన్నాడు పరం.

"అప్పుడప్పుడూ తప్ప" అని పూర్తి చేసింది కమల.

"సరే పోదాం పదండి" అన్నా డా వాక్యాన్ని వినిపించుకోకుండా పరం.

పెళ్ళిపీటలమీద వధూవరులు కూర్చున్నారు.

సౌభాగ్యం పెళ్ళి ఆడవాళ్ళ దగ్గిర కూర్చుంది.

కమల, పరమేశం ముహూర్తానికి అనుకుని చూస్తున్నారు.

మంగళసూత్రధారణ సమయంలో కమల పరం జేబులో కాగితాన్ని పిక్ పాకెట్ చేసి ఆ కాగితం చదవసాగింది.

దాంట్లో ఇలా వుంది:

"ఆన పందొమ్మిది వందల యాభైమూడో సంవత్సరం, ఆగష్టు నెల, పందొమ్మిదో తారీఖున నీరుగంటి పుల్లయ్యగారి ఏకైక పుత్రుడైన నీరుగంటి ప్రియధాముడైన నేను శ్రీ పరమేశ్వరరావు, శ్రీ తత్వానంద, శ్రీ కృష్ణారావు, శ్రీ రామమోహనాచారి, శ్రీ శ్రీహరిరావు, కుమారి సౌభాగ్యం మొదలగు స్నేహితుల సమక్షంలో, ఆంధ్రా యూనివర్సిటీ హాస్టలు రూము నెంబరు ఏడులో రాసిచ్చిన ప్రమాణపత్రం ఏమనగా నేను నా వివాహ సమయంలో వధువు తరఫునుంచి, ధన, కనక, వస్తు, వాహన రూపంలోగాని, భూమి రూపంలోగాని, గృహరూపంలోగాని, మరే రూపంలోగాని కట్నం పుచ్చుకోనని పైనుదహరించిన స్నేహితుల సమక్షంలో ప్రమాణం చేయుచు, దానికి ఋజువుగా ప్రమాణపత్రము రాసి ఇచ్చుచున్నవాడను. ఈ ప్రమాణపత్రమును అతిక్రమించినఎడల, పై మిత్రులు ఏమిచేసినను, వారి చర్యలకు నేను బద్ధుడనై ఉండెద. ఇది నా సమ్మతిని, నా దస్తూరితో రాసిచ్చిన ప్రమాణపత్రము——ఇట్లు

"నీరుగంటి ప్రియధాముడు" అని అణా రివిన్యూ స్టాంపుమీద సంతకం పెట్టివుంది.

ఇదంతా చదివి కమల తలెత్తేసరికి.

"వరుడికి మామగారిచ్చిన కట్నం పదమూడు వేల రూపాయలు" అన్న పురోహితుడు మాటలు ఆమెకు వినిపించింది. కమల ఛటుక్కున ఆ కాగితం విసరబోయింది కాని పరం ఆమె చెయ్యిపుచ్చుకుని, ఆ కాగితం లాక్కుని బయటకు లాక్కెళ్లాడు.

గజేంద్రమోక్షంలో పద్యాలు చదువుకుంటున్న పెళ్ళికొడుకుకు గుండెలు కుదుటపడ్డాయి అది చూచాక. సౌభాగ్యం అది చూచి, భ్రువలేచి పరందగ్గిరకు వచ్చి.

"ఛీ-మీ మొగాళ్ళంతా" అని కోపంతో ఆగిపోయింది.

"స్వార్థపరులు, దగాకోరులు" అని పూర్తి చేసింది కమల వీళ్ళకేం సమాధానం చెప్పాలో అర్థంకాక.

"హా చంద్రమతీ నేనేమిచేయను!" అని అన్నాడు పరం కానీ ఆ వాక్యం మంగళ వాద్యాలతో కలిసిపోయింది. 



చర్మబాధలన్నిటికి

"సైబాల్"

చర్మవ్యాధు లన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విష క్రిమి నాశనియై త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది. కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబిస్, మొటిమలు, తామర, కాలిపగుళ్లు, వ్రణములు, మొదలైన వాటిని కుదుర్చడంలో అద్భుతంగా పనిచేస్తుంది.

బిడ్డల ఆరోగ్యమునకు ప్రసిద్ధిచెందినది.

"రమణీస బేబీ గ్రైప్"




తయారుచేయువారు:

దీ సౌత్ ఇండియన్
మాన్యుఫాక్చరింగ్ కంపెని, మధుర.

డిస్ట్రిబ్యూటర్లు:

సీతారాము జనరల్ స్టోర్సు ఏజన్సీస్

విజయవాడ, సికింద్రాబాద్.

బరంపురం (గంజాం), బొంబాయి. బెంగుళూరుసిటీ.




## ప్రధానఘట్టముల ప్రచురణ

"ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రంబని । యధ్యాత్మవిదులు వేదాంతమనియు,
నీతిశాస్త్రజ్ఞులు నీతిశాస్త్రంబని । కవివృషభులు మహాకావ్యమనియు,
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని । యైతిహాసికు లితిహాసమనియు,
పరమ పౌరాణికుల్ బహుపురాణసముచ్చ । యంబని మహిగొనియాడుచుండ...."



ఆంధ్రమహాభారతము ఆంధ్రజాతికి పేరెన్నికదెచ్చిన కల్పవృక్షమై వెలుగుతున్నది. నన్నయ ఈ మహావృక్షోత్పత్తికి బీజారోపణచేశాడు; నవ్యాంధ్రభాషాకుసుమ సంపన్నమై, జాతీయతాఫలసిద్ధి కలిగేలాగు తిక్కన ఈ మహావృక్షాన్ని పెంపొందించాడు. ఎఱ్ఱన మిగిలిన దోహదక్రియలు సమకూర్చాడు.

ఈ మహాకల్పవృక్షావతరణకు కారకులైన కవిత్రయానికి అంజలి ఘటించి పాఠకులకు ఒక శుభవార్త అందజేస్తున్నాము !!

భారతమును మినహాయించితే తెలుగుజాతికి సాహిత్యముగాని, సంస్కృతిగాని లేదని చెబితే అతిశయోక్తికాదు.

కేవల శ్రుతపాండిత్యమాత్ర విలసితములయిన భిన్నభిన్నభావములు దేశమున వ్యాపించి అనంతమైన భావసంఘర్షణకు, తద్వారా మానసిక సంక్షోభములకు కారణములవుతున్నవి. ఆంధ్రమహాభారత ప్రతిపాదితము, బలవత్తరమూ అయిన జాతీయధర్మం ఈగడ్డ మీాద నేడు లుప్తంకావటమే ఇందుకుకారణం. భారతపఠన ప్రచారములు తగ్గిపోవటమే ఈ జాతీయ ధర్మభ్రష్టతకు హేతువు.

ఇది ప్రజలకు తెలియనిదికాదు. అయినా భారతపఠనం మాత్రం విరివిగా సాగుట లేదు. జనబాహుళ్యానికి భారతప్రతులు అందుబాటులో లేకపోవటమే చాలావరకు కారణం.



ఈ విషయాన్ని గమనించి ఆంధ్రమహాభారతంలోని ప్రధానఘట్టాలను, యథాతథంగా సచిత్ర వారపత్రిక పాఠకులకు అందజేయాలని సంకల్పించాము **15-1-'58** తేదీ సంచిక మొదలు ఆయా ఉజ్వల ఘట్టాలప్రచురణ ప్రారంభమౌతుంది. పాఠకులు మా ఉద్యమానికి ఆహ్లాదించగలరనీ, ఈ అవకాశాన్ని అమూల్యమైనదిగా గుర్తించి, వినియోగించుకోగలరనీ ఆశించుతున్నాము.

—సంపాదకుడు

ప్రహసనం:

# పెళ్లిచేసుకునిచూడు

[రంగస్థలం పార్వతమ్మ యింటిలో మధ్య గది. స్టేజి కుడిప్రక్క వీధి వైపు. రెండవ పక్క వంటిల్లు... దొడ్డి ...గదిలో మూలగా కుర్చీపీట వుంటుంది. దానిమీద తెరకానించి చీపురుకట్ట వకటి పెట్టివుంటుంది. పక్కగా రెండవమూల చాట వకటి నేలమీద పడేసి వుంటుంది]

పార్వ: (తెరతీయగానే ఎడమపక్క నుంచి లోపలకు వస్తూ) ఈ సంసారం నేనీదలేను తల్లీ ... పనిమనిషి దగ్గరనుంచీ నాచేతనే చాకిరీ చేయించుకుందామను కుంటూంటే ...ఆ... దీనికి మరీ పోయే కాలం వచ్చిందీ...అప్పమ్మా...ఎక్కడే.. వక్కట్లా పలకరుగదా ... కే (కుర్చీపీట మీదవున్న చీపురుదగ్గరకు వెళ్ళి) ఇదిగో... మళ్ళీ యిక్కడే పెట్టింది... చీపిరికట్ట ఆ మూల అలంకారం చేస్తేగాని శోభాయమానంగాదు నా కొంప ... పెద్ద దానివి పెద్దదానివి అంటూ నా ప్రాణాలు కొరికే స్తున్నారే అంతాకలిసి. (చీపిరి వీధివైపు తెర లోకి విసిరిపడేసి) మళ్ళీ చాట గూడా యిక్కడే వుంది...

(చీపిరిపట్టుకుని సరళ వీధివైపు తెరనుంచి వస్తుంది)

సర: (మెల్లిగా) ఎవరితో పిన్నీ పోట్లాడు తున్నట్లున్నావు...

పార్వ: (వినిపించుకోకుండా) రా నీ చెపుతాను...అప్పమ్మ పేరు ఎప్పుడు పెట్టారోగానీ...అప్పడాల కర్ర మ్మలా అయింది నా ప్రాణానికి... నా మాటంటే అంత నిర్లక్ష్యమూ...

సర: (కొంచెం వెనక్కు తగ్గి) పిన్నీ...

పార్వ: (వంటింటివైపు పోతున్నదల్లా తిరిగి వచ్చి) ఆ వచ్చావు... (సరళను చూడ కుండా చాటపెట్టి కొట్టుతుంది) ఎక్కడకు పోయినట్టే...

సర: (చీపిరి అడ్డం పెట్టుకుని) నేను పిన్నీ...సరళని...అయినా అంతకోపంగా వున్నావేమిటి యివ్వాళ...

పార్వ: అయ్యొతల్లీ నువ్వటే సరళా... (విసుక్కుంటూ) యింకా అప్పమ్మ వచ్చిం దనుకున్నాను... సరిగ్గా కనపడి చావ దాయిరి...

—: ఇందులో :—

పార్వతమ్మ: నలభైఅయిదేళ్ల ముత్తైదువు

సరళ: ఇరవైయేళ్ల వయస్సు...
భేషజంలేని సాదావేషం

కమలమ్మ: నలభైయేళ్ళ వయస్సు...

పద్మ: ఇరవై యేళ్లు...హ్యాండ్ బ్యాగ్ నల్లద్దాలకళ్ళజోడు...డాంబికంగా కనపడే వేషం.

సర: పోనీలే పిన్నీ...మొన్న కళ్ళజోడు పెట్టించుకున్నావుగా...ఏమయింది పిన్నీ..

పార్వ: (చికాకుపడుతూ) అదిమటుకు కనపడి చావొద్దూటే పెట్టుకోవటానికి...

సర: (అటూయిటూ వెదికి) ఇక్కడుంది పిన్నీ...ఈ మూలకి వూడ్చేశారెవరో... (కొంగుతో తుడిచి చేతికందిస్తుంది)

పార్వ: (కళ్ళజోడు పెట్టుకుని) చీపిరి నీ చేతిలో కెలా వచ్చిందే...

సర: లోపలకు రాబోతుంటే మీద పడింది పిన్నీ...ఆ పాటున పట్టుకువచ్చాను..

పార్వ: (కణతలు నొక్కుకుని) ఎంత పాపిష్టిదాన్ని సరళమ్మతల్లీ ... పొద్దున్నే ఎవరి ముఖం చూశానో ఏమిటో...

సర: (ఆలోచనగా వచారు చేస్తూ) అవును పిన్నీ! ఎవరి ముఖం అయివుంటుంది. పొద్దున్నే అద్దంలో ముఖం చూసుకునే అల వాటు కూడా లేదాయె...

పార్వ: వూరుకోమ్మ తల్లీ ... నీ ఎక సెక్కాలకి వక వేళాపాళా లేదు...

సర: అదిగాదు పిన్నీ...

పార్వ: అది కాకపోవటమేమిటే...మా గోపాలానికే గనక పెళ్లయితే నాకీ గొడవ లన్నీ తప్పేవిగావూ...ఇప్పుడనుకుని ఉప యోగం ఏమిటికే...నా చేతికి అసల దొరికే గీత వుండద్దూ నా ముఖాని...

(వీధివైపు తలుకొటేన చప్పుడవుతుంది.)

చూసిరామ్మ సరళా...మా యింటి తలు పులు బాగా వుండటం యిష్టంలేని వాళ్ళె వరో వచ్చినట్లున్నారు...

సర: (లోపలకు పోతుంది)

పార్వ: నన్ను వదిలిపెటితే ఈకొంపలో తలకాయ వున్నవాళ్లు వక్కళ్ళూ కనపడరు గదా...(సరళ ప్రవేశం) ఆ...వచ్చావు... ఎవరే

సర: ఎవరో పిన్నీ, నీ కోసం వచ్చా మంటున్నారు...

పార్వ: ఈ వేళప్పుడు నాకోసం వచ్చే వాళ్లెవరమ్మా...ఆడవాళ్లా...మగవాళ్లా...

సర: ఆడవాళ్లలాగే కనపడుతున్నారు పిన్నీ...నీతో పనివుండి వచ్చారుట...

పార్వ: నాతో పనా...రామ రామ... ఈ కొంపకి ఎవరు వచ్చినా ... యిట్లా అర్ధాంతరంగా వుంటుంది ... ఈ పాతబట్ట వంటింట్లో దండెంమీద వేసి రామ్మా... ఇదిగో చూడు, దొడ్లో కుర్చీ వుంది పట్టుకు రా...వింటారా పెటతారా...వద్దురా అం టూంటే వాడు బాదమాకులు అందటం లేదని తీసుకుపోయాడు...ఛీ ... వస్తారో ఏమిటో...యిదిగో సరళా ... వాళ్ళెట్లా వున్నారు ... పెద్దమనుష్యులలాగా వున్నారా...

సర: వక మనిషి పెద్దదే పిన్నీ...రెండో అమ్మాయి...నా అంత వుంది ... (లోప లకు పోతుంది)

పార్వ: సరే ఏదయితే ఏం చేస్తాంగాని తొందరగా వని తెముల్చుకురా...కొంచెం శుభ్రంగా అన్నావుంటే (గది చకచకా వూడ్చి చీపిరి దొడ్డివైపు తెరలోకి విసిరి వేస్తుంది)

సర: (చీపురు పట్టుకువస్తూ) మళ్ళీ ఎవరి మీద కోపం వచ్చింది పిన్నీ...

పార్వ: అయ్యో నా తల్లీ...(చీపురు నేలమీద మూడుసార్లుకొట్టి వంటింటివైపు విసురుగా విసిరేస్తుంది)....సరళా....వాళ్లే దయినా మర్యాద చెయ్యొద్దూటే......

సర: అవును పిన్నీ...అయినా ఆడవాళ్లకేం మర్యాదకావాలి...కాళ్లకు పసుపురాసి ముఖాన కుంకంపెటితే చాలదూ...అంత కంటే యింకేం కోరుకుంటారు పిన్నీ...

పార్వ: నీచాదస్తం చట్టుబండలయిరిగాని



# పెళ్లి చేసుకుని చూడు



తర్వాత...మనం అంతా కలిసి బయలు దేరుదాం...

కమ: మీ అబ్బాయిని ఒకసారి పిలుస్తారా చూద్దామని వుంది....

పర: మా అన్నయ్య బజారుకెళ్లాడండి... ఇంటికి రాలేదు...

కమ: ఆహా...అయితే మీ అబ్బాయి బి. ఏ. చదివారన్నారుగదా...అదీ గాక భూమీపుట్రా ఏమన్నా వుందండీ...

పర: భూమి లేదుగానీండి...కరువులూరి చెరువుకట్టమీద నాలుగుగజాలపుట్టవుంది...

పద్మ: ఎగతాళిగా వున్నట్టుందే మీకు...

పర: అబ్బే నాకు ఎగతాళి ఎందుకండీ...

కమ: ఎగతాళి కాకపోతే కొంచెం సూటిగా మాట్లాడండి... మీ అబ్బాయి పేపర్లో "పెళ్ళి చేసుకోదలచినట్లూ...ఎవరయినా తయారుగా వుంటే ఈ ఎడ్రసుకు వచ్చి మాట్లాడమ"నీ రాశారు. అందుకే వచ్చాం. మాకేం పనిలేక కాదు...

పార్వ: అంత కోపంఅయితే ఎట్లాగండి...

కమ: అబ్బే కోపంగాదండి...నా తీరే అంత...ఏదయినా మాటవస్తే అట్లాగే మాట్లాడుతాను...

పర: అట్లాగయితే మా అన్నయ్యకి ఇబ్బంది లేదులెండి...

పద్మ: మీ అబ్బాయిగారికి పాడటం వచ్చునాండీ...

పార్వ: ఏం వచ్చులేండి...మా సంగీతం మేష్టారు కొంతకాలం చెప్పారు...

పర: తరవాతతరవాత...ఆయన సంగీతం మా అన్నయ్యకు వచ్చేసి...ఆయన మా అన్నయ్య అంతటివాడు అయ్యేట్లు కనపడేటప్పటికి ఆయన కాస్తా పాఠం చెప్పటం మానేశాడు...

కమ: ఉఫ్...అట్లాగయితే చాలా కష్టమేనే...

పద్మ: కనీసం సినిమా పాటలన్నా పాడగలరా...

పర: ఒకటి రెండు వచ్చునండి...పాటలు నోటికి వచ్చుగాని ట్యూను సరిగ్గా యింకా వంటపట్టలేదు...

పద్మ: అలాగయితే నాకీ పెళ్ళి వద్దమ్మా..

కమ: చూడు అమ్మాయి ... అట్లాగంటే ఎలా చెప్పు ... ఆయనకి పాటలు రాకపోతే మనింట్లో గ్రామఫోను వుందిగా ... అది పెట్టుకుని డాన్సు చేద్దువుగాని...

పర: మీకు డాన్సుచెయ్యటం వచ్చునన్నమాట...

కమ: అయ్యో రాత...డాన్సు వచ్చున్నమాటేమిటండీ...మా అమ్మాయిబాలగోపాల తరంగంపాడుతున్నప్పుడుడాన్సుచేస్తుందీ... చూడాలిగాని చెపితే మీకు అర్థంగాదు...

పర: అవును లెండి మీకు చెప్పటం గూడా కష్టం...

కమ: ఆ చివరి చరణం ఒక్కపదం తొక్కి చూపించమ్మ పద్మా...

(పద్మ లేచి నిలబడుతుంది).

పార్వ: అబ్బే యిప్పుడెందుకు...మా అబ్బాయి వచ్చింతర్వాత ప్రదర్శిద్దురుగాని...

పద్మ: పాడటం చేతగానప్పుడు...మీ అబ్బాయి వస్తేయేం...రాకపోతేయేం... ఏమే అమ్మా...

కమ: కొంచెం ఆగమ్మా...వద్దన్నప్పుడు డాన్సు చెయ్యకూడదు...నీకు కాళ్లు అంత యిదిగావుంటే యింటికి వెళ్ళేటప్పుడు కాస్త నడిచే పోదాం...

పర: మీరు డాన్సు ఎక్కడ నేర్చుకున్నారండీ...

పద్మ: (విసురుగా) నా కెవరూ నేర్పక్కర్లేదు...నాకే వచ్చు...

కమ: అదికాదండీ...ఏదయినా సినిమా రెండుసార్లు చూసిందంటే ఆ సినిమాలో వున్న నడకలన్నీ యిట్టే పసిగట్టేస్తుంది మా అమ్మాయి...మూడోసారి ఆ పాట... తాళం వింటే చాలు...లేచి నిలబడి సినిమాలోకంటే అద్భుతంగా పదం వేస్తుంది...

పర: మీ అమ్మాయి ఒకేసినిమా మూడుసార్లు ఎప్పుడన్నా చూసిందండీ...

కమ: ఉన్నమాట చెప్పొద్దూటండీ... ఒక్కసారి చూసింది...ఆ మూడోసారి చూడటంతో మా అమ్మాయికి ఒళ్ళు తెలియక నిలబడి డాన్సుచెయ్యటం మొదలు పెట్టేంది...ఎవరో పోకిరి వెధవ బుజాలు పట్టుకుని కుదేశాడు...అంతా అల్లరి...మరీ పోయేకాలం...

పద్మ: ఫో...అవన్నీ యిప్పుడెందుకే... యిలా అంటే నే వెళ్ళిపోతాను...

పార్వ: అ...మ్మా...మీ అమ్మాయి ఇంత పాండిత్యం గలదన్నమాట.

కమ: మా అమ్మాయి ప్రతిభ యింకా మీకు బాగా తెలియదు...బ్రహ్మండసభ వారు ఒక పెద్ద బంగారు కప్పుయిస్తామని వాగ్దానం కూడా చేశారు...

పర: మీ పద్మగారికి డాన్సుకు ముగ్ధులయిపోయారన్నమాట....

కమ: మీ పద్మ గారిని...అసలు ఒకడు మూర్ఛపోయాడుట కూడాను. తరవాత తెలిసింది....

పద్మ: అబ్బ....కావాలసిన విషయాలు అడుగమ్మా....మీ అబ్బాయికి హిందీలో పాండిత్యం వుందండీ....?

కమ: అదెందుకే....

పద్మ: నేనెట్లాగో హిందీ నేర్చుకుందామనుకుంటున్నాగా....మళ్ళీ హిందీ మేష్టరు కోసం పోకుండా సరిపోతుంది....

పార్వ: మా అబ్బాయికి హిందీ బాగానే వచ్చునండీ....

పర: బాగా అంటే అదోమాదిరి లెండి ...అక్షరాలన్నీ బాగానే గుర్తుపట్టాడు ...ఒకొక్కసారి మాటలుగూడా చదువుతాడు...కొంచెం అర్థం దగ్గరకవట్టుగా వుంటుంది.

కమ: ఆ పాయింటు వదిలిపెట్టండి... మీ అబ్బాయికి పిల్లల్ని ఆడించటం చేతనవునాండీ...

పార్వ: అదేమిటండీ...అదెందుకూ...

కమ: దేవుడు దయతలిచి...నలుగురు పిల్లలు కలగాలిగాని...మా అమ్మాయికి సంగీతం, డాన్సు అంటే చెవి కోసుకుంటుందాయె...మరి యింట్లో పిల్లల్ని ఎవరు చూస్తారండి...మీది అంతా చమత్కారం.

పార్వ: నా చమత్కారం చట్టుబండలయినట్టే వుంది...మావాడు పిల్లల్ని...

పర: వూరుకో పిన్నీ...మా అన్నయ్యకు పిల్లల్ని ఆడించటం అంతగా చేతగాదండీ ...పెద్దవాళ్ళయితే...

కమ: అంటే...నే నేగా కొంపలో పెద్దదాన్ని...

పద్మ: అబ్బా...అసలు విషయం విడిచిపెట్టావేమిటే...

కమ: ఏమిటమ్మాఅది...నాకి మతిమరుపని నీకు తెలుసుగదా...ఆమాట నువ్వు మరిచిపోతే ఎట్లాగే...

పద్మ: నీ కెన్నిసార్లు చెప్పినా యింతే.

కమ: ఓస్...కట్నం సంగతా...నువ్వు అడగరాదూ...దానికింత ఖిడియం ఎందుకూ...

పద్మ: (తల్లిని రెండు చేతులతో వూపుతూ) నువ్వే అడగవే...

కమ: సరే కానీయమ్మా...మీ అబ్బాయి కట్నం ఎంతఇచ్చేది పేపర్లో రాయలేదండీ



కాఫీ ఏమన్నా యివ్వద్దులే....

సర: మా బామ్మ చేసిపోయింది పిన్నీ చేగోడీలు...ఎక్కువ రోజులు కాలేదులే చేసి...ఎంతా పదిరోజులయి వుంటుంది... మొన్న ఒకసారి చీమలన్నీ గూడా దులిపాను...పోనీ అవి ఫలహారంకింద....

పార్వ: అదిగానే, చేసి పదిరోజులవుతే...వాటికి రుచితోపాటు వాసన గూడా వచ్చిందేమో...అని.

(లోపలనుంచి మళ్లీ తలుపు బాదిన చప్పుడు.)

సర: చూడుపిన్నీ...ముందర వాళ్లు యింట్లోకి వచ్చింతర్వాత ఏం మర్యాద చెయ్యాలో ఆలోచిద్దాం...పోయి పిలుచుకువస్తా......

పార్వ: పోయిరాతల్లీ పోయిరా...... అప్పమ్మా....దీన్ని రేపటినుంచి పని మానెయ్యమని చెపుతాను...పీడ విరగడైపోతుంది...రేపయినా వస్తుందో రాదో...

(సరళ కమలమ్మా, పద్మలతో ప్రవేశం)

పద్మ: హల్లో...నమస్కారమండీ....

పార్వ: (తెల్లబోయి యిద్దరికీ వేరు వేరుగా దణ్ణాలు పెటుతుంది.)

పద్మ: (కమలమ్మను చూపిస్తూ) ఈమెను చూడండి...వయస్సు నలభై సంవత్సరాలు.. కాపురం రామాపురం గ్రామం......వృత్తి ఇంట్లో వంటపని వగైరాలు...ఈమె నాకు అమ్మగారు...అంటే మా అమ్మ అన్నమాట..

పార్వ: (విస్తుబోయి) అలాగా ఈమె మీ అమ్మగారన్నమాట ... అసలు చూడగానే అంతే అనుకున్నాను....

సర: అవునుపిన్నీ నేనూ...అలే అనుకున్నాను....

పద్మ: నిజంగా మీరట్లా అనుకున్నారు.

సర: చూస్తే తెలియటంలేదండి...ముందర మిమ్మల్ని చూడగానే... యిద్దరిలో ఎవరో ఒకరు రెండో వాళ్ళకి 'అమ్మ' వరస అయివుంటారని అనుకున్నాను...పోలికలు అంతే...

పద్మ: చాలా సంతోషం...

పార్వ: సరేగాని అమ్మాయి...నువ్వెవరో చెప్పావుగాదు...

పద్మ: చెపుతాను ... చెపుదామనే వచ్చాను...ఒక చిన్నమాట మీకు కోపం రాకపోతే...ఈపల్లెటూరి అలవాట్లు నాకు నచ్చవు...కనీసం మా కోసమయినా రెండు కుర్చీలు తెప్పిస్తే...

సర: దానికేంలెండి (లోపలకు పోయి రెండు కుర్చీలు తెస్తుంది) పిన్నీ ఇంకో కుర్చీ కావాలిగా...మనం లాంతరు పెట్టుకునే కుర్చీ పీట తీసుకురానా...

పార్వ: ఏదోఒకటి తీసుకు రామ్మా... లాంతరు అక్కడే పెట్టేసిరా...దాన్ని గూడా యిక్కడకు తీసుకువస్తే చోటెక్కడ చూపించేది...(లోపలకు సరళ పోతుంది)

పద్మ: నేనెవర్నో చెప్పమన్నారు గదూ......

పార్వ: చూడండి....మీరేదో అంటున్నారు గాని...నాకు కొంచెం చెముడు... మా అమ్మాయి రానీండి మాట్లాడుకుందాం... (సరళ ప్రవేశం).

పద్మ: ఏమండీ మీ పిన్నిగారికి చెముడుట గదండీ...

సర: అవును కొద్దిగా బ్రహ్మచెముడు...

కమ: ప్చ్...ఎట్లా వచ్చిందో పాపం...

సర: ఆ...మా తాతగారు బ్రహ్మసమాజం వాళ్ళు...బ్రహ్మ గురించి ఓం...హ్రీం... అని జపం చేసేవాడు...ఆ అరుపులకి మా పిన్ని చిన్నతనంలో చెవులకి దిబ్బెళ్ళుపడి... మాట వినపడకుండా పోయింది...బ్రహ్మకు సంబంధించిన చెముడుగదా అని ఆ పేరు పెట్టారు...

పద్మ: సరే నా గురించి చెపుతాను... కూర్చుందామా...

(నలుగురూ కూర్చుంటారు.)

నాకు యిరవై సంవత్సరాలండీ... బి. ఏ...గట్టిగా వుంటుందని పార్టు, పార్టు విడివిడిగా కూర్చుని మరీ పాసయ్యాను... నేను అందమైన దాన్నని అంతా అంటారు. మీ కయితే కనపడుతునే వున్నా గదా... నాకు నగలేవీ లేదనుకోండి... ఒకరిస్టువాచీ కాళ్లకు కొత్త స్లిప్పర్లూ...ఒక పెన్నూ యివీ ఆస్తి...నా పేరు పద్మ...నేను ఈమెగారి కూతుర్ని...యింక మీరెవరో పరిచయం చేసుకుంటారా...

సర: (పెడసరంగా) మా గురించి పరిచయం చేసుకోవటాని కేముందిలెండి...నా పేరు సరళ...బి. ఏ...ఒక్కసారిగానే పాసయ్యాను...ఈమె మా పిన్ని...బి. ఏ. ఒక్కసారి గూడా పాసుకాలేదు...

పద్మ: చాలా సంతోషం...

సర: అయ్యో ఎంతమాట. మాకు మటుకు సంతోషం కాదుటండీ...

పద్మ: (లేచినిలబడి) మీరు క్షమిస్తే... నాకు కొంచెం నడుస్తూ మాట్లాడ్డం అలవాటు.

సర: దానికేం భాగ్యంలెండి... చోటు లేదనిగాని... మీరు పరుగెత్తుతూ మాట్లాడినా మాకేం యిబ్బందిలేదు...

పద్మ: కొంచెం కాఫీ యిప్పిస్తే మాట్లాడానికి హుషారుగా ఉంటుంది. ఏమనుకోకండి...

సర: మేంగూడా కాఫీయిద్దామనే అనుకున్నామండీ...గేదె పారిపోవటం చూ వున్నట్లయితే...

పద్మ: వండర్ ఫుల్ ... మీ గేదె కాఫీ తీసుకుని పారిపోయిందా...

సర: కాఫీ కాదు...పాలుతీసుకుని పారిపోయింది.

పద్మ: పోనీండి...వచ్చినతర్వాత ముంతలోకి చల్లకావాలీ అని అడుగుతే సరిపోతుంది. నాకు పేపరుచదివే అలవాటు.

పార్వ: అయ్యో పాపం...ఇక్కడ పేపర్లు రావండీ. సరళా...మొన్న చింతపండు పేపర్లో కాదులే కట్టిచ్చిందీ...

పద్మ: అబ్బే పాతపేపరు గాదండీ... నేను మొన్న పేపర్లో చదివిన విషయం మీద మాట్లాడుదామని...

సర: దానికేం మాటాడండి—ఇంగ్లీషు పేపరో చదివారా.

పద్మ: అవునండీ.

సర: భాష ఏదయితేనేం గానీండి... మీరు తెలుగులోనే మాట్లాడితే...మీకే కాకుండా మిగతావాళ్ళకిగూడా అర్థం అవుతుంది.

పద్మ: చమత్కారంగా మాట్లాడతారే.

కమ: (గొంతు సవరించుకుని) నే నిప్పుడు మాట్లాడుదామనుకుంటున్నాను. చూడండి ...మొన్న పేపర్లో...

పద్మ: ఊరుకో అమ్మా. ఆ విషయం నే చెపుతాగా...ఆ పేపర్లో ఒక ప్రకటన వుందండీ...దాన్నిబట్టి మీయింట్లో పెళ్ళి కావలసిన కుర్రాడు ఒకడున్నాడని తెలిసి-చూచిపోదామని వచ్చాం.

పార్వ: (ఉలిక్కిపడి లేచి) పేపర్లో పడిందా...

సర: ఎవరు పిన్నీ గోపాలం అన్నయ్య సంగతేనా...

కమ: కరెక్టు. గోపాలరావు...బి. ఏ. అని వుంది. పక్కయింట్లో అడిగితే పార్వతమ్మగారి అబ్బాయి అని చెప్పారు...ముఖతః మాట్లాడిపోదామని వచ్చాం.

సర: మీ ఇంట్లో పెద్దవాళ్లు ఎవరయినా....

కమ: వయసులో పెద్దవాళ్లు చాలామంది వున్నారులెండి...అయినా ఆడపిల్ల పెళ్ళి మొగపెద్దలకి అప్పచెపితే......ఇంకేమన్నా వుందా...అందుకని నే నేవచ్చాను...

సర: బ్రహ్మాండంగావుంది...మీ లాటి ఆదర్శ మహిళలు యింటికొకరువున్నా...

కమ: థ్యాంక్స్......

సర: థ్యాంక్స్ ఏమిటండీ ... మీలాటి వాళ్ళందరూ పూనుకుంటే...అసలు ఒక్క మొగవాడికిగూడా పెళ్లి కాకుండా ముందర ఆడపిల్లలందరికీ పెళ్లిఏర్పాట్లు చేయించేవాళ్లు గదండీ.

పార్వ: పూరుకో అమ్మా సరళా...

సర: ఏమిటి పిన్నీ పూరుకునేది...మీరు గూడా నడుము కట్టుకుని బయలుదేరాలిగాని.

పద్మ: ఇప్పుడు వచ్చిన పనయిపోయిన

...అదికూడా ముందుగానే తెలుసుకుంటే బాగుంటుంది...

పార్వ : కట్నం...!? ఎవరు యిచ్చేది.

కమ : అంతగా ఆశ్చర్యపోతే ఎట్లాగండీ ...మీకు చాదస్తం వదల్లేదన్నమాట.

సర : అబ్బే ఎక్కడండీ......మీకంటే అయిదేళ్లు చిన్నదికూడా కామాలు...

పద్మ : ఎందుకమ్మా వసుగుడు ... నిక్కచ్చిగా అడిగివెయ్యవచ్చు గదా...

కమ : మాడండీ...మీరు కట్నం ఎంత ఇవ్వదలచుకున్నారో నిక్కచ్చిగా చెప్పండి ...... తర్వాతతర్వాత పేచీ వనికిరాదు ---

పార్వ : అసలు మేమేమీ యివ్వదలచుకో లేదు...

కమ : అయితే మాకీసంబంధం వద్దు... ముందర కట్నం యివ్వలేనివాళ్ళు గొప్పగా ...పెళ్లిచేసుకుంటానూ...అంటూ పేపర్లో వేయించటం ఎందుకండీ...

సర : కట్నం యిస్తాంలెండి... నువ్వూరుకో పిన్నీ...నే మాట్లాడతాగా... ఎంతలో వున్నారేమిటి...

పద : నాకు పియానో కొనుక్కోవటానికి... చిన్న సైజు మోటారు సైకిలు కొనుక్కోవటానికి సరిపోవాలి... అత్తగారి లాంచనాలు మా అమ్మకి...మా నాన్నగారికి పట్టుబట్టలూ వెండి చెంబులూ...

కమ : సరే యింట్లో వాళ్ళందరికీ బట్టలూ ...రొక్కం అయిదువేలకి తగ్గకుండా వుండాలి...

సర : అదెంతభాగ్యంలెండి ... వక్క చెక్క రాస్తే అయిపోతుంది...

(లోపల తలుపుతట్టిన చప్పుడు)

పార్వ : ఎవరో వచ్చినట్టున్నారు చూసి రామ్మా...(సరళ వెళ్ళిపోతుంది)

కమ : ఈ సంబంధం మీకంత యిష్టం లేనట్లుందండీ...

పార్వ : అబ్బే యిష్టంలేకేమండీ...ఇటువంటి వియ్యపురాలు వచ్చిందంటే నాకింకేం కావాలి...

పద్మ : అన్నయ్యనికూడ తీసుకువస్తే బాగుండేదమ్మా ... పెళ్ళికొడుకుని చూసే వాడు...

కమ : మగవాళ్ళు చూడటం వేరు ఎలాగయినా...

పార్వ : బాగా చెప్పారు...

కమ : అసలు నే చెప్పేవన్నీ బాగానే వుంటాయండీ...మా ఆయన ఎప్పుడూ ఈ మాటే అంటూవుంటారు...

పద్మ : నాకు కొంచెం తలనొప్పిగా వున్నట్లుందమ్మా...

కమ : ఏమండీ...మీ ఇంట్లో అమృతాంజనం లాంటిది ఏమన్నా వుంటే...

పార్వ : లాంటిది ఏమిటి...అదేవుంది...

కమ : బ్రతికించారు...

పార్వ : ఏం బ్రతికించటంలెండి...నిన్న యిట్లాగే ఎవరో వచ్చారు...తలనొప్పి వచ్చిందని అదంతా తలకి పట్టించారు...

కమ : కొద్దిగావుంటే చూడండి...

పార్వ : అసలు ఏమీలేదు ... కొంచెం కూటుగా వుంటుంది ... ఖాళీసీసా తెమ్మంటే...

(సరళ ప్రవేశం)

సర : అన్నయ్య వచ్చాడు పిన్నీ...

పార్వ : ఎవరూ...గోపాలమేనా...వీళ్లు వచ్చినట్లు చెప్పావా...

సర : అన్నీ చెప్పాను...ఇంట్లోకి రానంటున్నాడు...అటునుంచి అటే పోతానంటున్నాడు...

పార్వ : అదెట్లాగే ... పెద్ద మనుష్యులు వచ్చి కూర్చున్నారు...రానంటే ఎట్లా...

కమ : పోనీ వకసారి వచ్చి ముఖం చూపించి పొమ్మనరాదుటండీ...

సర : ముఖానికేం భాగ్యం...అసలు రావాలేగాని...

పార్వ : మీరు ఏమీ అనుకోకండి... ఇప్పుడేపోయి మాటాడివస్తాను.

సర : నేను వీళ్ళతో మాట్లాడుతూ వుంటానులే పిన్నీ...నువ్వు పోయిరా... ఆ...ఏమండీ ... మూడవ ప్రపంచయుద్ధం వస్తుందంటారా.

పద్మ: ఆ...వస్తుంది...అట్లాగే కనపడుతోంది...

సర: నేనూ అదే అనుకుంటున్నాను... (కమలమ్మవైపు తిరిగి) మీరేం అనుకుంటున్నారండీ...

కమ: నేను యింకా ఏమీ అనుకోవటం లేదు...అనుకున్న తర్వాత మీకు వుత్తరం రాస్తాను...

సర: మీకీ విషయం నచ్చకపోతే యింకే దన్నా మంచి టాపిక్ చెప్పండి...మాట్లాడుకుందాం...

పద్మ: కూడో ప్రపంచయుద్ధం గురించే మాట్లాడుకోవచ్చు...తప్పేమీ లేదు...

సర: అలాగయితే అసలు ప్రపంచయుద్ధం రావటానికి కారణం ఏమిటంటారు...

కమ: నన్నడుగుతే చెపుతాగా...పెళ్లిగాని ఆడవాళ్లూ మొగవాళ్లూ వున్నంతకాలం...ఈ ప్రపంచయుద్ధాలు తప్పవండీ

పద్మ: నువ్విట్లా మాట్లాడితే నే వెళ్లిపోతాను...

కమ: నన్ను బెదిరిస్తావేమిటి...కావాలని సంబంధం చూడటానికి వచ్చి.... (లేచి నిలబడుతుంది)

సర: తొందరపడకండి కమలమ్మగారూ.

కమ: తొందర కాకేమిటండీ...మారోజుల్లో ఈ సంబంధాలు చూడటం ఎరుగున్నామూ...ఇంత...

సర: అవుననుకోండి...ఇంత అన్యాయం లేదుట...

కమ: పుల్లిగా మాట్లాడతావేమిటండీ... మావంశంలో ఇంత అన్యాయం ఎక్కడాలేదు...మానాయనమ్మ వుందంటే...

సర: (ఆశ్చర్యంగా నిలబడి) మీకు కూడా నాయనమ్మ వుందండీ...

కమ: అయ్యో రామ...అసలు మా నాయనమ్మే లేకపోతే మేమంతా ఎక్కడి నుంచి వచ్చామండీ...

పద్మ: మాట్లాడితే ప్రపంచయుద్ధంగురించి


## తరచుగా మూత్రం వెలువడుచున్నదా?

చక్కెరతోగాని లేక చక్కెర లేకుండాగాని తరచుగా మూత్రము వెలువడుట మిక్కిలిప్రమాదకరమైన చిహ్నము. శరీరాన్ని గుల్ల చేయడమే కాకుండా యీ వ్యాధి. తనబంధంలో చిక్కిన వారిని ఆరోజుకారోజు మృత్యువుకు అవన్నువి చేయును. ప్రథమదశలో శారీరక మానసిక శ్రమలకు యిచ్చగించకుండుట, నడుములో నొప్పి, చూపు మాంద్యము, కాళ్లలో తిమ్మిరి, వరముం బలహీనతతో యీ వ్యాధి పొడచూపును. పై లక్షణములతోకూడిన వ్యాధికి వెంటనే తగిన చికిత్స చేయించకున్నచో, అధికదాహం, ఆకలి, గొంతు, నోరు యెండుట, దురదలు, కాళ్ళలో పగుళ్లు తూకంతగ్గడం, శరీరమంతా పోట్లు, కీళ్ల నొప్పులు, కంటిపొరలు, క్షయ, గడ్డలు, రాచపుండ్లు, యిట్టి భయంకర బాధాకరమైన వ్యాధులు యెన్నో సంభవించవచ్చును.

"వీనస్‌ఛారమ్" మాత్రలు వాడి, అనేక వేలమంది తమబాధల నుండినివారణపొంది మృత్యుకరాళము నుండి రక్షింపబడిరి, "వీనస్ ఛారమ్" శాస్త్రీయ పద్ధతులమీద, ప్రాచీన యూనానివైద్య విధానప్రకారం అమూల్య ఓషధుల, శాకపదార్థముల, స్వాభావిక క్షారముల సారముతో తయారైనవి. మూత్రములో పంచదార, పలుమారు మూత్రవిసర్జనచేయు అవసరము, 2 లేక 3 రోజులలోనే మీకు చాలాభాగము నివారణగును. కొద్ది రోజులలోనే మీకు వగావికపైగా స్వస్థత చేకూరినట్లవిపించును. "వీనస్ ఛారమ్" కొద్ది వ్యయముతో, సుఖముగా, తేలికగా సేవించవచ్చును. దీనికి ప్రత్యేకపథ్యము లేదు. నిరాహారముతో నుండే అవసరంలేదు. రోగులు పుష్టికరమైన ఆహారము తినేందుకై రోగులు యిదివరకటికంటే యెక్కువరకాల ఆహారపదార్థములు తీసికొనవచ్చును. వివరములు గల ఇంగ్లీషు కరపత్రములు అడిగినచో ఉచితముగా పంపబడును. ధర: 50 మాత్రల పీసా రు. 6-75 ప్యాకింగు పోస్టేజి ఉచితము.

లభించు స్థలము :

Venus Research Laboratory (A. P. W.)

P. O. Box No. 587, Calcutta.

## ★ పెళ్లిచేసుకుని చూడు ★

మాట్లాడండి... లేకపోతే పూరుకోండి... ఈ సంకేతవృత్తాలు తిరగెయ్యటం నాకేం నచ్చదు...

సర: మీకోపం వస్తే ఎందుకులెండి.

పద్మ: (మండిపడుతూ) మీరుప్రతిదానికి కోపం, కోపం అనకండి... నాకేం లేదు...

కమ: నువ్వుగూడా ఏమన్నా మాట్లాడక రాదుటే వినుకోబోతే...

పద్మ: ఏం మాట్లాడాలి ... యుద్ధం వస్తుందో రాదో ఎవరికి తెలుసు...

సర: నాకు తెలుసు...

పద్మ: ఏంటండీ...మీకేం తెలుసు (దబాయింపుగా అంటుంది)

సర: యుద్ధం వచ్చేట్టుగా నే వుంది. (పార్వతమ్మ ప్రవేశం) సరే యుద్ధం సంగతెందుకులెండి...మాపిన్ని వచ్చిందిగా.

పార్వ: నేనేం యుద్ధం చెయ్యటానికి రాలేదు...చిన్నా పెద్దా ఏమీ అక్కర్లేకుండా సరళా...

సర: నీ సంగతి కాదుపిన్నీ.

పార్వ: లేకపోతే మా అబ్బాయి సంగతేగా...వాడూ ఏం పోట్లాడేరకం గాదు.

సర: అబ్బా ... అదిగాదు పిన్నీ ... అన్నయ్య వస్తున్నాడా లేదా?

పార్వ: వా డెందుకు వస్తాడే...సిగ్గు రావటానికి. ఆ మాట అనటానికి బుద్ధి ఎలా పుట్టిందో...ముఖానికి సిగ్గు లేకపోతే సరి.

సర: నేనే పోయి యింకోసారి చెప్పి చూస్తాను.

పార్వ: ఇందాకటి నుంచి వితండవాదం. వాడితోగాబట్టి పోట్లాడి పూరుకున్నాడు... అసలు పెళ్లి చేసికోట...నువ్వైతే చెయ్యి చేసుకుంటాడు.

కమ: (హఠాత్తుగా నిలబడి) మీ అబ్బాయికి చెయ్యిచేసుకునే అలవాటు గూడా వుందండీ?

సర: అబ్బే...బయటివాళ్ల మీద గాదు — ఇంట్లోవాళ్లయితే నే.

కమ: ఓహో...(పదు ట బ డి కూర్చుంటుంది) ఇప్పుడింతకీ రానంటున్నా డన్న మాట...సరేందుకు అదీ మంచిదేలెండి— ఏమే పద్మా! అలా దిగాలుపడిపోయావు...

పద్మ: అహా...ఏం లేదు...ఒక్కసారి ఎందుకనో ధడుకుచుకున్న ట్లయిందమ్మా.

కమ: చెప్పమ్మా మంచినీళ్ళు కావాలంటే...

సర: మంచినీళ్ళు వచ్చేటప్పుడు తాగిపోదురుగాని...

పార్వ: మరి మీఅబ్బాయి ఎవరోవున్నారన్నారు...పెళ్లయిందండీ...

కమ: అబ్బె ఎక్కడా...నాలుగయిదు చోట్లనుంచి కబుర్లువస్తున్నాయి గానీండి... ఇంతవరకూ ఎవరూ చూసిపోలేదు.

పార్వ: పోనీ మా సరళకిస్తా రేమిటి... వియ్యం కలిసిపోతుంది...

పద్మ: ముందర దీని సంగతి తేటలంగానీ

(33-వ పేజీ చూడండి)

చల్లనైన, తెల్లని

# బ్రిల్‌క్రీమ్ BRYLCREEM

బ్రిల్‌క్రీమ్ వాడి మీ కేశములను ఎక్కువ నిగనిగలాడుచు నలుపుగా ఉంచుకొనండి

★ బ్రిల్‌క్రీమ్‌లోనున్న పరిశుభ్రమైన పెరుగున్న నూనెలు మీ కేశములను సహజ వర్ణదవమును, తళతళ మెరుస్తు కనపడేలాగ చేయును.
★ శుభ్రమైన, తెల్లని బ్రిల్‌క్రీమ్‌ను ప్రతిరోజు మీ శిరస్సునకు వాడండి. ఇది చుండ్రు రాకుండా మీ కేశములను శుభ్రముగ మరియు ఆరోగ్యకరముగా నుంచును.
★ బ్రిల్‌క్రీమ్ కొద్దిగా రాచేసుంటేనే చాలును! అందువలన పొదుపు చేకూరును. నేడే ఒక సీసాను కొని మీకు మీరే విర్ధారణ పరచుకొండి.

ఇతర ఉన్నతి పొందిన వారివలె వినూ మన్‌కడ్ కూడ బ్రిల్‌క్రీమ్ వాడును



బహు ఉన్నతి పొందిన వారు వాడేది

బ్రిల్‌క్రీమ్

గ్రూప్ లేబరేటరీస్ (ఇండియా) ప్రైవేట్ లి.



# నక్షత్ర ఫలితాలు

(8-1-58 మొదలు 14-1-58 వరకు)

బి. నరసింగరావు

### గ్రహస్థితి

| | | | |
|---|---|---|---|
| | కే | | |
| | 8 తేదిని శుక్ర వక్రారంభము. 14 తేదిని రవి మకరమందు ప్రవేశించును. కర్కాటక, సింహ, కన్య, తుల లలో చంద్రుడు. | | |
| శు | | | |
| ర బు | శ కు | గు రా | |

### *అశ్వని [చూ, చే, చో, లా]*

సాహసములో మొదలుపెట్టే పనులు ఫలించక నిరాశ చెందుతారు. మీ ఆలోచనలు కార్యరూపములోకి మారిందికి శ్రమతో ప్రయత్నించినను ఇంకా కొంతకాలానికి గాని జరగవు. ఎదురుచూచిన డబ్బు తగిన సమయానికి చేతికి రానందున అప్పు చేయవలసి వస్తుంది. బంధుమిత్రుల రాకపోకల వల్ల ఖర్చులు అమితముగా పెరుగుతాయి. ఉద్యోగస్థులు అధికారులచే మాటపడి మనోవ్యథ పొందుతారు. విద్యార్థులు వినోదములలో పాల్గొని ప్రమాదములకు లోనౌతారు. లోహముల వ్యాపారస్థులకూ రంగుల వ్యాపారస్థులకూ లాభించును. 8, 9 తేదిలలో బంధువుల రాక, ఋణము. 13, 14 తేదీలలో అధిక ఖర్చులు. అస్వస్థత.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము మీ బుద్ధిబలముచేతను మీ కలుకుబడిని వినియోగించి కార్యసాధన పొందుతారు. మిత్రులను కలుసుకుంటారు. భార్య ఆరోగ్యము బాగుపడుతుంది. ఆప్తుల క్షేమవార్త వింటారు. విద్యార్థులు కొత్త విషయాలు నేర్చుకుంటారు. డాక్టర్లకు, మందుల వర్తకులకు లాభం. గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, కళాకారులకు మేలుకాలము. 8, 9 తేదీలలో కార్యాచరణలో త్రిప్పట, అశాంతి. 10, 11, 12 తేదిలలో ఆప్తులతోను, మిత్రులతోనూ వినోదము అస్వస్థత.

### *కృత్తిక [ఆ, ఈ, ఊ, ఏ]*

ఈ వారము మీ హోదా పెరుగుతుంది. గత వారము నిరాశచేసుకున్న పనులు త్వరలో ఫలవంతమవుతాయి. ఆర్థికస్థితి అభివృద్ధి అవుతుంది. విజ్ఞానవిషయాలు తెలుసుకుంటారు. పిల్లల అభివృద్ధికొరకు ప్రయత్నాలు చేస్తారు. విద్యార్థులు శ్రద్ధగా విషయాలు నేర్చుకుంటారు. న్యాయవాదులకు పండితులకు, కళాకారులకు యోగకాలము. 8, 9 తేదీలలో కార్యసాధనలో త్రిప్పట, శ్రమ. 10, 11, 12 తేదీలలో ఆర్థికలాభము. పిల్లలకు నూతనవస్త్రాలు కొంటారు. 13, 14 తేదీలలో విందుభోజనము, అశాంతి.

### *రోహిణి [ఓ, వా, వీ, వూ]*

ఈ వారము కూడా మీకు శుభయోగము వుంటుంది. మిగిలివున్న చిక్కులు తీరిపోతవి అనుకున్న సొమ్ము చేతికివస్తుంది. బంధువులను కలుసుకొని లాభము పొందుతారు. మృష్టాన్నభోజనముతో వినోదిస్తారు. ఇంటియందున్న వారికి నూతనవస్త్రాలంకారములు కొంటారు. విద్యార్థులకు చదువుపై శ్రద్ధకలుగుతుంది. ఆభరణాల వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము. 8, 9 తేదిలలో త్రిప్పట, అశాంతి శ్రమ 10, 11, 12 తేదీలలో కార్యలాభము. ఖర్చులు ఎక్కువ. 13, 14 తేదీలలో పిండివంటలతో భోజనము, అస్వస్థత.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది. అసంపూర్తిగా వున్న కార్యములు ఈ వారము లాభకరముగా ముగించుకుంటారు. ఆభరణములు కొంటారు బటల వర్తకులకు లాభము. గృహమందుండు వారికి కొత్తబట్టలు కొంటారు. విద్యార్థులు శ్రద్ధగా చదువుకుంటారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలం. 8, 9 తేదీలలో త్రిప్పట, ప్రయాణము. 10, 11, 12 తేదీలలో కార్యసిద్ధి, ఖర్చులు ఎక్కువ. 13, 14 తేదీలలో బంధువులతో కలిసి పిండివంటలతో భోజనము. అనారోగ్యము.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

అన్ని రంగములలోను మీరు జాగ్రత్త వహించడము మంచిది. కార్యభారము ఎక్కువ. ఆదాయవృద్ధికి చేసే ప్రయత్నాలు ఫలించవు. ఆశించిన ధనసహాయం కలుగక పోవుటచే గృహావసరములు తీరక మనస్తాపం కలుగును. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ తక్కువ. 8, 9 తేదీలలో కార్యభంగము, అస్థిమితము, మనోవ్యథ. 10, 11, 12 తేదీలలో ప్రయాణము, స్వల్పలాభము. 13, 14 తేదీలలో అమిత ఖర్చులు, ఆందోళన, ఆరోగ్యభంగము.

### * పునర్వసు [కే, కో, హా, హీ,] *

ఈ వారము మీకు అంత యోగకాలము కాదు. కార్యరంగములో అనేక ఆటంకాలు కలుగుతునే వుంటాయి. మిత్రులెవరో శత్రులెవరో తెలుసుకుందికి కూడా మీ బుద్ధి పనిచెయ్యదు. వ్యాపారస్థులకు ఆరాటం. విద్యార్థులకు చదువుమీద శ్రద్ధ తక్కువ. వ్యతిరేకులనుకొని అనుమానించిన వ్యక్తి సహాయంవల్ల కార్యసాధన కలుగుతుంది. 8, 9 తేదీలలో కార్యభంగం, శ్రమ, అస్థిమితము. 10, 11, 12 తేదిలలో ప్రయాణము, ఆకస్మిక మిత్ర సహాయం, కార్యసిద్ధి. 13, 14 తేదిలలో అమితఖర్చులు, మానసిక వ్యథ.

### *పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈ వారము మీకు మిశ్రమయోగం. యత్నకార్యములకు ఆటంకాలు కలుగుతాయి. దైవము నేనమ్ముకొని కార్యాచరణ చేస్తారు కనుక మీ ప్రయత్నములు చివరకు ఫలిస్తాయి. అయినను గృహావసరములు తీరక పోవుటచేతను ఇంట్లో వారికి అసంతృప్తి కలుగుతుంది. విద్యార్థులకూ చదువు సవ్యముగా సాగకపోయినను కొత్త విషయాలు నేర్చుకుంటారు. 8, 9 తేదిలలో నిలకడలేని స్థితి, శ్రమ. 10, 11, 12 తేదిలలో ప్రయాణము. ఆత్మవికారము, కార్యలాభము. 13, 14 తేదిలలో ఆరోగ్యచింత.

### *ఆశ్లేష [డీ, డూ, డే, డో]*

గతవారములోవలె ఈ వారము కూడా ఆదాయాభివృద్ధికి ఎక్కువ కార్యభారమును పైన వేసుకుంటారు. కాని ఆశాభంగము చెందుతారు. కోర్టువ్యవహారములలో కొంత అనుకూలత. ఉద్యోగస్థులకు అధికారుల ఒత్తిడి, వ్యాపారస్థులకు లాభము తక్కువ. ఆరోగ్యము చెడే సూచన లున్నవి. వ్యవహారముపట్ల స్త్రీలతో వివాదము. 8, 9

తేదీలలో కార్యభారమువల్ల త్రిప్పట, శ్రమ, వివాదము. 10, 11, 12 తేదీలలో కొద్దిగా కార్యసిద్ధి. 13, 14 తేదీలలో ఆరాటం.

### *మఖ [మా, మీ, మూ, మే]*

ఈ వారము విశేషసామర్థ్యమునంతటిని వినియోగించినను యత్న కార్యసిద్ధికి ఆలస్యము కలుగుతుంది. అయినప్పటికీ సాహసము కలవారగుటచే అధైర్యపడక ప్రయత్నిస్తూండడమువల్ల తుదకు ఫలసిద్ధిని పొందుతారు. జ్ఞాతి సహాయముతో చాలావరకూ ఒడిదుడుకులు సర్దుకుంటాయి. వాడిగల పనిముట్లవల్లగాని, యంత్రములవల్లగాని అపాయము కలుగవచ్చును; జాగ్రత్తవల్ల తప్పవచ్చును. ఇంజనీయర్లకూ, పోలీసు ఉద్యోగులకూ అనుకూలముగా వుంటుంది. 8, 9 తేదీలలో కార్యభారముచే త్రిప్పట, అస్థిమితము. 10, 11, 12 తేదీలలో ఆదాయవృద్ధి సహాయము, కొంత శాంతి. 13, 14 తేదీలలో ప్రమాదము.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) * [మో, టా, టీ, టూ]

ఈ వారము మీ బుద్ధికుశలతవల్ల కార్యానుకూలత పొందుతారు. అధికారము, హోదా పెరుగుతవి. అందువల్ల ఆర్థికస్థితికూడా పెరుగుతుంది. నూతనుల పరిచయలాభం కలుగుతుంది. కొంతకాలమునుండి స్తంభించిపోయిన వ్యవహారములు పరిష్కారమవుతాయి. ఉద్యోగులకు అధికారుల ఆదరణ లభిస్తుంది. భార్యాబిడ్డలకు వస్త్రాభరణములు కొంటారు. విద్యార్థులకు జ్ఞానాభివృద్ధి యగుతుంది. మందుల వ్యాపారస్థులకు లాభము. కవులకూ, శిల్పులకూ, చిత్రకారులకూ, నటీనటులకూ మేలుకాలము. 8, 9 తేదీలలో కార్యాచరణవల్ల త్రిప్పట, అలసట. 10, 11, 12 తేదీలలో ప్రయాణము, అధికారుల కలుపు, మిత్రదర్శనము, కార్యలాభము. 13, 14 తేదీలలో మృష్టాన్నభోజనము, అనారోగ్యము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) * [టే, టో, పా, పీ]

ఈ వారము మీకు యోగకాలము. ఆర్థికస్థితి వృద్ధిచెందుతుంది. కొంతకాలమునుండి మిమ్ములను బాధపెట్టుతున్న కోర్టువ్యవహారములవంటి చిక్కులు చాలావరకూ పరిష్కృతమై మీకు శాంతిని కల్గిస్తాయి. విజ్ఞానవిషయకమైన చర్చలవల్ల కొత్తసంగతులు తెలుసుకుంటారు. భార్యాబిడ్డలకు నూతనవస్త్రాలంకారములను సమకూరుస్తారు. విద్యార్థులు ఉత్సాహముతో చదువుకుంటారు. ఉద్యోగస్థులకు హోదా పెరిగేసూచన అగుపడి.

న్యాయవాదులకు, పండితులకు, కళాకారులకు యోగకాలము. 8, 9 తేదీలలో కార్యాచరణలో శ్రమ. 10, 11, 12 తేదీలలో ధనయోగము, కార్యసిద్ధి, పండితసాంగత్యము, విజ్ఞానార్జన. 13, 14 లలో అమితఖర్చులవల్ల అశాంతి.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము యత్నకార్యములు అనుకూలిస్తవి. ఆర్థికస్థితి కొంత మెరుగుగా వుంటుంది. బంధుమిత్రులతో కలిసి వినోదములలో పాల్గొంటారు. శుభవార్త వింటారు. వ్యాపారస్థులకు ముఖ్యముగా వెండి వర్తకులకు చాలా లాభముగా యుంటుంది. విద్యార్థులకు చదువుపై ఆసక్తి ఎక్కువవుతుంది. కవులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 8, 9 తేదీలలో కార్యభారము, త్రిప్పట, శ్రమ. 10, 11, 12 ఆర్థికలాభము, కార్యసిద్ధి, శుభవార్తాశ్రవణము. 13, 14 తేదీలలో బంధుసమాగమము ఇంటియందుండువారికి నూతనవస్త్రాలంకారములు, అశాంతి.

### *చిత్ర [పే, పో, రా, రీ]*

ఈ వారము బంధుమిత్రులతో కలిసి వినోదములలో పాల్గొంటారు. శుభకార్యములను గురించి ఆలోచనలు చేస్తారుగాని ఒక నిర్ణయానికి రాలేరు. వాహనయోగము వుంది. కుటుంబమందుండువారికి కొత్త బట్టలు, అలంకారములు కలుగజేస్తారు. వర్తకులు ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో లాభము పొందుతారు. నూలు, బట్టల వ్యాపారస్థులకు మేలుకాలము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగము. విద్యార్థులు శ్రద్ధగా చదువుకుంటారు. 8, 9 తేదీలలో కార్యాచరణలో త్రిప్పట, శ్రమ. ఆపైని అన్నిరంగములలో యోగము. 13, 14 తేదీలలో స్వల్పముగా అనారోగ్యము.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఆదాయము వృద్ధిచేసుకుందికి జరిపిన ప్రయత్నాలు ఫలించవు. కార్యభారము ఎక్కువ. అకాలభోజనమువల్ల ఆరోగ్యము చెడుతుంది. పితృవర్గమువల్ల ఆశించిన ధనసహాయము కలుగపోవుటచేత గృహావసరములు తీరక అసంతృప్తి ప్రబలుతుంది. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ తక్కువ. 8, 9 తేదీలలో కార్యభంగము, అస్థిమితము, మనోవ్యథ. 10, 11, 12 తేదీలలో ప్రయాణమువల్ల శ్రమ, స్వల్పలాభము. 13, 14 తేదీలలో ఖర్చులవల్ల ఆందోళన.

### ధరలు:

నూలు, వస్త్రములు : కొంచెము పెరుగును.

నూనెదినుసులు : మార్పు లేదు.

బెల్లము, పంచదార : కొంచెము హెచ్చును.

చింతపండు : తగ్గుముఖము పట్టును.

ఆహారధాన్యములు : స్వల్పతేడాలో మందముగా వుండును.

పప్పుదినుసులు : తగ్గును.

వెండి, బంగారము: కొంచెము చురుకగును.

దక్షిణదేశమున చెదురుగా వర్షించును. మేఘాడంబరము అధికమగును. అప్పుడప్పుడు వాయుపీడన కలుగును.

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామ నక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది.

కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, హృష్టుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈవారము పరిస్థితులు సుఖవంతముగా వుండవు. నిలకడలేని ఆలోచనలవల్ల చికాకు పడవలసి వుంటుంది. కార్యాచరణలో శ్రమపడుతూకూడా మాట పడవలసి వస్తుంది. ఇంట్లోనున్న పెద్దవారి ఆరోగ్యము సరిలేక ఆరాటం చెందుతారు. ప్రయాణములో కలిసిన వ్యక్తివల్ల అనుకోకుండా కార్యసిద్ధి పొందుతారు. వర్తకులకు మొదట్లో అనుకూలత లేకపోయినను వారాంతమున లాభిస్తుంది. 8, 9 తేదీలలో కార్యభంగము, మనోవ్యథ. 10, 11, 12 తేదీలలో ప్రయాణము, నూతన మిత్రదర్శనము, కార్యలాభము, 13, 14 తేదిలలో అమితఖర్చులు, ఆరోగ్యచింత.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము అన్ని కార్యములలోనూ అశాంతిగా వుంటుంది. నమ్మినవారే మీకు చిక్కులను కలిగిస్తారు. మీ మంచితనాన్ని వినియోగించుకొని మీవల్ల లాభమును పొందినవారే మీకు మోసముచేస్తారు. అయినను దైవమును నమ్మియున్నవారు కనుక అన్ని కష్టములను గడిచి గట్టెక్కు

అంటాడు వేదమూర్తి.

"చెప్పేందుకు ఒకరోజు చాలదు. భలే నాటకాలమనిషి. ఒకరోజు రాత్రి ఏమయిందనుకున్నావ్. ఏమండీ శుక్రవారం రాత్రే?" అని శ్రీబాబు ఆగ్నేయశర్మనుద్దేశించి అడుగుతోంటే, వేదమూర్తికి విసుగువచ్చింది. కథలో ఏ రోజు రాత్రికీ అన్న చిన్న విషయానికి ప్రాముఖ్యం ఇవ్వడం శ్రీబాబు తెలివితక్కువ. ఆ విసుగులో చెప్పుతూ నొక్కి "శనివారం రాత్రి. ఏ రాత్రయితేంకి చెప్పు. ఊ." అన్నాడు వేదమూర్తి.

"బాగా పొద్దుపోయి ఉంటుంది. ఊరు మాటుమణిగింది. మేము నిద్రపోతున్నాం. మా ఆవిడ ఖంగారుగా లేపింది: ఎదురింటి వాళ్ళింట్లో ఎవరో ఏడుస్తున్నారని. నిజమే. ఎవరో ఓదారుస్తున్నారుకూడా. ఏమిటీ రాత్రివేళ అనుకున్నాను.

'ఊరుకో కాంతా! ఏమిటే ఆఘాయిత్యపు మాటలు? ఊరుకో! ఛ. తప్పుకాదు. ఎవరయినా వింటే నవ్వుతారు' ఎవరివీ మాటలు? ఎవరు ఈ కాంత? ఆ అఘాయిత్యపు మాటలేవిటో. నాకు అంతుపట్టలేదు. ఉండబట్టలేక ఆగ్నేయశర్మగార్ని లేపాను. సరే తర్వాత కాస్సేపటికి అర్థమయ్యింది. ఆ ప్రబుద్ధుడు రాత్రి పన్నెండు గంటలకు నవలా సాహిత్యంలో మునిగిపోయాడని!"

"ఆ! బాగుంది." వేదమూర్తికి మంచి ఉత్సాహంగా ఉంది.

"ఆ అబ్బాయి భలే చిత్రమయినవాడులే. బాత్ రూమ్ సంగీతం వినితీరాల్సిందే. నీళ్ళు పోసుకుంటూ అన్ని ట్యూన్లు పాడేస్తాడు. నీళ్ళు పోసుకుంటూ, పోసుకుంటూ...ఏదో గుర్తుకువచ్చి...ఖయిస్‌లా పెడ్తాడు మొహం. మరోమాటు దేవదాసు అయిపోయి కనపడని ప్రేయసిని గీతికలతో పిలుస్తాడు బాధగా!"

"ఎప్పుడూ ఆ కిటికీదగ్గరే మకాం. వీధిని పోతున్న ఏ పశువూ అతని దృష్టిలోంచి తప్పించుకోలేదు. ఇంకా చెప్పాలంటే చాలా కథుంది."

"చెప్పరయ్యా!"

ఒక్కమాటు అతిచిత్రమయిన విషయం జ్ఞాపకం తెచ్చుకున్నట్లు, సాదాగా ఉన్నవాడల్లా ఫెళ్ళున నవ్వుతూ నుదురు తిరిగాడు. వేదమూర్తికి, ఆగ్నేయశర్మకి అర్థంకాక తికమకపడ్డారు.

"విషయం చెప్పనివ్వరయ్యా! నీ నవ్వు బంగారంకానూ!" అని శ్రీబాబును వేదమూర్తి అంటూంటే ఇంకా నవ్వుతూనే...

"భలే జెవాంతకుడులే!"

"ఏమిటసలుకథ!"

"ఆగ్నేయశర్మగారికి కోపం వస్తుంది." ఘక్కుమన్నాడు శ్రీబాబు.

"కోపం రాదు. పాడురాదు. చెప్పు."

"మొన్న సెలవల్లో వాళ్ళ రెండోవాడు కిష్టుడు లేడూ! వాడు సైకిలు నేర్పుతుంటానన్నాడు." మళ్ళీ ఇహి ఇహి మన్నాడు.

"ఓ! అదా!" అని ఆగ్నేయశర్మగారు పేలవమయిన నవ్వు నవ్వి, వెంటనే కోపం తెచ్చుకొని..."వెధవ తెలివి. అంతే. అంతకన్న ఏంలేదు. ఎందుకూ?" అని నసిగారు.

"బాగానే ఉంది. మీ ఇద్దరూ నన్ను ఇరుకున పెడుతున్నారు. చెప్పు చంపక" వేదమూర్తికి విషయం అర్థంకాక బాధగా కూడా ఉంది.

శ్రీబాబు నవ్వు ఆపుకుని చెప్పడం మొదలు పెట్టాడు.

"వెన్నెల రాత్రులులే. కిష్టుడికి సైకిలు నేర్పుతున్నారు శర్మగారు. ఏదో తంటాలు పడుతున్నారనుకో పాపం. ఈ గది కుర్రాడు భలేవాడులే." మళ్ళీ నవ్వులో పడ్డాడు.

"ఆ నవ్వేమిటి? ఆ ఇదేమిటి? ఏమిటి భలేవాడు? భలేవాడు ఏలే!" వేదమూర్తికి కోపం కూడా వచ్చింది.

"నేను చెప్పలేనండి. అయ్య బాబోయి! ఓరి, వీడి నుంప తెగ?" మళ్ళీ మెలికలు తిరిగిపోతున్నాడు శ్రీబాబు. నవ్వుకట్టలు తెంచుకువస్తోంది శ్రీబాబుకు.

"నువ్వు చెప్పకు నాయనా! ఏక హైరాన పడిపోతున్నావ్." తన నవ్వులో వేదమూర్తికి నరకం చూపిస్తున్నాడు శ్రీబాబు.

"అదికాదు మరీ! మీరు చెప్పగలరేవిటి? ఆపకంగా..." మళ్ళీ నవ్వుతూనే..."ఆ కుర్రాడు సైకిలు నేర్పే పద్ధతి చెప్పాడు శర్మగారికి."

"ఏమిటా పద్ధతి?"

"ఎక్కడా నవ్వడు చూడు. భలే చమత్కారాలు నేర్చినవాడు. ఓరి వీడి తెలివి ఇదిగాను. అతిగాడంటాడూ, సైకిలుతొక్కడం పెద్ద కష్టం గాదు. అది శారీరకం. ముందు బాలెన్సు నేర్వాలి. అందులోనే ఉంది అంతా! అది మొదలుపెట్టం డన్నాడు. శర్మగారికి నచ్చింది."

"నచ్చడం కాదు. ఎందుకూ..." అంటూ ఏదో చెప్పబోయారు శర్మగారు.

"సర్లెండి. చెప్పు;" వేదమూర్తి ఉత్సాహం చెప్పనలవి కాదు.

"ఏమన్నా డనుకున్నావ్. కిష్టుణ్ని వెనక సీటుమీద కూర్చొని హేండిల్ బార్ పుచ్చుకోమన్నాడు. శర్మగార్ని సీటుమీద మామూలుగా కూర్చొని తొక్కమన్నాడు. ఆగ్నేయశర్మగారి దిప్పుడు శారీరక పరిశ్రమ. దానికి నేర్పు అవసరంలేదు. కిష్టుడిది మొదటు నేర్పులో కూడుకొన్నది."

"ఆ! ఆ!" ఏం జరుగుతుందో ఊహించుకోగలిగాడు వేదమూర్తి.

"సైకిలుతో సహా పాలయ్యగారి పెద్దరాతి గోతిలో ఉన్నారు మరునిముషంలో. పాపం మాటలెందుకు? ఆ అబ్బాయే వాళ్లని పైకి తీసుకువచ్చాడు."

వేదమూర్తి పకపకమంటూ నవ్వాడు. ఆ నవ్వులలో ఆగ్నేయశర్మగారు ఇరుక్కుపోయి గదికుర్రాడిమీద తగని కోపం వచ్చింది.

ఇంతలో గదికుర్రాడు వచ్చాడు. వేదమూర్తి అతణ్ణి పరీక్షించాడు. ఆగ్నేయశర్మ చురచుర చూసారు. శ్రీబాబు సన్నగా, ఉత్సాహపూర్వకమైన చూపులను ప్రసరించాడు ఆ అబ్బాయిమీద. వీలుంటే శ్రీబాబు, ఆ అబ్బాయిని తన కౌగిలిలోకి తీసుకొని తల నిమురాలని కూడా వుంది—"ఇంత


## అమృతసంజీవినీ మాత్రలు

గర్భిణులు ప్రసవించువరకు సేవించిన సుఖప్రసవము, ఆరోగ్యసంతానము కలుగును. వేవిళ్లు, నిస్త్రాణ, పాలిపోవుట నివారించి ఉత్సాహము, నరముల పటుత్వము కలుగజేయును. వెలకు రు 3.

## ఉదరాంతకి

చంటిబిడ్డల లివర్ స్ప్లీన్ వ్యాధులు సమస్త ఆశాసలు నివారించును. అజీర్ణము, కడుపుబ్బరము, ముక్కుచు విరేచనముట నివారించి, బలము, రక్తవృద్ధి కలిగించును. వెలకు రు 2.

## బాలా జీర్ణవటి

8 సం॥లు దాటిన పిల్లలకు తరచు కలుగు అజీర్ణము, కడుపుబ్బరము, నీళ్ళ విరేచనములు తెల్లగా పాలిపోవుట, క్రమముగా కృశించుట మాంచి రక్తవృద్ధి, బలము కలిగించును. వెలకు రు 1.

## శతమూలికాది లేహ్యము

ఇది సుఖ మేహ వ్యాధులు, ఎరుపు, తెలుపుమచ్చలు, బగ్గలుమాన్పి రక్తము వృద్ధిపరచి బలము, నరముల పటుత్వము కలిగించును. స్త్రీలబుతుబాధలు, అమితనొప్పి నివారించి తప్పక సంతానము కలుగజేయును. లోహ క్షకసింధూరముతో రు. 40 రు 18.

## శ్రీ భుజంగరాయ వైద్యశాల,

తాళ్ళరేవు, తూర్పుగోదావరి.

# ★ గది అబ్బాయి ★

తెలివి ఎలావచ్చింది బాబూ నీకు!" అంటూ.

"ఇదుగో చూడు అబ్బీకు!" అన్నారు అగ్నేయశర్మ.

కుర్రాడు ఠీవిగా మెట్లెక్కి వీధి అరుగు మీదున్న గదివైపు పోబోతూన్నవాడల్లా ఆగి వెనక్కి తిరిగాడు. వేదమూర్తి, శ్రీబాబును చూస్తూ—

"ఏమిటీ ఈపచ్చీసు?" అని ఖంగు మన్నాడు. అవతల అరుగుమీదున్న శ్రీ బాబు

"బాబుగారు ముద్దుగా అలానే పిలుస్తారు," తిరిగిన వ్వాడు శ్రీ బాబు. గది కుర్రాడికి అర్థం అయ్యింది. అగ్నేయశర్మ తనమీద దండయాత్రకు సరిహద్దులో సైనిక స్థావరాలను ఏర్పాటు చేశాడని క్షణం ఆలోచించి కళ్ళు చిట్లించి "ఆ!" అన్నాడు.

"నువ్వు ఈరోజునే గది ఖాళీచేయాలి" అని త్రుంచి అన్నాడు అగ్నేయశర్మ.

"ఖాళీ చేస్తాను అన్నది నిజం. ఏరోజు అనేది చెప్పలేను." శ్రీ బాబు అభిమానంగా ~~~ ఆ అబ్బాయిని "సెభాష్!" అన్నట్లు.

"ఈరోజే! పిల్లడు

"అంటే?"

పాకం ముదిరింది. శ్రీ బాబుకు ఇది పట్టయిన పీసు. వేద మూర్తి కలుగచేసుకొని—"అలా అంటే ఎలా? మనకి మర్యాదగా ఇల్లిచ్చినపుడు, మనల్ని వారు అడిగినపుడు మనం మర్యాదను పాటించడం ధర్మం" వేద మూర్తి శ్రీ బాబు వైపు చూసాడు "ఎలా చెప్పాను?" అన్నట్లు. శ్రీ బాబు అబ్బాయివైపు చూసాడు "దీనికి నీ సమాధానం?" అన్నట్లు. ఆ అబ్బాయి ఒక్కమాటు అగ్నేయ శర్మను చూసి వెంటనే వేదమూర్తి నుద్దేశించి... "చూడండీ! మర్యాద గురించి కొద్దో, గొప్పో, నాకూ తెలును, అదే తిరిగి అంటున్నాను. వెళ్ళమనడంలో కూడా మర్యాద చూపించవలసిన అవసరం మీకూ ఉంది, నానుండి మీకు మర్యాద కావలసినపుడు." శ్రీ బాబు వెంటనే చూపుడు వేలుతో తన తొడపై గట్టిగా కొట్టుకొన్నాడు 'అదీ సంగతీ' అన్నట్టు! ఇలాంటి బిగువైన సన్నివేశాలు అరుదుగా వస్తాయి. అప్పుడే ముగింపు తెగింపుతో తెగకుండుగాక! అని కూడా అనుకొన్నాను శ్రీ బాబు.

శ్రీ బాబు కలుగచేసుకొని ... "వారు పెద్దలు" అన్నాడు ఆ అబ్బాయితో.

"మేము పిన్నలం కదండీ" ఈమాటలు అంటూ కళ్ళు చిట్లించాడు. శ్రీ బాబుకు పచ్చి వెలక్కాయ కంఠాన పడ్డది. మరొకరు ఇలా చెప్పతున్నట్లు వెక్కిరింపుగా అని ఉంటే, కోపించలేకపోయినా సహించి ఉండేవాడు కాదే మో! గది అబ్బాయి పూర్తిగా నచ్చాడు తనకు. ఎందుకు...? ఎదురింటి శర్మగారికి ఒక 'సమస్య' కావడమే. రోడ్డుమీద అరటిపండు తొక్కమీద కాలు అప్రయత్నంగా వేసి జారిపడిన అమ్మాయికి వచ్చినంతపని! చూచిన పదిమందికీ, కడుపుబ్బ నవ్వు పుట్టించే సమయమది. శ్రీ బాబు ఊదాడు నిపురుని!

"అది కాదు పంతులూ, వారు మనకి గది ఇచ్చారు."

మేము గది పుచ్చుకొన్నాంఅని ఉండవలసిందసలు. అలా అనక

"ఊc! అయితే?" అన్నట్లుచూసాడుగది కుర్రాడు.

"నువ్వు అట్లా అంటే మేము ఏమి చెపుతాం?" అన్నాడు శ్రీ బాబు తమకి చెప్పవలసిందింకేం లేదన్నట్లు. శ్రీ బాబుకు, ఆగది కుర్రాడు అలాగే, ఆ ధోరణిలోనే ఉండాలి. పైకి శర్మగారిపక్షం!

అగ్నేయశర్మగారికి పరిస్థితిని ఓపికతో ఎదుర్కొనే సహనం నశించింది. ఆయన ఏదో అనడానికి అన్నట్టుగా....."ఎందుకూ!" అని సాగదీశారు. ఆయన, పెద్ద... పంచె ఎగగట్టి కుర్రవెధవమీదకి దుముకుతాడన్నట్లు, అంతవరకు వ్యవహారం పోవడం లేదన్నట్లు, వేదమూర్తి కూర్చున్నవాడల్లా లేచినుంచొని "ఏమండోయి... అతగాడికి లేకపోతే మీకులేదా ఏమిటి? మీ రూరుకోండి" అని కసిరిపారేసాడు శర్మగార్ని. శ్రీ బాబు, చంటికుర్రాడు బొబ్బోసుకొని అన్నం తింటున్నట్లు పెట్టాడు మొహం సరదాగా!

అగ్నేయశర్మగార్ని ఊరుకోమనడమే ప్రోత్సాహం ఇవ్వటం. అందుకే ఆయన కోపంగా అన్నారు. "ఊరుకోవడంకాదు. ఎందుకూ" అని ఇంకా ఏదో చెప్పబోతుంటే శ్రీ బాబు శర్మగారి మాటలకు అడ్డువచ్చి.

"అవన్నీ ఎందుకుగాని.....సామరస్యంగానే పరిష్కరిద్దాం." అని గది అబ్బాయి వైపు తిరిగి..."చూడుపంతులూ!"

"ఏం" అన్నట్లు చూసాడు. 'ఓరి వీడిల్లు బంగారంకాను!' మాట్లాడితే కరవబోతున్నాడు అని సంతోషంగా శ్రీబాబు అనుకొని ఊరుకొన్నాడు.

వేదమూర్తి..."చూడు పంతులూ! విషయం తెలిసింది. నీవు ఖాళీచేస్తానంటున్నావు. అవునామరి. అది సబబే!"

"అయితే ఏది సబబుకాదు?" అగ్నేయ శర్మగార్ని చూస్తూ తార్కికంగా ప్రశ్నించాడు. అగ్నేయశర్మగారు వేదమూర్తివైపు "చూడు వీడి వరస" అన్నట్లు చూసాడు. వేదమూర్తి, 'వీడితో, భోనులో ఎక్కి మాట్లాడినట్లు మాట్లాడవలసి వస్తూంది' అనుకొన్నాడు. శ్రీ బాబు ఇహిహీ అన్నాడు.

అగ్నేయశర్మగారు తట్టుకొని... "మరి కాదా సబబుకాకపోత?" వేదమూర్తి ముద్దేశించి అన్నాడు.

వేదమూర్తి యాదాలాపంగా పెట్టిన ముడి చిక్కుముడిఅయి ఊరుకొంది. దాన్ని విప్పలేక..."అది కాదండీ..,ఇదుగో చూడు అబ్బి! నువ్వు ఖాళీచేస్తా నంటున్నావు."

"ఎప్పటినుంచి?" అగ్నేయ శర్మగారు ఉడికిపోతూ అన్నాడు.

"మీరు ఖాళీ చెయ్యమన్నప్పటినుంచి." తాపీగా అన్నాడు అబ్బాయి.

చంపావు ఫో అని మనసులో అభినందించుకొని మళ్ళీ తొడ చరుచుకున్నాడు శ్రీ బాబు. తాను ఏం మాట్లాడాలన్నట్లు.

"శర్మగార్ని అలా ఇబ్బంది పెట్టడం..." అని నసిగి వెంటనే గబగబ "మంచిదికాదు." అనేస్తూ అగ్నేయశర్మగార్ని చూసాడు.

అగ్నేయశర్మగారు "నాకు అవి అన్నీ పనికిరావు." అని ఇంకా ఏదో అనబోతుండగానే వేదమూర్తి కలుగచేసుకొని...

"ఆయనతో ఏంగాని..." అన్నాడో లేదో...వెంటనే తార్కిక పరిజ్ఞానం గలిగిన తార్కికుడులా అడ్డొచ్చి...

"మరి మీతోనా?"

శ్రీ బాబు ఫక్కుమన్నాడు. వేదమూర్తి పేలవమయిన నవ్వు నవ్వాడు. అగ్నేయశర్మగారు ఉడుకుబోతుతనంతో కుమిలిపోతున్నాడు.

వేదమూర్తి, ఆ గది కుర్రాడిస్తున్న 'చేదు మాత్రల్ని' ఎలాగో మింగుతూ, తిరిగి కలగచేసుకున్నాడు.

"నీవు అనే మాటలు మరీ చిన్న పిల్లాడు మాట్లాడుతున్నట్లున్నాయి. గది యెప్పుడు ఖాళీ చేయగలవో చెప్పమంటున్నాను."

"గది దొరకాలా!" అన్నాడు గది కుర్రాడు.

"అంతవరకూ నీ లుంఛ దన్న మాట! ఎందుకూ..." అని ఉరిమి అన్నాడు అగ్నేయశర్మగారు.

"మీ రూరుకోండి" అని శ్రీ బాబు అన్నాడు. వేదమూర్తి వెంటనే...

"అవునా మరి. కాస్త వీలైనంత తొందర్లో చూడు. ఒక వారం సరిపోతుందనుకుంటాను." ఈ సారి కుర్రాణ్ణి అడగలేదు.

(47-వ పేజీ చూడండి)

# ★ పెళ్ళిచేసుకుని చూడు ★

(24-వ పేజీ తరువాయి)

యండి...

కమ: అంతా అయిపోయినట్లే గదమ్మా.

సర: పిల్లవాడు వచ్చుటం ఒకటి మిగిలి పోయింది గదండీ.

పద్మ: అది ఒకటేమిటి......సంగీతం రాదుట...పిల్లల్ని ఆడించటంగూడా చేత గాదుట......

కమ: అంటూనే మర్చిపోయాను...మీ అబ్బాయికి వంటవండటం చేతనవునాండీ...

సర: ఆహా...భీమపాకంలెండి ... మీరు ఆ చేత్తో రెండుపూటల తిన్నారంటే...ఆ వారం చివరిదాకా మళ్ళీ అన్నంమీద ఆశ కలగదు......

కమ: నేను సీరియస్‌గా అడుగుతుంటే మీరు ఎగతాళి పట్టించటం ఏమీ బాగా లేదు...మాఅమ్మాయికి విసుగ్గావుంటుంది... ఇంట్లో మగవాడికి వంటచెయ్యటం చేత కాకపోతే ఎట్లాగండీ...

పార్వ: కోపం తెచ్చుకోకండి...ఇప్పటి కయితేరాదుగాని...నేర్చుకుంటాడులెండి. అదెంత విద్య...

కమ: అదెంతేమిటి...అదే ముఖ్యం మా అమ్మాయికి ఒకపూట కొంచెం బద్ధకంగా వుంటుంది...ఇంత వార్చిపెట్టటం గూడా చేతకానివాణ్ణి చేసుకోవటం ఏం యిదండీ..

సర: ఇప్పుడయినా కొద్దిగా చేతవులెండి. మీచేతికిందకి చేరింతర్వాత అన్నీ చేతనవు తాయి...

పద్మ: అసలు అన్నిటికంటె ముఖ్య మయిన విషయం మరిచిపోయానమ్మా... కథలు సంగతి...

కమ: అవున్లే...మీ అబ్బాయికి కథలు రాయటం చేతనవుతుందాండీ?

సర: కథలా...ఏం కథలూ...

కమ: పిటకథలుగావు...అసలు కథాని కలు,నాటికలు అవీ రాయటంచేతనవునాఅని.

పార్వ: ఏమ్ అమ్మాయి ... కథలు రాస్తాదుటే—

సర: అంత బాగారాయలేడండీ...

పద్మ: ఏమన్నా కొన్నికథలకు అచ్చు మీదఎక్కే వాహనయోగం పట్టిందా..అని.

సర: అచ్చే ఎక్కడండీ...వాహనం దాకా వెళ్లినతర్వాత అక్కడినుంచి దారి తప్పి చెత్తబుట్టలో యిరుక్కుపోయాయి...

పద్మ: అదేం బాగాలేదు...

కమ: అవును బాగాలేదు...మాఅమ్మాయికి కథలురాయటమంటే ప్రాణంఅన్నమాట...

సర: నాకు తెలియదే...మీరు రాసినవి ఒకసారి చూపించండి...

పద్మ: నాదగ్గరేంలేవు...అన్నీ పేపర్ల వాళ్ళ దగ్గరే వున్నాయి...నాకు పంపిం చరూ...అచ్చులో చూపించరూ...అదే గదా గొడవ...

కమ: అందుకనే కథలు అచ్చువేయించు కోగల కథకుడయితే మా అమ్మాయి పేరుపెట్టి గూడా కథలు రాయించుకోవచ్చు అని మా అమ్మాయి సంబరం...

సర: బాగానేవుంది...

పద్మ: బాగా వుండటం ఏమిటి...మాకు ఒక్కటీ కుదరకపోయిన తర్వాత...

సర: మీకివన్నీ కుదిరేటప్పటికి బ్రహ్మకి మతిపోతుంది...

పార్వ: ఊరుకో సరళా... వెటకారంగా మాట్లాడుతే ఏంబాగుంటుంది చెప్పు...

సర: వెటకారం ఏమిటి....మా అన్నయ్య ఎందుకూ పనికిరానివాడు... చవటాఅని... ముక్కు ముఖం తెలియకుండా వచ్చిడబాయి స్తుంటే... యిందాకటినుంచి వూరుకున్నా గాని...

పార్వ: ఆ...ఆ...ఆవేశ పడకు...

సర: నీమాటలే వన్నింతవరకూ తెచ్చి నాయి...ఎన్ని వరాలో చూడు...హిరణ్యా క్షుడుగూడా ఎందుకూ పనికిరాకుండా వున్నాడు...

కమ: మాకొక్కవాలసినవి అడిగాం... తప్పేమిటండీ...

సర: తప్పేమీ లేదు...వూరికేడబాయించ మంటే...సంగీతం చేత కావాలన్నారా...

పద్మ: అవునూ...అన్నాను...యిప్పుడు మటుకు కాదన్నానేమిటి

పార్వ: తొందరపడకు సరళా...

సర: నువ్వూరుకో పిన్నీ...నీకసలేం తెలియదు...హిందీ రావాలన్నారా... పిల్లల్ని ఆడించటం చేత కావాలన్నారా...

కమ: వాటిలో ఒక్కమాట కూడా పొల్లు పోకుండా యిప్పుడూ అమాటే అంటున్నాం...

సర: అంతటితో ఏమయిందని...వంట వండటం చేతకావాలిట'... కథకుడై వుండాలిట...

పద్మ: మాకొక్కవాలసినవి కోరుకున్నాం ...మీకిష్టమయితే నే...దీనిలో తగాదాకే పనేముంది...?

సర: తగాదాలేం లేవు తల్లుల్లారా... తగాదాలేం లేవు...నా సలహా ఒకటి బ్రహ్మాండమైనది చెపుతా వింటారా...

పార్వ: ఏమిటే గడుగ్గా యితనంగా వుంది...

సర: గడుగ్గా యితనంలేదు...అఘాంద్రా యితనం లేదు...నామాట వినండి...

కమ: చెప్పండి...విందాము నేగా...

సర: ఫస్టు...అంటె మొట్టమొదట... హుండేలురావు అని మా హిందీ మేష్టరున్నాడు...ఆయనకు వచ్చినన్ని హిందీలో మాటలు...అసలు డిక్షనరీలలోనే లేవు...

పద్మ: నిజంగా

సర: రెండో ఆయన ... మా సంగీతం మేష్టారు...హనుమచ్ఛాస్త్రిగారు...ఆయన రాగం ఆలాపిస్తుంటే ... ఆనాడు హను మంతుడుపాడగా రాళ్ళు కరిగిపోయినట్లు... వినేవాళ్ళతలలు తిరిగిపోతాయి...

కమ: చాలా ఆశ్చర్యంగావుందే...

సర: తర్వాత ... మా వంటలవాడు ... వాడు నలుడికీ, భీముడికీ పూర్వజన్మలలో వంటలుచేయటం నేర్పినవాడట ... పేరు నలభీమ్ ... సరే, పిల్లల్ని ఆడించటానికి అంటారూ...మా దూరబంధువు శిశుమూర్తి అనీ...

పద్మ: వీళ్ళందరికీ యిప్పటి విషయానికి సంబంధం ఏమిటో నాకేమీ అర్థం కావటం లేదు...

సర: ఆభాగ్యత నేను తీసుకుంటాగదాండీ ... కథలు రాసే ఫ్రెండువున్నాడు...వాడి పేరు వినటానికి కొంచెం వికారంగా వుం టుంది లెండి...అందుకని 'పులి శ్రీ' అని పేరు పెట్టుకుని వ్రాస్తాడు...ఇప్పుడు మీకు అయిదుగురిని పరిచయం చేశాగదూ...

కమ: అవునూ...

సర: అవునూ...ఏమిటండీ...ఈ అయి దుగుర్నీ పెళ్ళి చేసుకుంటే అనుకున్నవి అన్నీ లభిస్తాయి...కావలసివస్తే 'కలియుగ ద్రౌపది...' అని బిరుదుగూడా తగిలించుకో వచ్చు...

పద్మ: మీరు చాలా మితిమీరి మాట్లాడు తున్నారు...

సర: నేనేం మితిమీరటంలేదు... మీరే నామనసులో వున్న నిజమైన మాటనుబయట పెట్టేటట్లు చేశారు...మర్చిపోయాను మీకు డబ్బుగూడా కావాలికదూ ... ఏదన్నా ఒక బ్యాంకునుగూడా పెళ్ళి చేసుకోండి... కట్నంగూడా దొరికినట్లవుతుంది...

కమ: ఇంత మర్యాదలేకుండా ప్రవర్తి స్తారనుకోలేదు...

సర: మీమీద మీరే విసుక్కుంటున్నారు ...మీ అమర్యాద మిమ్మల్నే వెంటాడు తోంది...

పార్వ: సరళా...!? నా ఇంట్లో ఏమిటీ రగడ ... బయట అబ్బాయి ఏమనుకుం టాడు...


## నారసింహ లేహ్యము

NARASIMHA LEHYAM

బంగారుతో చేరినది. మేహము, నిస్త్రాణ, విస్మృతివ వగైరా హరించి బలము రక్తవృద్ధి కల్గించును. 20 రు. డబ్బీ రు. 3-4-0. పోస్టేజి రు. 1-1-0.

వి. పి. ఏ. అండ్ కంపెనీ ఆయుర్వేద సమాజం, పెరిదేపి (PO) నెల్లూరుజిల్లా.

# కొల్గేట్ క్లోరోఫిల్*
# చిగుళ్లను గట్టిపరుస్తుందని
## వైద్యపరీక్షలో రుజువైంది!



**చిగుళ్లను బలపరుస్తుంది!** కొల్గేట్ క్లోరోఫిల్ టూత్ పేస్ట్‌తో రోజూ పళ్లను క్రమంతప్పకుండా తోముకుంటే చిగుళ్లు గట్టిపడడానికి అవసరమైన జీవకణాలు పెరుగగలవు.

**దుర్గంధాన్ని వెంటనే, గట్టిగా నిర్మూలిస్తుంది!** ఇతర మామూలు టూత్ పేస్ట్‌లకంటే కొల్గేట్ క్లోరోఫిల్ టూత్ పేస్ట్ దుర్గంధాన్ని గట్టిగా నిర్మూలించగలదని ఇటీవల జరిగిన పరీక్షలో రుజువైంది.

**దంతక్షయాన్ని నివారిస్తుంది!** భుజించగానే కొల్గేట్ క్లోరోఫిల్ టూత్ పేస్ట్‌తో పళ్లు తోముకుంటే పళ్ల మెరుగును హరించే ఆమ్లాలను తగ్గించి, తద్వారా దంతక్షయాన్ని నివారించగలదు!

**ఇంతకు మించి సచేతనమైన క్లోరోఫిల్ కలిగివున్న మరొక టూత్‌పేస్ట్ లేదు**




• నీటిలో కరిగే క్లోరోఫిలిన్స్ గలవు.

**ఇప్పుడు!** ఆదాయకరమైన పెద్దసైజులో దొరుకుతుంది


## పెళ్లి చేసుకుని చూడు

పర : ఏమీ అనుకోడు... ఇందాక నే ఈ మాటలన్నీ వినలేక వెళిపోయి వుంటాడు...

పార్వ: అంతగా మాట్లాడటం బాగాలేదే...

పర : ఏం బాగాలేదు పిన్నీ? ఏమండి పద్మ గారూ... మీరు ఏ హుందా, తాహతు చూసుకుని యిన్ని కోరుకుంటున్నారండీ ... డాన్సు చేస్తారుట ... అదికూడా శిక్షణగా నేర్చుకున్నది గాకుండా ... బి. ఏ. పాసు కావటానికి కొన్ని సంవత్సరాలు పట్టిందట... మీలో ఏం గొప్ప లక్షణాలను చూసి మీ భర్తను వూహిస్తున్నారండీ...

కమ : పోదాం పదవే ... పొరపాటైంది రావటం ... ఇటువంటి మనుష్యులని తెలియక...

పర : రావటంలో ఏం పొరపాటు లేదు ...నోరు మంచిది కాక పోవటం వలన వచ్చింది...

పద్మ : (సంచీలోనుంచి కాగితం తీసి) అమ్మా...

కమ: ఏమిటే తల్లీ మళ్ళీ ఏం తెచ్చి పెట్టావు అయిన అవమానం చాలక...

పద్మ: ఏం లేదు... పేపరులో వేయించిన కాగితంముక్క యిక్కడే పారేసిపోదామని

కమ: దాకియ్యి చెపుతాను. ఒకసారి బిగ్గరగా చదువు... వింటారు.

పద్మ: (కాగితంలోకి చూస్తూ) అమ్మా... దీంట్లో పేరు గోపాలరావు కాదమ్మా.

కమ: ఎవరమ్మా మరి...

పద్మ: గోకులానందరావుట.

కమ: అరి భగవంతుడా... క్షమించండమ్మా క్షమించండి... పొరపాటున మీ కొంపలో అడుగు పెట్టాం.

పద్మ: అనుభవించాం... వస్తాం మరి...

పర: మీబాబూజు పటేన అభిప్రాయాలు మారినతర్వాత రండి... గోకులానంద రావు గారి దగ్గరకయినా అప్పుడే పోవచ్చు...

పద్మ: ఆవిషయంలో మీ సలహాలేం అక్కర్లేదు... రావే అమ్మా... ఇంకా ఏమిటి చూస్తావు.

కమ: పెద్దలందరికీ నమస్కారాలు... ఇన్ని సలహాలు చాలుతల్లీ చాలు...

పర: అవ్వే అందుకోసం కాదు... మీరు తప్పయింటికి వచ్చినట్టే తప్పుకాలంలో కూడా వచ్చారు. ఇక్కడికి మీరు రెండేళ్ళ కిందటనో, తర్వాతనో రావాలిసింది... రోజులు తిరుగుతున్నాయి. యిది యిరవైయో శతాబ్దం.

కమ, పద్మ: సెలవు...

పర: (చేతులు బాగా పైకెత్తి) సంతోషం... ఏం పిన్నీ బాగుందా...

పార్వ: బాగుండటమేమిటి... బ్రహ్మాండంగావుంటే... అయినా నాకు కోడలువచ్చే ఆ ముహూర్తం బాగా ఏర్పడొద్దూ...

[తెర]

# వనితా లోకం

## ★ పతిత స్త్రీజనోద్ధరణం ★

జనవరి 5-వ తేదీన కేంద్ర సాంఘిక సంక్షేమ సమితి అధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ హైదరాబాదులో ఒక 'రక్షణాలయానికి' ప్రారంభోత్సవము చేస్తున్నారు. 'అమీర్ పేట' అని హైదరాబాదుకి ఏడు మైళ్ళదూరంలో ఉన్న పేటలో ఒక పెద్ద భవంతిలో దీన్ని ఏర్పరుస్తున్నారు. నైతికంగా భ్రష్టులై, సంఘం దృష్టిలో నీచమైపోయిన పతిత స్త్రీలకు, తాత్కాలిక ఆవేశాలతో కానీ ప్రలోభాలతో కానీ నేరాలుచేసిన స్త్రీలకు కొన్ని విపరీత శక్తులవలన తమ శీలానికి భంగం వాటిల్లగా లోకాన్ని చూడడానికే భయపడే స్త్రీలకు, ఏవిధమైన ఆధారములేని అనాథ స్త్రీలకు ఇంతమందికి 'రక్షణ' యీ రక్షణాలయం కల్పిస్తుంది.

రక్షణ కల్పించడమే కాక, ఆ స్త్రీల 'పునరావాసానికి' కూడా ఇది మార్గం ఏర్పరుస్తుంది. వారుకూడా ఒక గౌరవప్రదమైన జీవనోపాధి ఏర్పరచుకోడానికి, గత చరిత్రలోని అవినీతిఘట్టాలను మర్చిపోయి, సంఘంలో కలిసిపోవడానికి అవకాశం కల్పిస్తుంది. ఈ కార్యక్రమము కేంద్ర సాంఘిక సంక్షేమ సమితివారు 'అనంతర రక్షణ—పునరావాస—పునరుద్ధరణ కార్యక్రమాలు' అనే పేరుతో సమగ్రపథకాలను సమర్పించి వున్నారు. ఈ సమితి నియమించిన ఒక ప్రత్యేక విచారణ సంఘం ఈ సమస్యలపై ఒక నివేదిక తయారుచేసింది. ఈ సమస్య సమగ్రరూపం, స్త్రీలు ఈస్థితిలో జీవనము గడపడానికి కారణం, కొందరు స్త్రీల నైతిక పతనానికి దారితీసే పరిస్థితులు, వాటివల్ల ఏర్పడే ఫలితాలు, తన్నివారణోపాయాలు మొదలైనవి ఈ నివేదికలో పొందుపరిచారు. కేంద్ర రాష్ట్రప్రభుత్వాలుకలిసి నిర్వహించబోయే ఈ కార్యక్రమాన్ని తయారుచేసేది కేంద్ర సాంఘిక సంక్షేమ సమితి. రాష్ట్రాలలో స్థాపిస్తున్న 'రక్షణ కేంద్రాలకు' సంబంధించిన నిర్మాణాత్మకమైన కార్యకలాపాన్ని సూచించేది రాష్ట్రసంక్షేమ సలహాసంఘం.

వ్యభిచార నిర్మూలనం మన ముఖ్య సాంఘిక సమస్యల్లో ఒకటి. దీనివలన వేల కొలది స్త్రీల జీవితాలు నాశనంకావడం, మరికొన్ని వేల గృహిణుల జీవితాలు దుర్భరంకావడం, కుటుంబాలు విచ్ఛిన్నంకావడం యాదృచ్ఛికంగా జన్మించిన ఆ సంతతి భ్రష్టమైపోవడం, ప్రజారోగ్యభంగం జరుగుతున్నది. పెద్ద పట్నాల్లో, చిన్న పల్లెల్లో ఈ వృత్తి ఎలా ప్రబలుతున్నదీ దీనికి కారణాలు, దేశంలోని ఒక్కొక్క-



శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ హైదరాబాద్‌లో ప్రారంభోత్సవం జరుపుతున్న భవనం

## ★ పతితస్త్రీ జనోద్ధరణం ★

ప్రాంతంలో ఈ సమస్యరూపం మొదలైన విషయాలన్నిటినీ నివేదిక చర్చించింది. వివిధ వ్యక్తులను, సంఘాలను, ఉద్యోగులను కలిసికొని, ఎన్నో పల్లెలు, పట్నాలు చూచి, అనేక ప్రశ్నావళుల ద్వారా వివరాలు సేకరించి తయారుచేసిన నివేదిక ఇది.

ఈ పథకం ఆధారంగా భారత దేశం మొత్తంమీద 28 'రాష్ట్రకేంద్రాలు, (స్టేట్ హోమ్సు) 86 జిల్లా రక్షణాలయాలు (డిస్ట్రిక్టు షెల్టర్సు) మంజూరు అయినవి. మన ఆంధ్ర ప్రదేశ్‌లో 5 రాష్ట్రకేంద్రాలను, జిల్లాకొకటి చొప్పున 20 జిల్లా రక్షణాలయాలను ప్రారంభించవలసివున్నది. వీటిలో రాజమండ్రిలోని స్త్రీల పునరావాస కేంద్రం శ్రీ వీరేశలింగం పంతులుగారి ఆనందోద్యానవనంలో శ్రీ హితకారిణీ సమాజంలో మొన్న అక్టోబరు నెలలో ఏర్పడింది. ప్రస్తుతం ఈ కేంద్రములోని స్త్రీలకు సాధారణ విద్య, చేతిపనులు, క్రమశిక్షణ మొదలైనవి నేర్పుతున్నారు. అచ్చటి శిక్షితుల సంఖ్య ప్రస్తుతం 16. స్వచ్ఛంద సాంఘిక సేవాసంస్థలు యీ కార్యక్రమముల కనుగుణమైన కృషి చేస్తూ వున్నట్లైతే, ఆ సంస్థలనే ప్రభుత్వం స్వాధీనంచేసుకుని అక్కడే ఈ రక్షణాలయాలను స్థాపించడంకూడా జరుగుతుంది.

మన రాష్ట్రంలోని రక్షణాలయాల వివరాలివి :

(1) రాజమండ్రి-అనాథ శరణాలయముల నుండి ఇతర సంస్థలనుండి విడుదలైవచ్చిన స్త్రీలకు పునరావాసం కల్పించే కేంద్రం. (2) గుంటూరు : పురుషులకు; (3) కర్నూలు: జైళ్ళనుండి, సర్టిఫైడ్ పాఠశాలలనుండి విడుదలై వచ్చిన స్త్రీల పునరావాసానికి, (4) సికిందరాబాదు: పురుషులకు; (5) హైదరాబాదు: 'స్త్రీ' రక్షణాలయము.

వీనిలో ఒక్కొక్కదానిలో 100 మందికి వసతి కల్పించబడుతుంది. జిల్లా ముఖ్య పట్టణాలలో, జిల్లాకొకటి చొప్పున ఏర్పడే రక్ష



టి. సహృదయ—(చిక్కడపల్లి, హైదరాబాద్)

శాలయాల్లో కొన్ని స్త్రీలను, కొన్ని పురుషులను చేర్చుకుంటారు. వీటిలో 25 మందికి వసతి ఏర్పరుస్తారు. ఇది కేవలం తాత్కాలిక వాసానికి మాత్రమే. వివిధ ప్రాంతాలనుంచి ఇక్కడికి 'రక్షణ' అవసరమైన స్త్రీలను, పురుషులను చేర్చి యిక్కడనుండి రాష్ట్ర కేంద్రాలకు పంపిస్తారు.

అవినీతి ఆ నేటి పట్నాల్లోనే కాదు- పల్లెల్లో మారుమూల ప్రదేశాల్లో కూడా వుంది. నైతికంగా పతితలైన స్త్రీలు, విపరీత పరిస్థితుల వలన శీలాన్ని కోల్పోయే ప్రమాదంలో వున్న స్త్రీలు; చిన్న వయస్సులో వుండి నైతిక పతనానికి దారిచే వితంతువులు; దుర్భరమైన సంసారాలుచేసే స్త్రీలు, ఆర్థిక సాంఘిక కారణాలవల్ల, కలుషిత కుటుంబాలవల్ల వ్యభిచారానికి పూనుకున్న స్త్రీలు-వీరంతా దిన దినగండంగా జీవించవలసినదేనా? వీరికి తగిన రక్షణ ఏది? వీరు నిరాశతో కృంగిపోయి, జీవించడమే నేరంగాతోచి ఆత్మహత్యలు చేసుకోవచ్చు; లేదా తాత్కాలికమైన ఆనందాల కోసం, డబ్బు సంపాదించడమే పరమావధిగా పెట్టుకుని అదే జీవనాన్ని స్వీకరించ చేసుకోవచ్చు. వీరి సంతానం ఏమౌతుంది? ఈ విధంగా వీరిసంఖ్య పెరిగిపోదా? వారి పునరుద్ధరణ దుస్సాధ్యమౌతుంది. కొంత కాలానికి ఒక జీవితానికి చిరకాలం, అలవాటుపడిపోయిన ఆ స్త్రీల జీవనగతిని మార్చడంకూడా దుస్సాధ్యమే. ఈసమస్యలు ఒక జాతికి చెందినవి—సంక్షేమ ప్రభుత్వానికి చెందినవి.

పతిత స్త్రీ జనోద్ధరణ కార్యక్రమం పల్లెలకు కూడా వ్యాపించాలి. దానికి మార్గం ప్రతి పల్లెలో సంఘ పెద్దలతో కూడిన ఒక సంఘము వుంటుంది. ఆసంఘ పెద్దల సూచన మీద జిల్లారక్షణాలయాల్లో యిల్లాంటి స్త్రీలను చేర్చుకోవడం జరుగుతుంది. కొద్ది వ్యవధిలోనే యీ స్త్రీ జీవిత విశేషాలు యథార్థ పరిస్థితులు తెలుసుకొని సాధ్యమైన సందర్భాలలో తగిన హామీలు ఆకుటుంబ



పూలచెండు — మేకల సీతాయమ్మ (పిఠాపురం)

## ★ పతితస్త్రీ జనోద్ధరణం ★

వ్యక్తుల దగ్గర్నుంచి తీసుకొని రక్షణకల్పించి కొందరు స్త్రీలను వారివారి ఇండ్లకు పంపి వేయవచ్చు. మూడుమాసాలవరకు ఇటి స్త్రీలను జిల్లా రక్షణాలయాల్లో ఉంచవచ్చు. అవినీతి, క్రౌర్యం మొదలైన నేరాల క్రింద అరెస్టుఅయిన స్త్రీలు, విచారణ పూర్తి అయ్యేవరకూ రక్షణాలయాల్లో వుంటారు.

ఏ ఆధారములేక, పునరావాసవసతులు అవసరమైవున్న స్త్రీలను మాత్రమే 'రాష్ట్ర కేంద్రాలకు' పంపిస్తారు. ఈ కేంద్రాల్లోనే వీరి నవజీవనానికి నాంది ఏర్పడుతుంది. ఒక క్రమశిక్షణ అలవర్చుకుని సంఘీభావంతో కలసిమెలసి తమ పనులన్నీ చేసుకోవలసి వుంటుంది. కేంద్రాన్ని శుభ్రం చేసుకోవడం, వంట, బట్టలుతకడం, యివన్నీ దైనందిన కార్యక్రమాలు. గ్రూపులుగా నియమిత కార్యక్రమం ప్రకారం యీపనులు చేసుకుంటారు. ఎవరి అర్హతనుబట్టి వారికి విద్య అభిరుచినిబట్టి జీవనోపాధివృత్తులు నేర్పుతారు.

ఈ కేంద్రాలలో రాష్ట్ర పారిశ్రామిక శాఖ అధ్వర్యాన చిన్నతరగతి పరిశ్రమలను కొన్నింటిని సహకార పద్ధతులలో స్థాపించాలనే ఆలోచన వున్నది. పెన్సిళ్లు, రంగు బలపములు, కుట్టు, అల్లికపనులు ఆఫీసుల్లో కావలసిన అట్టలు, కవర్లువగైరా వస్తువులు చేయడం, అప్పడాలుచేయడం మొదలైన పరిశ్రమలను కొద్దిపాటి పెట్టుబడితో ప్రారంభించి తద్వారా కేంద్రాల్లోని స్త్రీలకు స్వతంత్ర ఆర్థిక జీవనానికి అవకాశం కల్పిస్తారు.

ఈ పథకం చాలా ఖర్చుతో కూడిన విషయం. ఈ ఖర్చులో సగపాలు కేంద్రప్రభుత్వం, సగపాలు రాష్ట్రప్రభుత్వం భరిస్తాయి. స్త్రీలకు ఆవాసము కల్పించే కేంద్రాలు (రాజమండ్రి, కర్నూలు, హైదరాబాదులలోనివి) స్త్రీల జిల్లారక్షణాలయాలు, స్త్రీ సంక్షేమశాఖ డైరక్టరు అధీనంలో వుంటాయి. అదేవిధంగా పురుషుల కేంద్రాలు (గుంటూరు, సికింద్రాబాదు), జిల్లారక్షణాలయాలు సాంఘిక సంక్షేమశాఖ డైరక్టరు అధీనంలో వుంటాయి. కానీ వీటన్నిటికీ తగిన కార్యక్రమ సూచనచేసి, కార్యక్రమములను సమన్వయపరచే బాధ్యత రాష్ట్ర సంక్షేమ సలహాసంఘానిదే.

పైనచెప్పిన ఐదు రాష్ట్ర కేంద్రాలకు, ఇరవై జిల్లాకేంద్రాలకు 1957-58 సంవత్సరానికి రూ 5,46,400 కేటాయించారు.

ఈ కేంద్రాల్లో ప్రత్యేక శిక్షణపొందిన ఉద్యోగులు అవసరం. "మేము అవినీతిపరులముకాము. మాకు ఆర్జనకి స్వేచ్ఛవున్నది. మా శీలాన్నిగురించి మీకు ప్రమేయంలేదు. మా నేరాలకు మేము కఠినశిక్షలు అనుభవిస్తాము. మీవల్ల జరిగే ఉపకారం ఎంతవరకో అంతే మీకు ప్రమేయం," అని భావించుకుని వుండేవారు కూడా వుండకపోరు ఈ కేంద్రాల్లో. ఇల్లాంటివారితో సన్నిహితంగా వుండాలి ఉద్యోగులు. ఇదంతో చాలా సహనం, కరుణ, పరిశీలనాశక్తితో కూడినపని. ఇందుకు ప్రత్యేకశిక్షణ చాలా అవసరం.

తప్పులుచేసినవారు, చేస్తున్నవారు అందరూ కేవలం దుర్మార్గులు, అమానుష వ్యక్తులుకారు. ఏవో అనివార్యదుష్టశక్తులకు లోనై, తాత్కాలికోద్రేకాలకు లొంగిపోయి, ప్రబలమైన ఆర్థిక మానసిక పరిస్థితులలో ఇలా ప్రవర్తించి వుండవచ్చు వారు. అందుకని వారు సంఘంలో వెలివేయబడి ఉండనవసరంలేదు. వారిని మన సంఘంలో విలీనం చేసుకుని, గౌరవప్రదమైన జీవనంకల్పించి నైతిక విలువలను కాపాడడం మనవిధి. ఈ ఉత్కృష్టమైన ఆశయాన్ని దృష్టిలోవుంచుకుని ప్రారంభించిన పథకం ఇది. కారాగారవాస శిక్ష పొంది, విడుదలై రాగానే ఏమికావాలి ఈ నేరస్థులు?—ఇది కూడా ప్రభుత్వ బాధ్యతే. వీరి పునరావాసం కూడా ఈ 'అనంతర రక్షణ' కార్యక్రమాల్లో ఒకటి.

—ఒక అభిమాని]


మనోహరమైన కేశములకు
సులభమైన కిటుకు

టాటావారి
సుగంధిత కొబ్బరి
తలనూనె
మరియు
షాంపూ






ది టాటా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

# ★ పిల్లలూ, పెంపకం ★

నండూరి రాజ్యలక్ష్మి

"పిల్లల్ని పెంచడంకన్నా బిచ్చమెత్తటం మెరుగు" అని అన్నది ఒక బుద్ధిమంతురాలు. ఇందులో సత్యమెంతో పిల్లలున్న వారికిగానీ తెలియదు. పెద్దవాళ్ళకి సాధారణంగా తీరికన్నది వుండదు. చివరికి పేరంటానికి వెళ్ళటానికికూడా ఒకోమాటు కుదరదు. తీరా వెడితే చిన్నపిల్లలు ఇరుగుపొరుగు పిల్లలతో తగూలాడతారు. ఆ తగూలు సర్దబోయి, ఒకోమాటు పెద్దవాళ్ళే పోట్లాడుకుంటారు—చిన్నవాళ్ళ సంగతి అలా వుంచగా......

మనమొకసౌధాన్ని నిర్మించడానికిముందు లోతుగా తవ్వాలి. ఆతర్వాత పునాదివేసి గోడలులేపి, ఆకాశాన్నంటే భవనం నిర్మించాలి. ముందు పునాది గట్టిగావుండాలి. పునాది ఎలాంటిదో, పిల్లల బాల్యావస్థ కూడా అంతే. పిల్లలహృదయాలు అతిసున్నితంగా వుంటాయి. ఆ సున్నితమైన హృదయాలపైబడే ముద్రలు వారిని పాతాళంలోకి అణగద్రొక్కనూగలవు. అటు బంగరు సౌధంలో ఊయలలూపనూగలవు. ఆ పసిపాపల తల్లిదండ్రుల పెంపకంవల్ల వారు పూలబాటలోకో లేక ముళ్ళకంపలోకో వెళ్ళడం జరుగుతుంది. సాధారణంగా ప్రతివ్యక్తిలోనూ, కొన్ని మంచిగుణాలూ, కొన్ని చెడ్డగుణాలూ వుంటాయి. అంటే ఏమిటంటే మంచిగుణాలు ఎక్కువగావుంటే "అబ్బో ఆయన చాలామంచివాడు" అంటారు. చెడుగుణాలు ఎక్కువగావుంటే "వాడు దుర్మార్గుడు!" అంటారు. దుర్మార్గుడుఅయినా సన్మార్గుడు అయినా అది తల్లిదండ్రుల పెంపకంమీదే ఆధారపడివుంటుంది.

పసిపాపలకేమి తెలుసు? "అదుగో! ఆ గిలక్కాయ తీసుకురా" అంటే తెస్తారు. "తప్పు నాయనా! వారి గిలక్కాయ వారికియ్యి" అంటే ఇస్తాడు. మనకి తోటకూరకాడలకథ తెలియందికాదు. ఆ అబ్బాయికి ఉరిశిక్ష వడ్డప్పుడు తల్లి ఏడుస్తూవుంటే "అమ్మా! ఎందుకేడుస్తావ్? తోటకూరకాడ దొంగిలించినప్పుడు కేకలేస్తే మనకీగతి పట్టేదా? కేకలెయ్యకపోగా మావాడు పేడా అదా చేశాడని పొంగిపోయావ్. ఆ పొంగిపోవడమే ఈరోజు మన కొంపతీసింది. ఆరోజు నువ్వు "వెధవా! తోటకూరకాడ ఎందుకు దొంగతనంగా కోసుకొచ్చావ్? వారిది వారికియ్యి" అని అన్నట్లయితే ఇంతదాకావచ్చేదా? ఇప్పుడు ఏడిస్తేమటుకు లాభంఏమిటి?" అని ఆ అబ్బాయి చక్కని సత్యం చెప్పాడు. కానీ ఆ అబ్బాయికి ముందరే తెలుస్తే రాజుగారింట్లో దొంగతనం చెయ్యకపోయేవాడేమో!

కొందరు పిల్లలు చెడుమార్గాలు తొక్కుతూవుంటే వారిని సరైనమార్గంలో పెట్టడానికి ప్రయత్నించకుండా, "వాడి ఖర్మ! ఎవడిఖర్మకి ఎవరు కర్తలు? వాడి గీత ఎట్లావుంటే అల్లాజరుగుతుంది. మనమేం చేస్తాం" అని వేదాంతం చెపుతూవుంటారు.

ఇంక పిల్లల చదువువిషయంలో......

"ఆ......వాడి కెక్కడ చదువువస్తుందే? ఏ కాఫీహోటళ్ళలోనో కప్పులు కడగటమో గొడ్లనుకాయటమో తప్ప వాడు వందలు సంపాదిస్తాడన్నది కల్లోవార్త" అని ఆ అబ్బాయి భవిష్యత్తుని పాఠంగా వల్లిస్తుంది ఒకఇల్లాలు. ఈ మాటలు ఆ అబ్బాయికి నిరాశ కలిగిస్తాయి." నేను చదివితే రాదేమో! నిజంగానే కప్పులు కడగాలేమో అని అనుకుంటాడు. అలా కొన్నాళ్ళు బాధ పడతాడు. ఆ తర్వాత నిశ్చింతగా "నాకు చదువు వంటబట్టనప్పుడు నేను చదవటం ఎందుకు?" అని స్వస్తి చెపుతాడు. త్వరలోనే ఆ తల్లి ఆశీర్వచనం ఫలించడం జరుగుతుంది.

ఇంకోరకం మనుష్యులు...."మనవాడు చదవక్కరలేదే! మేష్టారు చెప్పింది ఇట్టే పట్టేస్తాడు. స్కూల్లో చదివింది చాలు. అనవసరంగా వాడ్ని దీపంముందర కూచోపెట్టడం ఎందుకు? వాడుమాంచి తెలివైనవాడు." అని.అంటారు. ఇదికూడా మంచిది కాదు. ఆ పొగడ్తలకు ఉబ్బిపోయి, ఆ అబ్బాయి చదవడు. దాని ఫలితంగా ప్రతి ఏడూ తప్పటం జరుగుతుంది. ఎప్పుడూ ఎవరిపిల్లల్ని వారు. వారిముందు పొగడకూడదు. నెమ్మదిగా, లాలనగా వారిని దారిలోకి తీసుకురావాలి.

మా చుట్టాలాయన ఒకరు వున్నారు. ఆయనకు అయిదుగురు మొగపిల్లలు. దమ్మిడీ ఆస్తిలేదు. కానీ చిన్నప్పటినుంచీ పిల్లల్ని

చీకటిలో ... మార్గదర్శి
ESTRELA
BRIGHT LIGHT
LONG LIFE
ఎస్ట్రెలా
ఎస్ట్రెలా బ్యాటరీలు లిమిటెడ్., బ్యాటరీలు
బొంబాయి-కలకత్తా-ఢిల్లీ-కాన్పూర్-మద్రాస్-నాగపూర్
E-8

# ★ పిల్లలూ, పెంపకం ★

మంచికట్టడీలో పెంచారు. వారికి జ్ఞానం వచ్చిన దగ్గరనుంచీ చెప్పేదేమిటంటే "నువ్వు కష్టపడి చదవాలి. ఎం. ఎ. ప్యాసవ్వాలి. నీ స్వయంశక్తిమీద, అంటే ప్రయివేట్లు చెప్పుకొని చదవాలి."

"ఫలానావారి అబ్బాయి కష్టపడి చదివాడు. బుద్ధిమంతుడు" అని అనిపించుకోవాలి" అని బోధచేసేవారు. చిన్నప్పటి నుంచీ అలా ప్రతిఒక్కరికీ నూరిపోయడం వల్ల, వారికి తమ బాధ్యతలు బాగా తెలుస్తాయి. ఆ పిల్లలు తండ్రి చెప్పినట్లు విని, చాలా కష్టపడి చదివారు. ఇప్పుడు తలా రెండువందలూ సంపాదిస్తున్నారు. తల్లి, దండ్రులు సుఖపడుతున్నారు. అసలైన శిక్షణఅంటే ఇలా వుండాలి. ఒకఉద్దేశం మనసులో పెట్టుకొని, వారిని ముందుకు నడిపించాలి.

శివాజీతల్లి జిజీబాయిలాంటి స్త్రీలు పిల్లలకి వీరగాథలు చెప్పి వారిని ఉత్తేజపరిచేవారు. దాంతో వారికి పౌరుషంవచ్చి, యుద్ధంచేసి, శత్రువుల్ని పారద్రోలేవారు. జిజీబాయి శివాజీతో చదరంగం ఆడేది. అతను ఓడిపోయి "అమ్మా! ఏం కావాలి నీకు?" అని అడిగితే ఆవిడ "ఫలానాకోటని ముట్టడించాలి" అని కోరేదట! ఎంత చిత్రమైన కోరికో చూడండి.

ఇప్పటి తల్లులు (అందరూ కాదు) పిల్లల్లో ఒకరిమీద ఒకరికి ద్వేషం పుటిస్తారు. వారి ఉద్దేశం అది కాకపోవచ్చు. "ఒరేయి! అన్నయ్య మంచివాడు కాదు. నువ్వు మంచి వాడివి. వాడు చదువురాని దద్దమ్మ. తాయిలమంతా నీకే పెడతాను. వాడికి పెట్టను. పోరా! వెధవా! ఫో" అంటారు. చిన్నవాడు పొంగిపోతాడు. పెద్దవాడు ఏడుస్తాడు. అలా పదిమాట్లు అనేసరికి చిన్నవాడిమీద పెద్దవాడికి ద్వేషం పుడుతుంది. పెద్దయినా ఆ భావం మనసులో మాయని మచ్చగా నిలచిపోతుంది. పెద్దవాళ్ళ బుద్ధులే పిన్నలకు అలవడేది. ఎక్కడో అందుకు వ్యతిరేకంగా జరుగుతే "వీడు వాడు చెడబుట్టాడు" అని అంటారు.

తర్వాత ఇంకో విషయం ఏమిటంటే... పిల్లలు అనవసరంగా పంపులు తిప్పి పాడు చేస్తూవుంటే చూస్తూవూరుకుంటారు. అసలు పెద్దవారే "ఒరే నాన్నా! కాసేపు పంపుదగ్గర ఆడుకురా!" అని అంటారు.

రైళ్ళలో పంకాలు వేసుకొని, వెళ్ళేటప్పుడు దాన్ని ఆపకుండానే దిగిపోతారు. వాళ్ళ ఉద్దేశం ఏమిటంటే "ఈ రైళ్ళు మనవి కావు. ఈ పంకాలు మనవి కావు. ఎలా అయితే మన కెందుకు?" అని. అంతేగానీ, ఈ రైళ్ళు పంపులు మనకోసం ఎంతో వ్యయంతో ప్రభుత్వం నిర్మించింది. ఇవి మనవి. ఈ ప్రభుత్వం మనది అని అనుకోరు.

ఇంకో టేమిటంటే... చిన్న పిల్లలతగవులకి పెద్దవారు పోట్లాడుకొంటారు. వారి పోట్లాట ముగియకముందే ఆ పిల్లలిద్దరూ తిరిగి ఆడుకొంటూ వుంటే సిగ్గు తెచ్చుకోకపోగా రెక్క పుచ్చుకొని గుంజుకుపోతారు!

కొందరుతమపిల్లలు తమకంటే తక్కువ వారితో ఆడుకొంటూంటే "ఒరేయ్! వాడు మన అంతస్తుకి తగడు. వాడితో ఆడకు. చక్కగా కలక్టరుగారి అబ్బాయితోనన్నా, జడ్జిగారి అబ్బాయితోనన్నా ఆడుకో. అంతేగానీ ఆ దరిద్రుడితో ఆడకు" అని చెప్తారు. ఇవన్నీ కూడనివి. అందరితోనూ సోదరభావంతో మెలిగేటట్లు, చక్కగా చదువుకొని బుద్ధిమంతులు అనిపించుకొనే టట్లు, దొంగపనులు అలవడకుండా, భరత మాతకు తగిన పుత్రులు అనిపించుకొనేటట్లు మన చిన్నారి పొన్నారి చిరుతపాపలను ప్రయోజకులనుచేసి, భారత మాతకీర్తి పెంపొందింప చేయాల్సిన కర్తవ్యం మనది. ★




ఆదగ్గును అణచండి
ఆ గొంతు
పుండును
ఉపశమింప
జేసి
మాన్పండి

పెప్స్ టేబ్లెట్లు గొంతు, రొమ్ము బాధోపశమన, వినాశక సారములు కలపి. మీరు పెప్స్‌ను చప్పరించునపుడు ఈ సారములు ఆవిరి అయి, మీ శ్వాసద్వారా గొంతుకలోనికి, శ్వాసమార్గం, శ్వాసకోశాలలోనికి కొనిపోబడుతాయి. ఇలా అవి వరాసరి మిమ్ము బాధించే భాగాలను చేరుకుంటాయి. అందుకే పెప్స్ అంతశక్తివంతమై, జగద్విఖ్యాతి గాంచినవి. పెప్స్ దగ్గులను అణచివేస్తాయి, గొంతుపుండు బాధను ఉపశమింపజేస్తాయి, మీ శ్వాసకోశాలను రక్షిస్తాయి, కఫమును కోసివేసి శ్వాసబాధను పోగొట్టుతాయి. ఇన్‌ఫ్లుయేంజా, బ్రోంకైటిస్ చికిత్సకు ఇవి అమోఘమైనవి

పెప్స్ సేవించండి.

PEPS

జగద్విఖ్యాతి గాంచిన,
గొంతు, రొమ్ము టేబ్లెట్లు:
మందు లమ్మేవారి అందరివద్దా లభిస్తాయి.

సోల్ ఏజెంట్లు: దాదా & కంపెనీ, 86 సైనప్ప నాయక్ వీధి, మద్రాసు-3.

శతముల సౌందర్యాభివృద్ధికి
కాష్మీర్-కుసుమ్
సుగంధ చర్మరక్షణ మలామ్
సాంటలక్స్
దురద, గజ్జలు, కాళ్ళు, మొటిమలకు
కోడి మార్కు
యునైటెడ్ కన్సర్న్స్ - మద్రాస్-1.
బ్రాంచి: విజయవాడ.
మరియు హైదరాబాదు.

RATNAM'S 'N' OIL
సేవించిన పూర్తి సంతోష సౌఖ్యము లనుభవించగలరు. 1 సీసా రూ. 11-4-0.
ఎడ్వాన్సుతో జాబు వ్రాయండి.
డాక్టర్. రత్నం సన్స్,
మలకపేట బిల్డింగ్స్, హైద్రాబాదు-2




# ★ ప్రాప్తి ఉండాలి ★

పూర్వ మొక్క గ్రామమందు
బ్రాహ్మణు డొక డుండెను.
వాని కధిక సంతానపు
బాధ మిగుల నుండెను.

కష్టపడుచు ఆర్జించుచు
కన్న కడుపులకు నెట్లో
మృష్టాన్నము పెట్టుచుండె
నా బ్రాహ్మణ వర్యుడు.

అతని సతీమణియు సతతు
పొదుపరులే గావున
పొర పొచ్చెములే లేకను
సాగెను జీవితము.

ఇట్టు లుండగా నాతడు
ఒక వేసగి దినమున
బుట్టనిండుగా మామిడి
పండ్లన్నియు తెచ్చెను.

వానితీసి చూడగాను
అందులోన కొన్ని పండ్లు
అక్కడక్కడా కొంచెము
కుళ్ళి పోయియుండెను.

అంతట నా బ్రాహ్మణుండు
ఆలి బిలిచి చెప్పెనిట్లు:

"ఈ ఫలములలోన కొన్ని
కుళ్ళి పోయెగావున
వానిని తినుముందుగాను
వాడి వేయ వలయును.

"భా మ"

మరు నాటికి బుట్టలోన
మంచి పండ్లె మిగులును.
ఇంపు మీర మీరు వాని
భుజియింపగ వచ్చును."

ఆమాటలు వినినంతనె
అతివ 'అట్లె' యన్నది.
ఆనాటికి చెడిపోయిన
పళ్ళే వడ్డించెను.

మరునాటి ప్రభాతమందు
మరల చూడగా బుట్టను
మరలకొన్ని పండ్లమీద
డాగులు కనుపించెను.

జాగ్రత గల బ్రాహ్మణుండు
తన భార్యాసుతులచేత
నాడు కూడ చెడిపోయిన
పండ్లే తినిపించెను.

ఈరీతిగ ప్రతిదినమును
ఉదయానే పరికించగ
కొత్తగాను కుళ్ళినట్టి
పళ్ళే కనిపించెను.

అందుచేత ఆ బ్రాహ్మణ
కుటుంబమున నెవ్వరు
కుళ్ళు పళ్ళు తప్పమంచి
పళ్లెప్పుడు తిన లేదు.

బ్రాహ్మణునికి ధనమేమో
చాల ఖర్చు అయినది.
పిల్లలకా కుళ్ళినట్టి
పళ్ళే గతి యయినవి!



# శివుడి తీర్పు

ఒకరోజున బ్రహ్మదేవుడు సత్యలోకంలో కూర్చుని తనసృష్టి నంతా ఒక్కసారి కలయజూశాడు. అనంతమూ, అతివిచిత్రమూ అయిన తన సృష్టి నంతా చూడగానే ఆయనకు ఆశ్చర్యమూ, దానితోపాటు ఆనందమూ కలిగాయి. "ఇంత సృష్టి చేసింది నేను, ఎంత గొప్పవాణ్ని!" అనుకున్నాడు.

వెంటనే ఆయన తనతండ్రీ, జగన్నాటకసూత్రధారుడూ అయిన విష్ణుదేవుడి దగ్గరికి వెళ్ళాడు. వెళ్లినవాడు ఆయనకు నమస్కారమేనా చెయ్యకుండా "నాన్నగారూ, నేను చాలా గొప్పవాణ్ని" అన్నాడు.

విష్ణువు విస్తుపోయాడు. 'ఏమిటీ వీడి వాలకం! ఎప్పుడూ తన దగ్గరికి వచ్చినప్పుడు, ఎంతయినా వినయంతో వుండేవాడు! అలాంటిది - ఈరోజు మామూలుప్రకారం నమస్కారమేనా చెయ్యడు, సరికదా— గుండె విరుచుకుంటూ "-నేను గొప్పవాణ్ని" అంటాడేమిటీ?"

కాస్సేపటికి విష్ణువు తేరుకుని, "ఏమిటబ్బాయ్ నువ్వనేది?" అన్నాడు.

"నేను చాలా గొప్పవాణ్ని నాన్నగారూ! ఇంకా చెప్పాలంటే మీకంటె కూడా గొప్పవాణ్ని." అన్నాడు బ్రహ్మ.

విష్ణుమూర్తికి కోపం వచ్చింది. "ఉన్నకొద్దీ వీడి వ్యవహారం ముదురుతోంది. భయం భక్తి లేకుండా, నాకన్నా గొప్పవాణ్నంటున్నాడు! వీడికి శాస్తి చెయ్యకుంటే వీల్లేదు," అనుకున్నాడు.

"అలా అనకూడదబ్బాయ్. గొప్పవాడుగాని, గొప్పవాడు కాదల్చుకున్నవాడుగాని తాను గొప్పవాణ్నని ఎవ్వరితోనూ చెప్పడు.

పణతుంల రామచంద్రయ్య

అదీకాక, నేను నీకన్నా పెద్దవాణ్ని. పెద్దవాళ్లకన్న గొప్పవాడి ననుకుంటే అది ఆయుఃక్షీణం సుమా!" అన్నాడు విష్ణువు చాలా శాంతంగా.

కాని ఈమాట లేవీ బ్రహ్మ చెవికెక్కలేదు. "నాన్నగారూ, మీరేమన్నా సరే, నేను మీకన్నా గొప్పవాణ్ని. ఇది కాదనేందుకు వీల్లేని సంగతి," అని నిక్కచ్చిగా అన్నాడు.

ఈ మొండిపట్టు చూసి చాలా చికాకు పడ్డాడు విష్ణువు. అయినా త్వరపడటం మంచిది కాదని చాలా చెప్పిచూశాడు. కాని బ్రహ్మ వినలేదు. "మనిద్దరిలో నేనే గొప్పవాణ్ని," అని భీష్మించుకూచున్నాడు. ఎంతకూ ఈ తగువు తేలకపోయేసరికి, ఇద్దరూ తీర్పు కోసం శివుడి వద్దకు వెళ్లారు.

ఇద్దరూ, తమతమ వాదాలు వినిపించి, తమలో ఎవరు గొప్పో నిర్ణయించమని శివుణ్ని కోరారు. శివుడికో యుక్తితట్టింది. "మీ యిద్దరూ నేరుగా ఆంధ్రదేశంలోని శ్రీశైలం వెళ్లండి. మీలో ఎవరు ముందుగా అక్కడికి వెళ్ళి, అక్కడి శివలింగానికి పూజలుచేసి వస్తారో వారు గొప్ప." అన్నాడు. శివుడు చెప్పటమే తడవుగా శ్రీశైలానికి బయలుదేరాడు విష్ణువు. ఆపిమ్మట బ్రహ్మ కూడా ప్రయాణమైనాడు. బ్రహ్మకు నిరుత్సాహంగా వుంది. 'ఎక్కడి శ్రీశైలక్షేత్రం! అక్కడికి వెళ్లి, పూజచేసి త్వరగా రావటమంటే మాటలా? నాన్నగారైన విష్ణుదేవుడు తనకన్నా ముందే పూజ పూర్తిచేసి వచ్చెయ్యగలడు. ఆయనే గొప్పవాడని తేలిపోతుంది.'

ఇక ఏదో ఒక పథకం వెయ్యనిదే లాభం లేదనుకున్నాడు బ్రహ్మ. ఇలా ఆలోచిస్తూ కొంతదూరం వెళ్లేసరికి, శ్రీశైలంలో శివుణ్ని సేవించి వస్తున్న నందికేశ్వరుడూ, మొగిలిపువ్వూ ఆయనకు ఎదురుపడ్డారు.

వాళ్లను బ్రహ్మ చాలా ఆప్యాయంగా పలకరించి, తను బయలు

(46 వ పేజీ చూడండి)

# విచిత్ర బ్రహ్మ

ఒకనాడు ఆంధ్ర కర్ణాటక మహీతలేంద్రుడైన శ్రీ కృష్ణదేవరాయలవారి ఆస్థానానికి అతిగర్విష్ఠి అయిన పరదేశీయ చిత్రకారుడొకడు వచ్చేడు. తిన్నగా రాయలవారివంక చూసి—

"ఓ ఆంధ్రరాజా! నేను ఉజ్జయినీ దేశ చిత్రకారుడు, సకలభువన పరివ్యాప్త యశోవంతుడు అయిన చిత్రబ్రహ్మనని మీకు తెలిసే వుంటుంది. ఈ చిత్రబ్రహ్మ చిత్రకళారంగంలో అంగ, వంగ, కళింగ కాశ్మీర, కామరూప, కాంభోజ, నేపాల, భోపాల, ఉత్కళ, మగధ, విదేహ, విదర్భ, సౌరాష్ట్ర, మహారాష్ట్ర చిత్రకళాకారుల నందరనూ జయించివచ్చిన మహాచిత్రకారుడు. నన్ను మించినవాడు, ఈలోకంలో ఆలోకంలో...ఏలోకంలోనూ లేడు. లేనేలేడు. ప్రస్తుతం, ఈచిత్రబ్రహ్మ సింహళ చిత్రకళాకారుల గర్వాన్ని అణచి, విజయలక్ష్మిని పట్టుకుపోదామని వెడుతూ, దారిలో ఈ తెలుగు తమ్ముళ్ళుకూడా ఎక్కడో కొండగుహలమీదా, గోడలమీదా నాలుగు గీతలు గీసేరని విని మీ దగ్గరనుండికూడ ఒక జయపత్రిక పట్టుకపోదామని వచ్చేసేడు."

అని చిత్రబ్రహ్మ మీసం మెలిపెట్టుకుని ఆసనంమీద కూర్చున్నాడు నిర్లక్ష్యంగా.

సభాసదులంతా ఆశ్చర్యపడిపోయారు. 'ఇంతటి అఖండ ప్రతిభావంతుడైన చిత్రబ్రహ్మను కన్న ఉజ్జయిని ఎంత పుణ్యభూమి?' అనుకున్నారు. కాని వికటకవిశేఖరుడు మాత్రం హేళనగా, ఒక వికటాట్టహాసం విసిరి నిశ్శబ్దాన్ని భస్మం చేసేడు. ఈపిలకబ్రాహ్మడు నవ్వేస్తాడేమిటి అని కోపంతో ఇతన్ని నమిలి మింగేసి మంచినీళ్లు త్రాగేసి చక్కాపోదా మన్నంత క్రోధం వచ్చింది. వెంటనే లేచి నిలువబడి

గౌతమశ్రీ

"నాకీర్తి వింటే అలా మీరు తొందరపడివుండరు. అన్నిటికన్నా మించిన అఖండమైనభావగాంభీర్యం నాచిత్రాలలో తొణికిసలాడుతుంది. మీకు నాచిత్రాలు ఏవో పిచ్చిగీతలులాగ కనబడతాయి. హాహా..హా...కాని వానిలో అణగి మణగిన భావగాంభీర్యం అర్థమవడం కవిశేఖరులకే తరతరాలు పడుతుంది."

"ఆమధ్య నేను ఆంగ్లదేశం వెళ్ళేను. అంటే మనదేశానికి వర్తకానికి వస్తారే తెల్లవాళ్ళు, వాళ్ళదేశం...అక్కడ నా చిత్రంలోని భావం తెలియక మూడు నెలలు తంటాలుపడ్డారు వాళ్ళంతా... వాళ్ళంటే ఎవరు? వీళ్ళూ వాళ్ళూ కాదు. మీలాంటి ఆంధ్రదేశాలో వెయ్యిదేశాలని వాళ్లు జయించేరు. కాని చివరకు అర్థం నే చెప్పేసేనులెండి.

ఇప్పుడు మీకు నేనొక బొమ్మ చూపెడతాను. దానిలో ఇమిడిఉన్న మహత్తర భావాన్ని మీరు చెప్పినట్లైతే మీరు నన్ను జయించినట్లు. నన్నంటే ఇందాకా చెప్పేను కదూ అంగ వంగ కళింగాది సకలదేశవాసులైన కళాకారులని జయించిన నన్ను. మీరు చిత్రాన్ని అతి జాగ్రత్తగా చూడండి. మళ్లీ పొరపడతారు. జాగ్రత్త. కళ్లు నరిచేసుకోండి ఆంధ్రులారా! పిచ్చిగీతలు అని భ్రమపడకండి. ఒక్కభావాన్ని చెబితేచాలు. నా పతకాలు, బహుమానాలు, అన్నింటికీ మించిన నాకీర్తి మీపరమౌతాయి."

చిత్రబ్రహ్మ సంచీ తీసి దానిలోనుండి ఒక పెద్దగుడ్డ పైకి తీశాడు. అందరికీ కనబడేటట్లుగా దానిని విప్పి తీసి, రెండుచేతులతోను పట్టుకున్నాడు.

అతి నిశ్శబ్దంగా సభ దానికేసి చూసింది. అంతా ఏవోపిచ్చిగీతలు, మధ్య మధ్య రంగులు...అయోమయంగా ఉంది. ఒక ఆకారం అంటూ దానిలో ఏమీలేదు. అన్నీ పిచ్చిగీతలే. భావం మాత్రం మరవగాహంగా ఉంది. ఆస్థాన చిత్ర

 

# విచిత్రబ్రహ్మ



కారుడైన చిత్రసేనుడికి మాత్రం ఏం చేయాలో తోచలేదు. ఆ భావం తెలియచెప్పకపోతే తన గౌరవమంతా మంటకలసిపోతుంది......! తన పదవి పోతుంది. తీరని అవమానం...! తాను అఖండచిత్రకారుడని నమ్మి తనకాశ్రయమిచ్చిన ప్రభువు గౌరవం పోతుంది...!

అతనికి మతిపోతోంది. దానికి సాయం తమ ఆస్థాన చిత్రకారుడు ఏమి సమాధానం చెపుతాడో నని సభాసదులంతా ఆతృతతో చూస్తున్నారు అతని వంక. విజయం అప్పుడే తనకి దక్కినట్లు ఆ పరదేశి గర్వంతో చూడసాగేడు. ఇంత మందిలోనూ, ఏ కంగారు లేకుండా చూస్తున్నవాడు వికటకవి సార్వభౌముడు. అఖండ మేధాశాలి అయినటువంటి తెనాలి రామలింగడొకడే!

"అయితే మీరు ఓడిపోయారన్నమాట...ఆంధ్రులు అంటే ఆరంభశూరులని"...ఇంకా ఏదో అనబోతున్నాడు చటుక్కున తెనాలిరామలింగడు...

"ఓ అమానుష కళాసార్వభౌమా! ఆగండి. మీరు ఇచ్చిన చిత్రపటంలోని భావం బ్రహ్మాండమైనది అవడంవలన మా ఆస్థాన చిత్రకారులు చెప్పడానికి సంకోచిస్తున్నారు. మీరు సరిగ్గా రేపు ఈ సమయానికే ఈ భువనవిజయ సభాస్థలికి వేంచేస్తే మీ భావం మీకు ప్రదర్శించి మీకు బాగా గౌరవాలు చేసేస్తాము. నేటికి మీరు దయచేయవచ్చును" అన్నాడు.

వికటాట్టహాసం చేసేడు అమానుష చిత్రకళాసార్వభౌముడు శ్రీ చిత్రబ్రహ్మ. రేపు తప్పకుండా వికటకవి చిత్రబ్రహ్మకు శృంగభంగం చేస్తాడని నిర్ణయించుకున్న ప్రజలు చప్పట్లు కొట్టేసేరు. తన విజయానికి వారు చేస్తున్న కరతాళధ్వనులను కుని సంతోషించేడు చిత్రబ్రహ్మ.

ఆనాటికి సభ ముగిసింది. "చిత్రబ్రహ్మ గీసిన పిచ్చిగీతలలో భావం లేదు, వాడి తలకాయా లేదు. అందుచేత ఎవరూ ఏమీ చెప్పరుకదా విజయం పట్టుకపోదామని ఈ మోనకాడు గర్వపడుతున్నాడు. వీడి పని నేను పడతాను" అని చిత్రసేనునికి ధైర్యంచెప్పి వికటకవి గృహోన్ముఖుడయేడు నిశ్చింతగా. తన మోసం ఎవరూ కనిపెట్టలేరుకదా, ఇక్కడ ఒక విజయపత్రిక సంపాదించుకుపోదామని సంతోషంతో గర్విష్టి తనబసకి వెళ్లేడు. ఈ వికటకవి సార్వభౌము డుండగా నాకు భయమేమిటి అని ఆంధ్ర కర్ణాటక సార్వభౌముడు నిశ్చింతగా తన అంతఃపురానికి బయలుదేరేడు. తనకు అవమానం తప్పించి రక్షించిన తెనాలి రాముడికి నమస్కరించి తేలికపడిన హృదయముతో గృహోన్ముఖుడైయేడు చిత్రసేనుడు.

అనుకొన్నట్లు గానే మర్నాడు సాయంత్రం శ్రీ కృష్ణదేవరాయల కళామందిరమైన భువనవిజయంలో మహాసభ ఏర్పాటైనది. సకలదేశ రాయబారులు, కళా సంఘాలు, కవిశేఖరులు, చిత్రకళా పండితులు, శిల్పకారులు ఒకరేమిటి అందరూ ఏమిజరుగుతుందో అని మహోత్కంఠతో భువనవిజయానికి వచ్చారు.

చిత్రబ్రహ్మ తనకు జరుగబోయే గౌరవాన్ని తలచుకుంటూ అర్థనిమీలిత నేత్రాలతో ఆంధ్రులసభాభవన వైభవానికి ఆశ్చర్యపడుతున్నాడు. ఇంతలో అతని కెదురుగా సింహాసనారూఢుడైన సింహళరాజు సపరివారంగా ఎదట ఆసనం మీద కనబడ్డాడు..."

అతను అదరిపడి గబగబా లేచి ఆయనకు నమస్కరించి "మహారాజా! ఇక్కడ సన్మానమైన తరువాత మీ రాజ్యానికి వస్తాను. మన్నించండి. నేను అంగవంగ..." అంటూ గట్టిగా చెప్పసాగేడు.

ప్రజలంతా గొల్లుమని నవ్వేరు. చిత్రబ్రహ్మ ఏమిటా అని చూసేడు.

తాను చూచినది సింహళరాజు కాదు; ఆయన చిత్రపటం! అతిలోక మనోహరమైన ,ఆంధ్ర చిత్రకారుడొకడు భువనవిజయకుడ్యంమీద చెక్కేడు."

చిత్రబ్రహ్మ సిగ్గుపడిపోయాడు. మనస్సులో ఆంధ్రుల నైపుణ్యానికి ఆశ్చర్యపడ్డా పైకి మాత్రం ఏమీ కనబరచక మళ్ళీ వచ్చి తన ఆసనం మీద కూర్చున్నాడు.

ఇంతలో ప్రక్కన ఏవో గుసగుసలు వినబడ్డాయి.

నెమ్మదిగా అటువంక చూసేడు చిత్రబ్రహ్మ..."బాబోయ్" అనేసేడు: ఎదురుగా పెద్ద సింహం!

ముందుకు లంఘిస్తోంది. "ఇది చిత్రపటమేమో?" అనుకున్నాడు చిత్రబ్రహ్మ: అబ్బే కాదు. ఆ చూపులు...పంజాలు ముందరకు చాచింది...ఇది చిత్రపటం కాదు. మీదకు దుముకుతోంది సింహం... ఆ జూలు, ఆ ఉదారంగు,...అబ్బ! అగ్నిగోళాలులాంటి ఆ కళ్లు..."అతి

భయంతో బాబోయి అని కేకపెట్టి వెనక్కుపడ్డాడు చిత్రబ్రహ్మ.

ఇంతలో తెనాలి రామలింగడు వచ్చి "అదేమిటండీ చిత్రబ్రహ్మ గారూ? ఆ శిల్పాన్ని చూసి అలా అదిరిపడ్డారేమిటి? అది మా ఆస్థాన శిల్పాచార్యుడు నాగరాజు ప్రతిష్ఠించిన అపురూప కళాఖండం. అది నిజం సింహం కాదు. భయంపడకండి"...అన్నాడు.

కొంత ధైర్యం వచ్చింది చిత్రబ్రహ్మకు...నెమ్మదిగా తేరి చూసి సింహాన్ని చేత్తో ముట్టుకుని, అది శిల్పమేనని ఋజువు చేసికొన్న తర్వాత తనకు ఏదో అనుభూతి కలిగి అలా అన్నానని చెప్పి తిరిగి ఆసీనుడయ్యేడు. కాని అతని గుండెల వేగం తెనాలిరామలింగడు కని పెట్టాడు.

ఇంతలో ఘంటారావం వినబడింది. చక్రవర్తి సభలోనికి వచ్చి రత్నసింహాసనం మీద ఆసీనుడయ్యేడు.

సభంతా కిక్కురుమనకండా చూస్తోంది..."మీ చిత్రాన్ని ప్రదర్శించండి, తగిన సమాధానం మా ఆస్థానపండితులు తెలియజేస్తారు," అన్నాడు చక్రవర్తి.

ఒణుకుతూన్న చేతులతో నిన్నటి పిచ్చిగీతల బొమ్మనే సభకు చూపేడు చిత్రబ్రహ్మ.

ప్రజల ఉత్కంఠ పెచ్చుపెరిగింది.

"మీకు చాతనైతే భావం తెలియచెయ్యండి లేదా...నాకు విజయపత్రికను సబహుమానంగా ఈయండి" అన్నాడు చిత్రబ్రహ్మ.

ఎవరు ముందుకు వస్తారా అని సభ్యులు ఒళ్లంతా కళ్లు చేసుకుని చూస్తున్నారు.

ఇంతలో ఒకమూలనుండి ఒక పెద్ద కోతి గబగబా సభలోనికి వచ్చింది. దాని చేతిలో ఒక పెద్ద చిత్రపటం ఉంది. కొన్ని కోతులు కలసి చాలా సంతోషంతో నవ్వుతూన్నట్లుంది ఆ బొమ్మలో. కోతి సభామధ్యానికి వచ్చి తాను తెచ్చిన చిత్రాన్ని అందరకూ చూపి, చిత్రబ్రహ్మకు ఇచ్చి అక్కడే ఒకమూల నిలబడింది.

"ఈ అల్లరంతా ఏమిటి?" అన్నాడు చిత్రబ్రహ్మ విసుగ్గా.

సభ్యులకేమీ తెలియడంలేదు. తెనాలిరామలింగడు లేచి 'ఓ విచిత్ర సార్వభౌమా! కంగారు పడకండి. అది నా పెంపుడుకోతి. నేను వద్దు వద్దని ఎంత మొత్తుకున్నా వినకండా 'నేనే సమాధానం చెప్తా చిత్రబ్రహ్మ గారికి' అని పరిగెత్తుకు వచ్చింది. పోనీ ఎవరైతేనేమిటి భావం చెప్పడానికి అని ఊరుకున్నా అన్నాడు.

'అయితే ఆ కోతి చేతిలో చిత్రపటం ఏమిటి?" అన్నాడు కఠినంగా చిత్రబ్రహ్మ.

"కంగారుపడకండి బ్రహ్మం గారూ...ఆ కోతి నాతో ఏమి చెప్పిందంటే, ఆయనభావం మహత్తరమైనది, దాన్ని చెప్పడానికి భాష చాలదు, అందుచేత చిత్రపటం ద్వారా ఆ భావాన్ని ఆయనకు చెప్తాను...అంది. మీ పటానికి భావం కోతి తెచ్చిన చిత్రపటంలో ఇమిడి ఉందన్నమాట! మీరుదాన్ని అర్థం చేసుకోండి..." అన్నాడు వికటకవి.

ఘొల్లుమని నవ్వుతూ కరతాళధ్వనులు చేసేరు సభ్యులంతా. ఆ వానరోత్తముడు తెచ్చిన చిత్రపటంలోని భావం చిత్రబ్రహ్మకు బుర్ర బద్దలు కొట్టుకున్నా అర్థమవలేదు. అతడికి ఏమిచేయాలో ఏమిటో తెలియలేదు. తాను ఏమి సమాధానం చెబుతాడోనని అంతా ఎదురుచూస్తూండడం మరీ చికాకు పెట్టింది చిత్రచతురాననుడికి. ఆఖరికి ధైర్యం సమకూర్చుకొని లేచి...

"ఈ వెధవ కోతి గీసిన పిచ్చిగీతలలో భావంలేదు ఏమీ లేదు. నన్ను మోసం చేద్దా మనుకుంటున్నారు. మీరు"...అన్నాడు.

వెంటనే తెనాలిరామలింగడు లేచి నిలబడి "మహాశయా! మేమూ అదే అందా మనుకుంటున్నాం మీ పటాన్ని చూసి" మీకు భావం తెలియకపోతే తెలియదని చెప్పక నా ముద్దులకోతి గీసిన పటంలో అసలు భావం లేదనడం బాగాలేదు. మీరు చెప్పలేను...అంటే నేను చెప్పేస్తా భావాన్ని" అన్నాడు.

ఈ ఘటికుడితో వాదిస్తే ఇంక తన గౌరవం దక్కదని నిశ్చయించుకుని, చిత్రబ్రహ్మ "సరే, నాకు తెలియదు" అనేసేడు.

అప్పుడు చిరునవ్వుతో తెనాలి రామలింగడు లేచి..."ఈ చిన్న భావం మీరు చెప్పలేరని నేను కలలోకూడా అనుకోలేదు. చిత్రబ్రహ్మ గారికి, అందులో భావాలువిరజిమ్మే ఈయనకు అర్థమవలేదంటే మనకే తలవంపు.

ఇంతకీ దీనిలో భావము ఇది. ఈ భావం నా స్వంతంకాదు మా వానరునిదే...ఏమిటంటే...ఆ పటంలో కోతులు నవ్వుతూ సంతోషిస్తూన్నట్లుంది కదా! మా వానరుడి స్నేహితులవి. తమతో సమానమైన భావంకలవాడూ తమ చిత్రకళతో సమానమయిన చిత్ర

## విచిత్ర బ్రహ్మ

కళను వేయకలిగినవాడు అయిన నరుడు ఈనాటికి ఈ కృష్ణరాయల ఆస్థానానికి వచ్చాడుకదా! అని ఆ వానరుల ఆనందం. తమలో జేర్చుకోడానికి ఏమీ అభ్యంతరం లేదని కూడా మా వానరుడు చెప్పేడు. అంతేకాదు ఇంత చిత్రకళాకారులైన ఆంధ్రులని ఏవో నాలుగు పిచ్చి గీతలు గీసి పోశన చేద్దామనివచ్చిన నరుడు ఎంత అమాయకుడోనని ఈ వానరబృందం నవ్వుతోంది. ఇదీ దీని భావం...!

ఈ భావాన్ని గ్రహించి తాము చేసిన తప్పుని సవరించుకొని దయ చేస్తారు చిత్రబ్రహ్మగారని నా ఆశయం."

అని తెనాలి రామలింగకవికూర్చున్నాడు. సభంతా నవ్వుతో దద్దరిల్లిపోయింది.

ఇంత గట్టిగా తన మోసాన్ని తెలుసుకొని చెప్పుదెబ్బకొట్టిన వికట కవిని చూసి ఆశ్చర్యంతోను, భయంతోను తలవంచుకున్నాడు చిత్రబ్రహ్మ.

అపుడు మళ్లీ వికటకవి లేచి, జయజయధ్వానాలమధ్య నిలువబడి, కంఠం సవరించుకొని, చిత్రబ్రహ్మ వంక చూసి, "చిత్రబ్రహ్మగారూ, మీకు ఇంతో అంతో చిత్రకళవస్తే వచ్చి వుండవచ్చును. కాని పిచ్చిగీతలతో పెద్దవాళ్లని మోసం చేద్దామని ఎన్నడు అనుకోకూడదు. అందులో ఆంధ్రులనా మోసం చేయడం?

లేపాక్షి దేవాలయ కుడ్యాల మీద చిత్రింపబడిన అపురూప సజీవచిత్రాలని మీరు తిలకించే ఈ పనికి తలపెట్టేరా? ఈ భువనవిజయ కుడ్యచిత్రాలను సంపూర్ణంగా చూసే ఈ మోసానికి ముందడుగు వేసేరా? మహోత్తమాంధ్ర చిత్రకళా సామ్రాజ్యం ఈ కృష్ణదేవరాయ మహీపాల పరిపాలిత విజయనగర విశాలాంధ్ర సామ్రాజ్యాన్ని పరిశీలించేనా ఈ పరిహాసానికి మీరు ఒడిగడత?

మా ఆంధ్రదేశం నలుమూలలా ఒకసారి పరిశీలించితే మీకు కాస్తైనా చిత్రరచన అలవడుతుంది. ప్రతీ గృహకుడ్యాల మీదా చిత్రకళా సుందరి స్వేచ్ఛావిహారం చేస్తూంటుంది. మా దేవాలయాలు చిత్రకళా నిలయాలు. ఆ మహోన్నత కళకి జీవంపోసి మా చిత్రకారులు భువనమోహనంగా చేసేరు. ఆనిరుపమానమైన అందంలో నే కళాతపస్సు వలన దివ్యానుభూతిని పొందుతారు ఆ దేవళాల్లో ఆంధ్రజనులు...

ఇకనైనా బుద్ధి తెచ్చుకుని ఆంధ్రుల జోలికి మీరు రాకండి. వెంటనే దయచేసి మీ గౌరవం కాపాడుకోండి. మాఆంధ్రుల సహృదయతే మిమ్మల్ని మన్నిస్తుంది" అన్నాడు.

కరతాళ ధ్వనులతో మార్మోగింది. భువనవిజయసభాభవనం.

చిత్రబ్రహ్మకు శృంగభంగం జరిగింది. గత్యంతరం లేక ఎదరగా కుడ్యం దగ్గిర సింహాసనం మీద తిరుమలదేవితో సహా ఆసీనుడైన ఆంధ్ర చక్రవర్తి పాదాలపై వ్రాలి క్షమించాలి అని ప్రార్థించాడు, చిత్రబ్రహ్మ.

సభమళ్లీ ఘొల్లుమని నవ్వింది. "అయ్యో! తాను చూచినది చక్రవర్తి కాదు. ఎదరగోడమీద చిత్రించబడ్డ ఆయన చిత్రపటం!★

---

## స్మృతి తీర్పు

(24 వ పేజీ తరువాయి)

దేరిన కథంతా చెప్పాడు. అలా చెప్పి, "మిత్రుల్లారా, మీరు నాకో ఉపకారం చెయ్యాలి. మీరు ఈ పళాన నాతో కైలాసంవచ్చి శివుడితో, నేను శ్రీశైలం వెళ్లి శివలింగాన్ని పూజించి వస్తున్నట్టు చెప్పాలి," అన్నాడు.

వాళ్లు భయపడ్డారు. అబద్ధం చెప్పడమే తప్పు. అందులోనూ శివుడితో అబద్ధమాడటం ఎంతనేరం! ఎంత ప్రమాదం! ఇది సబబుకాదని వాళ్లు ఎంతగానో బ్రహ్మకు చెప్పి చూశారు. కాని బ్రహ్మ వినలేదు. ఇక తప్పదని వాళ్లు బ్రహ్మతో కలిసి కైలాసం వెళ్లారు.

బ్రహ్మ ముందుగా తాను శ్రీశైలంనుంచి వచ్చానని చెప్పగానే శివుడికి ఆశ్చర్యం వేసింది. "నీ మాటకు సాక్ష్యం ఏమిటి?" అని అడిగాడు. తనకుసాక్ష్యంగా మొగిలి పువ్వునూ, నందికేశ్వరుణ్నీ చూపెట్టాడు, బ్రహ్మ.

శివుడు ముందుగా మొగిలి పువ్వును ప్రశ్నించాడు: "బ్రహ్మ చెప్పింది నిజమేనా?" అని.

సమాధానంగా మొగిలిపువ్వు, "నిజమే స్వామీ, బ్రహ్మదేవులు శ్రీశైలంవెళ్లి పూజచేసి వచ్చారు. మా కళ్లతో చూశాము," అన్నది.

తర్వాత నందికేశ్వరుణ్ని ప్రశ్నించాడు శివుడు: "ఏం నందీ! వాళ్లు చెప్పింది నిజమేనా?" అని అడిగాడు.

నంది తడబడింది. శివుడిముందు

అబద్ధం చెప్పటానికి భయపడింది. అది, "వాళ్లు చెప్పింది నిజమే" అన్నట్టు తల ఆడిస్తూ, "కాదు" అన్నట్టు తోక అడ్డంగా ఆడించింది.

ఇది చూచి శివుడికి అనుమానం కలిగింది. ఆయనదివ్యదృష్టి వల్ల అంతా గ్రహించేశాడు. బ్రహ్మ చేసిన మోసం ఆయనకు అర్థమయింది.

ఇంతలో విష్ణుమూర్తి, శ్రీశైలంలో శివుణ్ని పూజించటం పూర్తిచేసి అక్కడికి వచ్చాడు. శివుడికి ఆనందమయింది. "బ్రహ్మవిష్ణులలో విష్ణువే నిస్సందేహంగా గొప్పవాడు," అని తీర్పు చెప్పి వాళ్లిద్దరినీ శివుడు వారి వారి లోకాలకు పంపేశాడు.

బ్రహ్మ ప్రేరేపణకు లొంగి తనకు దొంగసాక్ష్యం చెప్పినందుకు మొగిలిపువ్వుమీదా, నందిమీదా శివుడు ఆగ్రహం చెందాడు. "ఈనాటి నుండీ నువ్వు నాపూజకు పనికి రాకుండా పోవుదువుగాక," అని మొగిలిపువ్వును శపించాడు.

"నువ్వు తలఆడించి అబద్ధం చెప్పావు. తోక ఆడిస్తూ నిజం చెప్పావు. కాబట్టి ఇకనుంచీ నా సమక్షంలో నీతల అపవిత్రంగానూ, తోక పవిత్రంగానూ వుండి పోతుంది," అని నందిని శపించాడు.

అందుకనే, మొగిలిపువ్వుతో శివుణ్ని పూజించరాదనీ, శివాలయంలోకి వెళ్లినప్పుడు నంది తోక మీద కన్ను ఉంచి శివుణ్ని దర్శించాలనీ పెద్దలు అంటుంటారు. ★

## మగవాడి బిడియం

(28-వ పేజీ చూడండి)

అన్నట్టు మరచాను. అతని అత్తవారిది హైదరాబాదే.

ఆమె "బంగారపు గాజులకి అలంకారంగా వున్న చెయ్యి"ని పైకెత్తి లేత వేళ్ళతో చిన్ని గడ్డాన్ని నొక్కుకుంది. 'ఆఁ సరేగాని అదేం భోజనమండీ? నాకు గాభరా ఎత్తుకొచ్చింది. కారం చస్తుందేమో నని ఎంత నెయ్యి వేసినా మంచినీళ్ళ గ్లాసులు కాళీచెయ్యడం తప్పితే ఒక్కముద్ద నోట్లో పెటుగున్నారు కాదు. పైగా అంత సిగ్గేమిటండీ, ఈ సెల్లాస్కూళ్ళ ఇలాగే తిన్నారా ఏమిటి? మళ్ళీ గుమ్మం దాటకుండా నాకు బుద్ధొచ్చేలా చేశారు. అమ్మో రాత! తినడం కూడా చేతగాని మొగాళ్లు దొరికారు' అని "ఆ కలకంఠి తియ్యగా" మెత్తగా చీవాట్లు వేసింది. "ఆచరణ కమలాలు సాగిపోతూ వుంటే"- అంటే ఆమె మేడ దిగిపోతూవుంటే-'ఆఁ!' అని నోరు తెరుచుకుని కూర్చున్నాడు శాస్త్రి.

ఇంతలో దగ్గరలోనే ఒక కోకిలకంఠం కిలకిల నవ్వింది. తటాలున తలవాల్చేశాడు మగవాడు! ★

## గది అబ్బాయి

(32-వ పేజీ తరువాయి)

వెంటనే ఆగ్నేయశర్మగారితో "ఏం శర్మగారూ. మీకు సమ్మతిమేనా?"

"ఒక పెద్దమనిషి చెప్పుతున్నప్పుడు నేనెప్పుడూ కాదన్ను" అన్నారాయన. పోతే గది అబ్బాయిమాట. అతను కొత్త ఇరుకున పడ్డాడు. తను కోరకపోయినా, మధ్యవర్తిత్వం వహించిన పెద్దమనిషిమాట తాను కాదంటే బాగుంటుందా? ఒక క్షణం ఆలోచించాడు. వేదమూర్తి గది అబ్బాయిని "నువ్వేం చెప్పలేవన్నట్లు" చూసాడు. ఆ అబ్బాయికూడా అంగీకరించాడు.

రెండు రోజులు పోయాక అర్ధరాత్రివేళ గదికుర్రాడు ఉన్నట్లుండి కెవ్వుమన్నాడు. ఆ వీధి వీధంతా పోగుబడ్డారు. ఆ గది కుర్రాడు పులి ఎదురైన మేకలా చూసాడు. ఆగ్నేయశర్మగారేమిటన్నారు. మాట్లాడ్డు. చేతి సౌంజ్ఞలచే అడిగాడు శ్రీబాబు. దానికీ సమాధానం లేదు. 'గాలిదోషం'గా నిర్ణయించారు చేరినవారంతా. ఆ అబ్బాయికి విశ్రాంతి అవసరం అని నిర్ణయించారు.

నాలుగురోజులు పోయాక తిరిగి మళ్ళీ కెవ్వుమన్నాడు — ఆ గదికుర్రాడు. కెవ్వుమనడంతోనే, అప్పుడే వీధిలోకి వచ్చిన శ్రీబాబు "అయ్యబాబోయి!" అని అరిచాడు. ఇంకేం! గాలిదోషం పూర్తిగా నిజం!

మర్నాడుదయమే కాళీచేసాడు గది కుర్రాడు. ఆ గది ఇప్పటికీ కాళీగా రోడ్డుకేసి చూస్తూనే ఉన్నది. అడపాతడపా శ్రీబాబు అర్ధరాత్రివేళ కేకలు పెడుతూనే ఉన్నాడు. ఇవతలకు రావడానికి హడలి పోతున్నాడు శ్రీబాబు. మనసులో ఆగ్నేయశర్మగారి ఇల్లు చూస్తూ "వెధవ కొంప" అనుకుంటూ ఉంటాడు అప్పుడప్పుడు!



## సంస్కర్త

మనం చెప్పగలమా చెప్పండి? ఆ అమ్మాయిని సంప్రదించి, చెపుతా..." అంటూ సాగిపోయింది.

మాష్టారికి 'ఎంత అమాయకులండి మీరు' అనేమాటలు చెవుల్లో గింగురుమన్నయ్. "అవునేమో? స్త్రీలతో విషయాలు!" అనుకొన్నారు.

అనుకొన్నదానికంటె, ఈ సమస్యా పరిష్కారం చాల ఆలస్యమైపోయింది. ఈమధ్యలో మరెన్నో విపరీతసంఘటన లేర్పడ్డయి; సమసిపోయాయి.

* * *

వెంకయ్యగారికూతురు, దాసుమీద మనసు మార్చుకొని – సుశీలమ్మగారు అడిగినప్పుడు దాసెవరో తనకు తెలియదని, తనకు మేనరికం, పూర్తిగా యిష్టమని చెప్పేసింది. ఈవిషయం విన్నదాసు – సమాజంమీద, స్త్రీలమీద, జీవితంమీద పట్టరానంత ద్వేషంతో తల్లి వారించినా వినకుండా సన్యాసుల్లో కలుస్తానంటూ వెళ్ళిపోయాడు. సీతమ్మగారు లబోదిబోమన్నారు.

ఇందటి దారుణ విషాద సంఘటనకే, అందరూ విచారాశ్చర్యాలు పొందుతుంటే- మరో మహాదారుణ సంఘటన రామాపురంలోని ఆ బాలగోపాలాన్ని చకితుల్ని చేసింది. పది ఏండ్లనాడు రామాపురం చేరిన అవధాని మాష్టారు, నిష్క్రమించారా వూరి నుంచి. కారణ మెవ్వరికీ తెలియదు–ఒకే వొకవ్యక్తికి తప్ప—

* * *

దాసు-సరోజల ప్రేమకలాపంలో యదార్థ స్థితిని బయటపెట్టి చాల సహాయం చేసింది సుశీలమ్మగారు.

కాని ప్రతిఫలం లేనిది చీపురుపుల్లైనా అక్కడనుండి యిక్కడి పెట్టే మన సత్వం కాదామెది. దాసుకు చేసిన సహాయానికి ప్రతిఫలాన్ని ముందే ముట్టచెప్పాలని పట్టు పట్టి సెగ్గించుకొంది. ఒంటరి జీవితాన్ని అనుభవిస్తున్న మాష్టారిని మనసా, వాచా వూహించరాని, పుచ్చరింపకూడని కోరిక కోరి, ఏనాడో దూరమైన యిహలోక వాంఛను తీర్చుకొంది మాష్టారి నుండి. అవధానిగారూ స్వార్థంతో గాని, మనసును అదుపులో పెట్టుకొన లేక గాని యిలాంటి పని చేయలేదు. కేవలం పరోపకార చింతతోనే లేకుంటే దాసు సమస్యను, సమస్త

## ★ రాగరేఖలు ★

కుంటూ బడిపంతులు వుద్యోగంలో మిగుల్చు కుంటూ రెండెకరాల భూమినికూడా సంపాదించుకున్నాడు ఆ వూళ్ళోనే.

కరణంగారి యిద్దరి కొడుకులలోనూ సోమేశ్వరావు యూనివర్సిటీలో చదువు కుంటున్నాడు. అతనికి తెలివితేటలు ఎక్కువో, అందమెక్కువో వెంటనే తేల్చి చెప్పడం కష్టమే! అలాంటి సోమేశ్వర్రావు తన ఎఱ్ఱని గుండెల్లో చిన్నవరహాల్ని దాచుకున్నాడు. అతని హృదయపుగదిలో ఒక్క వరహాలు చిత్రమే వ్రేళ్ళాడుతోంది అతను ఆవర్సు చదువుతున్నాడా, శలవుల్లో యింటికి వచ్చినప్పుడు వరహాలుతో చిన్న పిల్లవాడిలా ఆడుకునేవాడు. పచ్చీసుపాళి, వైకుంఠపాళీ, క్లీరెచ్చు...యిలాంటివే. అంతసేపూ వీటితోనే గడపలేక వరహాలికి చదరంగంకూడా నేర్పాడు. సోమేశ్వర్రావు జ్ఞాపకంవస్తే వరహాలు గుండెల్లో జాజిపువ్వులు విరుస్తాయి. వొళ్ళంతా సన్నని జల్లు కురుస్తుంది. కాని - వరహాలికి అతనిమీద వున్న అభిమానం ప్రేమో - కాదో యింకా నిర్ధారణగా తెలియడంలేదు.

పంతులమ్మగారితో వాళ్ళింటిదాకా వెళ్ళిసాగనంపి చక్కా వచ్చింది వరహాలు. యింటికివచ్చి పెరట్లో వాళ్ళమ్మతో ఏదో మాట్లాడుతోంది. వీధిలో పోస్టుమేను కేక పెట్టాడు.

'రత్నమాలగారట. వున్నారామ్మా.' తల్లితో పంతులమ్మగారి సంగతులు చెపుతోంది. తలవని తలంపుగా వినిపించిన పోస్టుమేను గొంతుక ఆమెను కంగారుపెట్టింది' 'ఎవరది...' అంటూ ఛంగున వీధిగుమ్మంలోకి చక్కా వచ్చింది. కూడా రవణమ్మ అనుసరించింది.

పోస్టుమేను కాగితం తీసి యిచ్చాడు. "దీనిమీద...యిక్కడ...సంతకం పెట్టండమ్మా" అన్నాడు.

"నేనే!!" ఆశ్చర్యపోయింది వరహాలు. అతని పెన్ను తీసుకుంది. కె. రత్నమాల. అని తెలుగులోనే సంతకంచేసింది. రత్నాల్లాంటి అక్షరాల్ని మురిసిపోతూ చూస్తున్న పోస్టుమేను "వ్రాలు పెట్టండమ్మా" అన్నాడు' అతను ఒక పెద్దపెట్టెతీసి యిచ్చాడు. చెప్పి వెళ్ళిపోయాడు.

"ఏమిటే...అదీ!" అంది రవణమ్మ. కళ్లు మిలమిల మెరిపిస్తూ చూస్తోంది.

వరహాలు కంగారుపడుతోంది. గుండెలు కొట్టుకుంటున్నాయి. త్రాళ్ళు కత్తితో కోద్దామా అనుకుంది. 'అమ్మా! కత్తేదే' అంది.

కాగితాలు, త్రాళ్ళూ తీసేసింది. చిన్న పేకజీ పెట్టె. పోస్టుమేను చేతిలో పెద్దదిగానే కనిపించింది. జాగర్తగా మొద్దిగించి, మూత తెరిచింది. కాగిత మ్ముక్కలన్నీ తీసి విడిగా పారేశింది. ఆశ్చర్యపడింది. కళ్ళు రెపరెపలాడాయి. మిరుమిట్లు క్రమ్ముతుండగా దంతపు పెట్టిపైకి తీసి, మూత తెరిచింది. మూతకు లోపలి వెంపున 'రత్నమాలకు— సోమేశ్వర్రావు ప్రేమతో...' వల్లని అక్షరాలతో మెరిసే గులాబీరంగు కాగితం అంటించి వుంది. ఆ వాక్యాల్ని ఎన్నిసార్లో చదువుకుంది. రెండు పేర్లూ కలిపి మనసులో మననం చేసుకుంది. ఆశ్చర్యంగా చూస్తున్న తల్లితో "సోమేశ్వర్రావు ప్రజంటు పంపేడే అమ్మా!" అంది. దూరాల్లోకిచూపులుసారించింది

రవణమ్మ కూతుర్ని గోముగా చూసింది. విలాసంగా నవ్వింది. హుందాగా లోపలికి వెళ్ళిపోయింది.

పెట్టిలోపల స్నోబుడ్డి, పౌడరు డబ్బా, తిలకం సీసా, గోళ్లరంగు, లిప్‌స్టిక్కు వగయిరాలన్నీ అందమైన అరల్లో, ఒక రకమైన దంతపు భరిణల్లో వున్నాయి—ఒకటి రెండు ఖాళీ అరలుకూడా వున్నాయి. ఒక దాంట్లో సన్నగా మడచివున్న కాగితాల దొంతు కనిపించింది. తీసింది. గబగబా చూసింది. పెద్ద ఉత్తరం వ్రాశాడే అనుకుంది. ఉత్తరాన్ని పరికిణీలో దోపుకుంది. పెట్టె చేత్తో పట్టుకుని "చూడవే అమ్మా" అంటూ తల్లిదగరకు వెళ్ళింది. చిరునవ్వును తళతళలాడిస్తూ కళ్ళలో కాంతులను చిందిస్తూ గదిలోకి వెళ్లింది వరహాలు. జాగ్రతగా ఉత్తరం చదవ నారంభించింది. ప్రతి అక్షరం దగ్గరా ఆగుతూ, మళ్ళీ మళ్ళీ శాంతంగా చదువుకుంటోంది. 'నా హృదయంలో ప్రతినిత్యం ఎన్నో హారతులు వెలిగించి, నీకే నీరాజన మిస్తున్నాను నా గుండెలలో నీమీద వున్న ప్రేమకి యిది యొక సూచన కాదని నాకు తెలుసు. ఐనా ఇంతకంటె దారిలేదు. గ్రహించి అనుగ్రహిస్తావు కదూ' అన్న పంక్తుల్ని మళ్ళీమళ్ళీ చదివింది.

తనగుండెల్లో కాపురిస్తూన్న పసివలపుల బంగారంతో ఆ అక్షరాలికి పూత పెట్టింది. కళ్లకద్దుకుంది. ఎందుకలా చేసిందో తెలియలేదు. కళ్లల్లో నీళ్ళు తిరిగాయి. ఎప్పుడూ యిలాంటి అనుభవాన్ని ఊహించనైనా లేదు. లేతగుండెకి సోమేశ్వర్రావు ప్రేమ పులకరింపు కలిగించింది. కొత్త సిగ్గు మొగ్గను తొడగింది.

తనకి అతనే భర్త అయితే...యెంత బావుంటుంది!

ఎక్కడినుంచీ, ఎప్పుడూ, తనకింత గౌరవము లభిస్తుందనుకోలేదు. తనూ ఒక నాయిక అవుతున్నాను కదా అని గర్వించింది. సంతోషం పట్టలేకపోయింది. గిరగిరా తిరిగిపోయింది. అద్దంలో ముఖం చూసుకుంది. తన చెక్కిళ్లను మృదువుగా నిమురుకుంది.

## 4

గబగబా కరణం గారింటిలోకి వెళ్ళింది. సీతమ్మ గారితో మాట్లాడుతూ యాదాలాపంగా పడక గదలోకి పోయింది. సీతమ్మగారికి పాపం! అడపిల్లలు లేరు. అంచేతనే వరహాలంటే ఎంతో చనువామెకి. గదిలో, గోడమీద సోమేశ్వర్రావు తనవేపే చూసి నవ్వుతున్నాడు. సీతమ్మగారు బయటికి వెళ్ళారు. చుట్టూ చూసి కావిడిపెట్టె ఎక్కి సోమేశ్వర్రావు పటం తీసింది వరహాలు. ఒక్కసారి తన గుండె కద్దుకుంది. దంపలు నీటితో తడిశాయి పెదవులమీద చిరునవ్వులు సముద్రకెరటాల్లా ఆడుకుంటున్నాయి. కనురెప్పలు చిలిపిగా అల్లల్లాడుతున్నాయి.

వంట చేసుకోడానికి అప్పుడే మడికట్టుకుంటూన్నది సీతమ్మగారు. ఆమె దగ్గరకు వెళుతూ, మరచిపోయి, 'అత్తయ్యా!' అని కేకేశింది. చప్పున నాలుక కరుచుకుంది వరహాలు. సీతమ్మగారు ఆ విషయాన్ని గుర్తించలేదు. "ఏమమ్మా!" అంది. "వెళతానండి!" అంది వరహాలు.

"అవును గాని. యీ వేళ నీ పుటినరోజట కదమ్మా! నా తెలివి మండిపోనూ, నేను మరచేపోయామస్మీ!!" అంది సీతమ్మగారు. దబ్బున మడివదలి వచ్చింది గదిలోకి వెళ్ళింది. సోమేశ్వర్రావు పటం యింకా అటూ యిటూ వూగుతూన్న సంగతి ఆమె కనిపెట్టనేలేదు! కావిడిపెట్టె

---

## సంస్కృతి

గానే వదలి, తన ఏకైక జీవితాదర్శమైన 'సంస్కరణ'కు దూరం కావలసి వచ్చేది. జీవితంలో ఓటమి నొప్పుకోవాల్సి వచ్చేది. అందుకే మాష్టారు సంస్కార చింతతోనూ, సమస్యా పరిష్కారాభిలాషతోనూ, వేళకాని వేళల్లో, స్థలం కానిస్థలాలో సుశీలమ్మగారిని కలుసుకోవాల్సి వచ్చింది.

* * *

దాను సంస్కరింపబడ్డాడో లేదో, సుశీలమ్మగారు మాష్టారి పురాణాలలోనూ గీతా బోధలలోనూ పరమసత్యాలను నీతినియమాలను గ్రహించుకొన్నారో లేదో-అనవసరం.

'అవధాని మాష్టారు మాత్రం 'సంస్కారి ★

తెరిచింది. అందులో పెద్దాపురం సిల్కుచీర రవికలగుడ్డలు, బయటకు తీసింది పసుపు బొట్టుపెట్టి, తాంబూలంతో వరహాలు చేతిలో పెట్టింది

"నా కిప్పు డిదెందుకండీ. మీ .." ఏదో అనబోయి ఊరుకుంది. దబ్బున వంగి సీతమ్మగారి కాళ్ళకి నమస్కారం చేసింది. సీతమ్మగారి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. ఒక్కసారిగా వరహాల్ని లేవదీసుకుని కౌగలించుకుంది. "నా బంగారుతల్లీ," అంటూ నుదురున ముద్దు పెట్టుకుంది "నా రెండో కోడలు అయితే ఎంత బావుండును" సీతమ్మగారి హృదయంలోని యీ మాటలు ఎంచేతనో బయటికి అనేసింది మెరుపు తీగలా మెరుస్తున్న వరహాలు కళ్ళు చూస్తూంటే, ఆమెకలా అనాలనిపించింది కాబోలు!

వరహాలు యింటికి వెళ్ళింది. తల్లికి చీర చూపించింది పెట్లో దాచుకుంది. పంతులమ్మగారింటికి వెళ్ళింది.

వాళ్ళమ్మగారు వంటవండుతూంటే, దగ్గర కూర్చుని సుశీలమ్మ అల్లుకుంటూంది వాకిట్లోంచి "సుశీలమ్మగారూ!" అని సన్నగా పిలుస్తున్న కేక వినిపించి, లేచింది ఆమె "యింతట్లోకే మళ్ళీ వచ్చేశేమమ్మా!" అన్నది ఆశ్చర్యంగా ఆనందంగా వరహాలు జబ్బమీద చెయ్యివేసి, తన గదిలోనికి తీసుకువెళ్ళింది యిద్దరూ మంచం మీద కూర్చున్నారు "యిందాకా యింటికి వెళ్ళానా " చిరునవ్వుతో ప్రారంభించింది వరహాలు. జరిగిన కథంతా పూసగుచ్చినట్లు చెప్పింది దాచితెచ్చిన వుత్తరం తీసి, సిగ్గుపడుతూనే ఆమె చేతికిచ్చింది నవ్వు ముఖంతో వుత్తరం పూర్తిచేసింది సుశీలమ్మ ఆనందబాష్పాల్ని దిగమ్రింగుకుంది "ఏమిటమ్మా!.. అబ్బో!! చెప్పేదే కావే.. కరణంగారి రెండో అబ్బాయికదూ! ఎంత మంచివాడు "

వరహాలు ఆమె కళ్ళల్లోకి చూసింది చప్పున ముఖం వంచుకుంది

"ఏంచెయ్యమన్నారు!" అంది అనుకోకుండానే ఆగింది.

"ఏం చేయడం ఏమిటమ్మా! అందినట్లు వుత్తరం రాయి పెళ్ళిచేసుకుని " బుగ్గమీద చిటికేవేసింది యిద్దరూ కిలకిలా నవ్వుకున్నారు. వేయివీణలు ఒక్కసారి మ్రోయించినట్లయింది.

"నాకు చాలా ఆనందంగా వుందమ్మా" అంది నవ్వాపుకుంటూ సుశీల

అసలే పిల్లల దగ్గర తన గొప్ప ప్రదర్శించే



ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా తిరిగి ఎన్నికైన శ్రీ సత్యనారాయణరాజు.

గుణం లేదామెకి వరహాలంటే మరీ ప్రాణం. తనకు ఎంతో ఆప్తురాలుగానే చూసుకుంటుంది కనుకనే ఒకటి రెండుసార్లు 'నన్ను మన్నించకమ్మా అక్కా! అంటే చాలదూ!' అని గట్టిగానే చెప్పింది కాని వరహాలు మానలేదు

"పంపిన పెటె రేపు చూపిస్తానండీ" అంది నమస్కరించింది యింటికి వచ్చేసింది వరహాలు.

## 5

"ఏం మహానుభావా! కుమార్తె పుట్టిం

టిభోజనం మమ్మల్నెవర్నీ పిలవనే లేదేమయ్యా-భోజనాలికి!" అన్నారు కరణం సుబ్బారావుగారు, మరునాడు వెంకన్న పంతులు వీధిలో అరుగుమీద పళ్ళుతోముకుంటూండగా!

"చాల్లెండి .చిన్నవాళ్ళవరైనా నవ్విపోతారు పంతులుగార్ని ఏమంత ఘనులని భోజనానికి పిలవాలేం!!...చేసిన తప్పుకు లెంపలు వాయించుకుని - నష్టపరిహారం దాఖలు చేసుకోండి మా అన్నగార్కి" అంది నవ్వుతూ సీతమ్మగారు కరివేపాకు రొబ్బలు చేతో పట్టుకుని లోనికి వెళ్లిపోయింది కరణం సుబ్బారావుగారు భార్య ఎత్తిపొడుపుకు ముఖం అదోలా మార్చారు గుర్తుచేసుకున్నట్లే వుంది!

"ఏమోయి వెంకన్నపంతులూ! పోకేవ్వరాన్ని-వరహాలి కిద్దామని మా ఉభయులం సంకల్పించాం" అన్నాడు సుబ్బారావుగారు ఆమాట వినేసరికి సీతమ్మ కళ్లల్లో ఆశ మిలమిలలాడింది

వెంకన్నపంతులు చేతిలోపుల్ల ఒక్కసారిగా జారిపడిపోయింది చివరికి సద్దుకుని "తథాస్తు" అన్నాడతను

ఆవేళ సాయంత్రం-పంతులమ్మగారు వరహాల్ని చక్కిలిగింతలు ప్రారంభించారు

బహుశా రెండురోజుల తరవాత యూనివర్శిటీలోని సోమేశ్వరానికి కూడా చక్కిలిగింతలు అందే వుంటాయి.

"ఏమయితేనేం? మనవరహాలు ధన్యురాలు సుమా!" అన్నాడు వెంకన్నపంతులు భార్యను దగ్గరగా లాక్కుంటూ...ఆవేళ రాత్రి ఒంటిగంటికి ..! ★



తమిళ్ ఇసై సంఘం ఆధ్వర్యాన మద్రాసు, అన్నామలై మందిరంలో జరిగిన గాన, నృత్య ప్రదర్శనల సందర్భంలో శ్రీ ఆండాల్ గా నృత్యంచేసిన శ్రీమతి కమలా లక్ష్మణ్, ఆమె సోదరి రాధ.

# సినిమా

## ★ అపరాజిత ★



భర్తృహీన, ఏకాకినియైన సర్వజయ [కరుణాబెనర్జీ] "అపరాజిత"లో.

వెనిస్ చలనచిత్రోత్సవంలో ఒక బెంగాలీ చిత్రానికి మొదటిబహుమతి వచ్చిందనే వార్తతో భారతీయ చలనచిత్ర కళమీద నా విశ్వాసం ఇనుమడించింది.

భారత రాజధానిలో "అపరాజిత" అది వారాలు మాత్రమే ప్రదర్శించడానికి తగిన చిత్రమని సినిమా యజమానులు నిశ్చయించారు. సత్యజిత్ రాయ్ తీసిన మొదటిచిత్రం "పథేర్ పాంచాలీ" పట్లకూడా ఢిల్లీ సినిమా యజమానులు ఇదేవిధంగా ప్రవర్తించారు సత్యజిత్ రాయ్ చిత్రాన్ని, అతని శైలిని కొంత పరిశీలిద్దాం

సినిమాకళ ప్రత్యేకతను రాయ్ చాలా చక్కగా అవగాహన చేసుకున్నాడు ఏమిటి సినిమాకళ ప్రత్యేకత? కనబడేదాంట్లో, వినబడేదాంట్లో, వినబడనిదాంట్లో నిహితమై ఉన్న యధార్థతను చిత్రించ గలగడమే ఈ ప్రత్యేకత దృశ్యం, శబ్దం, నిశ్శబ్దం ఈ మూడింటి కలయికవల్ల సినిమాకు ఈ ప్రత్యేకత సిద్ధిస్తుంది దీనివల్లనే సినిమా ఒక ప్రత్యేక కళ అనిపించుకుంటుంది.

**[చిత్రసమీక్ష]**

**పి. సి. సేన్**

మంచి సినిమాలో కథానాయకుడు "కామెరా" అని చెప్పినంత మాత్రాన చాలదు ఇది చాలవరకూ నిజమే గానీ, కామెరా కాక ఇతర ముఖ్యాంగాలున్నాయి ఇవన్నీ ఏకీభవించినప్పుడే యధార్థతా చిత్రణంలో సినిమాకు సంపూర్ణత సిద్ధిస్తుంది ఈ దృష్టితో చూస్తే సత్యజిత్ రాయ్ స్థానం ఐజెన్‌స్టీన్, డీసిక్లేర్, డీసికా, రోజెలినీల పక్కన

కనబడే దృశ్యమూ, వినబడే శబ్దమూ అద్భుతముగా సమన్వయమైన మరువరాని ఘట్టాలు 'పథేర్ పాంచాలీ' నిండా వున్నాయి యథార్థాన్నంతటినీ ఆలింగనం చేసుకొంటున్నట్లు కనబడే కామెరా, రవిశంకర్ సంగీతమూ, బెంగాలీ మాటల శబ్దమూ—అన్నీ కలిసి సంగీతంకాని, సాహిత్యంకాని, ఫొటోగ్రఫీకాని, 'బాలే' కాని సాధించలేని భావసంపదను సాధించాయి

ఈ భావసంపద "అపరాజిత"లో ఇంకా సమృద్ధంగా కనిపిస్తుంది ఈచిత్రంలో సత్యజిత్ రాయ్ నిశ్శబ్దాన్ని అద్భుతంగా వాడుకున్నాడు ముఖ్యంగా మరణించిన తల్లిదగ్గరికి అపూ తిరిగివచ్చిన దృశ్యం; కాశీ దృశ్యాలు, తల్లి మెట్లుదిగుతూ దూరాన చిలంగొట్టంమీదికి వంగి ఉన్న కొడుకును చూస్తున్నదృశ్యం కామెరా కొంతసేపు తల్లిమీద నిలుస్తుంది, కొంతసేపు కుమారుడి మీద నిలుస్తుంది, మరికొంతసేపు ఇద్దరిమధ్యా



కాశీలో అపూ [పినాకీ సేన్‌గుప్త] "అపరాజిత"లో ఒక దృశ్యం.



అపూ [స్మరణ్ గోషాల్] పెద్దవాడై కాలేజీలో చదువుతూ తను పుట్టి పెరిగిన పల్లెటూరు తిరిగి వచ్చినప్పటి దృశ్యం—"అపరాజిత"లో.

ఉంది. ఇలా అన్నవారు ఈ చిత్రాలను "మాక్సింగోర్కీ బాల్యం" అనే చిత్రంతో పోలుస్తున్నారు గోర్కీ చిత్రంలో బాలుడు తన చుట్టూ ఉన్న ప్రపంచపు క్రౌర్యాలను యథాతథంగా స్వీకరిస్తూనే, శైశవ మార్దవాన్ని కోల్పోని అమాయకుడుగా ఉండిపోతాడు. సత్యజిత్ రాయ్ ఈ విమర్శకు ఏమి సమాధానం చెబుతాడో? బహుశా కావాలనే అరకమైన చిత్రణాన్ని వదిలేసి ఉంటాడు

శిల్పాన్ని, శిల్పవస్తువునీ సమన్వయం చెయ్యడం కళ సాధించవలసిన ఆదర్శం. ఈ దృష్ట్యా సత్యజిత్ రాయ్ దృక్పథాన్ని కొంత వివరంగా పరిశీలిద్దాం.

ఆయన దృక్పథాన్ని 'సోషలిస్టు వాస్తవికత' అని అనవచ్చు. కాని ఈ మాటను ఒక్కొక్కరు ఒక్కొక్కవిధంగా అర్థం

విజయగోపాల్ ప్రొడక్షన్స్‌వారి 'గంగాగౌరీ సంవాదం'లో నాగయ్య, సి. హెచ్. నారాయణరావు



ఉన్న శూన్యంమీద తచ్చాడుతుంది ఒక్క మాటకూడా ఉచ్చరించకుండా తల్లిమనస్సులోని ఆ వేదనను, సంఘర్షణను, దాని పరిష్కారాన్ని కెమెరాయే వ్యక్తంచేస్తుంది ఈదృశ్యం "ఒడెస్సా మెట్ల" దృశ్యం (ఐజెన్‌స్టీన్ తీసిన పోటెమ్కిన్)తో సమానంగా నిలవదగినది

శిల్పవైదగ్ధ్యం వాంఛనీయమే కాని శిల్పంకోసమే శిల్పమా? లేక దానికి వేరే ఏదైనా ప్రయోజనమున్నదా? "అపరాజిత" చూస్తుంటే సత్యజిత్ రాయ్ అక్కడక్కడ శిల్పంకోసమే శిల్పమనే భ్రాంతిలోపడ్డాడా అనిపిస్తుంది "పథేర్ పాంచాలీ"లోమాదిరిగా మానవత్వాన్ని మేల్కొలుపగల రసపుష్టి ఈ చిత్రంలో లేదని కొందరనే అన్నారు

ఇదినిజమేకావచ్చు కాని ఇలా విమర్శించినవారు ఒకటి మరిచిపోతున్నారు విస్తృతమైన, వివిధమైన అనుభూతిని "అపరాజిత" చిత్రిస్తుంది "పథేర్ పాంచాలీ"లో తల్లికి మాత్రమే ప్రాధాన్యం ఈచిత్రంలో తల్లికే కాదు, తల్లీ కొడుకులమధ్య జీవితపు ఒడిదుడుకులవల్ల కలిగే సంఘర్షణకు కూడా ప్రాధాన్యం కొడుకు పెరిగి పెద్దవాడవుతాడు; తల్లికి కొంతదూరమవుతాడు దీనికి తల్లికికూడా కొంతసహాయపడుతుంది ఆమెలోని మాతృత్వం ఇంకోలాగ చేయనివ్వడు కూడాను అంటే విజయం విషాదాంతం కావచ్చునన్నమాట; జీవితసాఫల్యం మరణంగా పర్యవసించవచ్చునన్నమాట

ఈరెండు చిత్రాలు గొప్పవన్నమాటను ఒప్పుకుంటూనే ఇవి బాలుని జీవితాన్ని చూపుతున్నాయే గాని, బాలుని దృష్టినుంచి జీవితాన్ని చూపడంలేదని ఇంకో విమర్శ



'గంగాగౌరీ సంవాదం'లో శివుడి పెళ్ళి వేడుకలు చిత్రించడానికి తొమ్మిదినిముషాల పాట రికార్డు చేస్తున్న సంగీతదర్శకుడు పెండ్యాల ఇందులో 40 జంత్రులు ఇరవై గాత్రాలూ వినబడతాయి

తీసుకుంటున్నారు అందుకని మరికొంత స్పష్టంగా నిర్వచించడం అవసరం.

సత్యజిత్ రాయ్ వాస్తవిక వాది అంటే 'తను దర్శించిన' జీవితాన్ని దర్శించిన విధంగానే చిత్రించడానికి ప్రయత్నిస్తాడు. ఈ ప్రయత్నంలో 'దర్శించడానికే' అంటే ద్రష్టృత్వగుణానికే ప్రాధాన్యం. మరొకరకం వాస్తవిక వాదం ఉన్నది అంటే ఉన్న జీవితాన్ని ఉన్న వళంగానే చిత్రించడం ఈ రెండో రకంలో వస్తువుమీద కళాకారుడికి అధికారం లేదు. అందుచేత ఇది సృజనాత్మకమైన కళ కాదు. వాస్తవ చిత్రణం కళ కావాలంటే కాల్పనికమైనదిగా ఉండాలి

జరిగినదాన్ని చూడాలి; చూసి ఒక ప్రత్యేకదృష్టితో దాన్ని అర్థం చేసుకోవాలి. ఇలా అర్థం చేసుకున్నదాన్నే ఇతరులకు అందివ్వాలి పథేర్ పాంచాలీ, అపరాజిత చిత్రాల్లోని యథార్థాన్ని సత్యజిత్ రాయ్ ఒక వ్యక్తిగా చూసి చిత్రించాడని నా అభిప్రాయం. బాహిరమైన పరిస్థితులు ఒక కుటుంబాన్ని, ఒకవ్యక్తిని ఎలా అణగద్రొక్కి హింసించేదీ ఈ చిత్రాల్లో కనిపిస్తుంది ఆకుటుంబం కుటుంబంగా, ఆ వ్యక్తి వ్యక్తిగా తము నశించి రూపుమాసిపోకుండా ఉండడానికి చేసిన ప్రయత్నం కనిపిస్తుంది అడుగడుగునా వ్యక్తికీ, నిర్దాక్షిణ్యమైన పరిస్థితులకీ జరిగిన సంఘర్షణే కాక, వ్యక్తిలో వ్యక్తికి జరిగిన అంతస్సంఘర్షణకూడా కనిపిస్తుంది చివరికి మిగిలింది వినాశనం. "పథేర్ పాంచాలీ"లో కాతశేషులైన కుటుంబీకులు పల్లెటూరువదలి వెళ్లిపోతుండగా ఒక సర్పంవచ్చి వారి ఇంటిని ఆక్రమించుకుంటుంది కాని వినాశనం పరాజయమే కానక్కరలేదు ఆ చిత్రం పూర్తవుతుండగా ఒకానొక ఆశాభావం లీలగా దోబూచులాడుతుంది ఓటమిపొందని మానవుడు మళ్ళీ కొత్తపుంతలవైపు ప్రయాణంసాగించడం కనిపిస్తుంది "అపరాజిత"లో కూడా ఇదే ఆశాభావం తళుక్కుమంటుంది

ఒక అధ్యాయం అంతమవుతుంటే మరొకటి ప్రారంభమవుతోందన్న స్ఫురణ మెదలుతుంది.. అందుచేతనే సత్యజిత్ రాయ్ని కాల్పనిక వాస్తవికవాది (రొమాంటిక్ రియలిస్ట్) అనవచ్చు ననిపిస్తుంది

కాని ఈయన వాస్తవచిత్రణంలో సంపూర్ణత లోపించింది. రెండువిషయాలు ఆయనకు సవినయంగా మనవిచేస్తాను మొదటిది-బాహిరమైన పరిస్థితి అంటే ఏమిటి? దీన్ని మానవాతీతమైనదిగా పరిగణించే ధోరణి ఆయనలో కనిపిస్తోంది కాని బాహిరపరిస్థితికూడా మానవుని వశే అందుచేతే దాన్ని అదుపులోకి తీసుకురావడానికి వీలున్నది అలా అదుపులోకి తీసుకురావడంలో మళ్ళీ కొత్త సమస్యలు ఎదురవుతాయి. వీటినికూడా కళాకారుడు చిత్రించాలి అంతే కాదు - మనిషి చేసిన దాన్ని మనిషి మార్చగలడనే ఆశ ఎప్పుడూ ఉంటుంది ఇది కూడా కళాకారుడు చిత్రించవలసిన సత్యమే

రెండోది, వ్యక్తి ఒంటరిగానే గాని పరిత్యక్తుడు కాడు ఏకాకితనంలోని నిర్వేదమూ, ఆనందమూ ఎవరితోనూ పంచుకోడానికి వీలుకానివే అవి శాశ్వతంగా ప్రతివాడిలోనూ ఉండిపోయేవే మనిషి ఒంటరిగానే జన్మిస్తాడు కాని సంఘంలో జీవిస్తాడు అతని జీవితమూ, యాతనా అతనివే ననేది ఎంత నిజమో ప్రపంచానివి కూడా అనేది అంతే నిజం ఎందుచేతంటే ఏమనిషీ 'సంపూర్ణ జగత్తు' కాడు—తనలో తప్ప

నిరాశా నిస్పృహాలలోనే కాదు మానవుని గొప్పదనం వ్యక్తమయ్యేది; ఆశాకీ

(౫౯-వ పేజీ చూడండి)



పొన్నలూరివారి 'శోభ'లో రేలంగి, రమణారెడ్డి, రామారావు.

# జనవరి 11 వ తేది విడుదల






నటీనటులు :

* శివాజి గణేశన్
* నాగయ్య
* రంగారావు
* జమున
* శాంతకుమారి
* ఋష్యేంద్రమణి

తదితరులు



దర్శకత్వం :
**R.M.కృష్ణస్వామి**

నిర్మాతలు :
M.రాధాకృష్ణన్
R.M.కృష్ణస్వామి





విజయా పిక్చర్స్ రిలీజు...

PARTHAN

డీలక్స్ ఫిలింస్‌వారి 'లాజ్‌వంతి'లో బల్‌రాజ్ సాహ్నీ, నర్గీస్.

# ★ సినిమా వార్తలు ★


వాడియావారి 'షాన్‌దామన్'లో సురేష్.

శ్రీశంభు ఫిలింస్‌వారి 'నమ్మినబంటు' చాలవరకు పూర్తిఅయింది. ఈ చిత్రానికి సుంకరసత్యనారాయణ, కొసరాజు రాఘవయ్య చౌదరి మాటలూ పాటలూ వ్రాస్తున్నారు నాగేశ్వరరావు ముఖ్యభూమిక నిర్వహిస్తున్నారు దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు

* * *

ఎం ఎ వి. పిక్చర్స్ (సేలం) వారు, తమిళనాడులో విజయవంతంగా సాగిన తమ చిత్రం 'ముదలాళి'ని, తెలుగులో పునర్నిర్మిస్తున్నారు. ఇందులో జగయ్య, ఆర్. నాగేశ్వరరావు, రమణారెడ్డి, ప్రమీల నటిస్తున్నారు రచయిత ఆత్రేయ సంగీతం మహాదేవన్. దర్శకుడు ఎన్. కృష్ణారావు ఈ చిత్రానికి 'ముందడుగు' అని పేరు పెట్టారు నిర్మాణం రత్నా స్టుడియో, సేలంలో సాగుతోంది

* * *

రాయల్ స్టుడియోస్ అధిపతి ఎం. హెచ్ ఎం. మూనాస్ వర్ణచిత్రం 'దేవసుందరి' త్వరలోనే విడుదలకాబోతోంది కాంతారావు, జానకి, రాజనాల, శివరావు నటించిన ఈ చిత్రానికి హెచ్. ఎ. (ధర్మాంగద) బాబు దర్శకుడు

* * *

పీపుల్స్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారు 'ఇల్లరికం' అనే చిత్రం నిర్మిస్తున్నారు నాగే

(56- వ పేజీ చూడండి)

# ★ బొంబాయి సినిమాలేఖ ★

నిర్మాతలకు పెట్టుబడి సర్దుబాటుచేసే 'ఫిలింఫైనాన్స్ కార్పొరేషన్' నెలకొల్పడానికై బిల్లు రూపొంది సిద్ధంగా ఉంది. ఈ సంస్థ స్వరూపస్వభావాలగురించి, దీన్ని నడపవలసిన పద్ధతుల గురించి కేంద్ర సమాచారశాఖ, న్యాయశాస్త్ర వ్యవహారాల శాఖ చర్చలు జరిపాయి కూడా. చలనచిత్ర ఛాయాగ్రహణం, శబ్దగ్రహణం, దర్శకత్వం మొదలైన వాటిలో, సాంకేతిక శిక్షణ ఏర్పాటుచేసే నిమిత్తం ఫిలిం ఇన్‌స్టిట్యూట్ స్థాపించదలచినట్లు ప్రభుత్వం ప్రకటించడంకూడా విదితమే. అయితే, విదేశీద్రవ్యం నిల్వలు తగ్గిపోయి, పొదుపు తప్పనిసరి అయినందువల్ల, ఈ కేంద్రం ఏర్పాటు కావడానికి ఇంకా ఎన్నాళ్ళు పడుతుందో ఇప్పుడు తేల్చిచెప్పడం కష్టం.

కేంద్ర సమాచారమంత్రి డా॥ బి. వి. కేస్కర్, మొన్న లోక్ సభలో ఈ విషయాలను వివరించారు.

## ఫిలిం కమిషనర్

చలనచిత్ర నిర్మాణం, స్క్రిప్టు రచన ఘట్టంలో ఉండగానే, దానిని పరిశీలించి నిర్మాతలకు తగు సలహాలు ఇవ్వడానికై ఫిలిం బ్యూరో ఒకటి అవతరించబోతోంది

దీన్ని బొంబాయిలోనే నెలకొల్పుతారు.

ఇవికాక, కేంద్ర సెన్సారుసంఘం, ఫిలింస్ డివిజన్‌ల వ్యవహారాల నిర్వహణకై ఫిలిం కమిషనర్ అనే ఒక అధికారిని నియమించబోతున్నట్లు కూడా డా॥ కేస్కర్ చెప్పారు. ఈకమిషనర్ ఫిలింఇన్‌స్టిట్యూట్, ప్రొడక్షన్స్ బ్యూరోలపైకూడా ఆధిపత్యం వహించి, వాటి కార్యకలాపాలను కట్టుదిట్టంగా నడిపిస్తారట.

కొత్తగా ఏర్పాటు అవుతున్న ఈ పదవిని, ప్రప్రథమంగా, కేంద్ర సెన్సారు సంఘం అధ్యక్షుడు శ్రీ ఎం. డి. భట్‌కే ఒప్పగిస్తారని అభిజ్ఞ వర్గాలద్వారా తెలుస్తున్నది

## రాసెలినీ తీసే చిత్రాలు

భారత ప్రభుత్వం పనుపున ఇటాలియన్ దర్శకుడు రాబర్టో రాసెలినీ నిర్మించే డాక్యుమెంటరీ చిత్రాలగురించి కూడా డా॥ కేస్కర్ వివరించారు రాసెలినీ మొత్తం 12 డాక్యుమెంటరీలు తీస్తారు. అన్నీ వర్ణచిత్రాలే. నిడివి నాలుగువందల అడుగుల పైగా 8 వందలలోపుగా ఉంటుంది. ఇవికాక, ఒక కథా ప్రధాన చిత్రాన్ని పది పన్నెండువేల అడుగులలో నిర్మిస్తారు.

* * *

బి. ఆర్. చోప్రా కొత్త చిత్రంలో అశోక్‌కుమార్, దిలీప్‌కుమార్ కలిసి నటిస్తారట. ఈ పెద్దనటు లిద్దరూ కలిసి కనబడ్డ తొలిచిత్రం "దీదార్". తరవాత ఇదే. ఈ చిత్రంలో సమస్యలూ, వాటి సమస్యలూ చిత్రిస్తారు.

* * *

'నిత్యనూతననట' బిరుదాంకితుడు అశోక్‌కుమార్, ఇప్పుడు 26-చిత్రాలలో ఉన్నాడు ఇవికాక మద్రాసులో తయారవుతున్నవి మరో రెండు. రాత్రింబవళ్ళు, విధివిరామం లేకుండా పనిచేయవలసి రావటంతో, అశోక్‌కు ఆరోగ్యం దెబ్బతినగల పరిస్థితి ఏర్పడిందనిపించింది అందువల్ల ముందు జాగ్రత్తపేరిట ఇప్పటికి ఒప్పుకున్న చిత్రాలలో కొన్నిటికి కాంట్రాక్టులు రద్దుచేసుకో నిశ్చయించుకున్నాడని తెలిసింది.

* * *

అస్వస్థతతో తీసుకుంటున్న తారలిద్దరిలో బెంగాలీ నటి సుచిత్రసేన్ ఒకర్తె. ఆమె మూడు నాలుగు వారాలుగా లండన్ ఆస్పత్రిలో చికిత్స చేయించుకుంటోంది. ఈ మధ్యనే అపెండిసైటిస్ ఆపరేషన్ చేశారు. ఆమె పూర్తిగా కోలుకొని కలకత్తా చేరుకోవడానికి ఇంకో నాలుగువారాలు పట్టవచ్చును.

* * *

'మదరిండియా' నటి నర్గిస్‌కు కూడా ఆరోగ్యం బాగులేదు అయితే ఆమె రోజూ స్టుడియోలకు వెళ్ళి మామూలుగా పని చేస్తోంది ప్రస్తుతం ఆమె నాలుగు చిత్రాలలో పనిచేస్తోంది ఇకముందుకూడా, ఒకే సారి నాలుగుకన్న ఎక్కువ చిత్రాలలో పనిచేయరాదని నర్గిస్ నిశ్చయించుకుంది ఆ మేరకే కాంట్రాక్టులు వ్రాసి, ఇతర చిత్రాలు బోలెడు తిరస్కరించింది

* * *

తెలుగు నాట్యతార వహీదా రెహమాన్ తల్లి, గత వారం గుండె జబ్బువల్ల మరణించింది. బొంబాయిలో ఫిలిం ప్రముఖులు బంధుమిత్రులు వహీదాకు సానుభూతి తెలియచేశారు ★

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)



సూపర్ పిక్చర్స్‌వారి 'నయా పైసా'లో చాంద్ ఉస్మానీ.



చంద్రికా ఫిలింస్ వారి 'ఇంద్రజిత్' చిత్ర నిర్మాణానికి నటుడు ఎన్. టి. రామారావు ఇటీవల ప్రారంభోత్సవం జరిపారు

## అపరాజిత

(52-వ పేజీ తరువాయి)

తంలో కూడా అది వ్యక్తమవుతుంది. మానవుడు తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకున్నంత మాత్రాన సరిపోదు. తన వ్యక్తిత్వం పుష్పించి వర్ధిల్లేందుకు అనుగుణమైన ప్రపంచాన్ని రూపొందించుకోవడం కూడా అవసరం.

ఈ మాటలు సత్యజిత్ రాయ్ వంటి కళాకారుడికి గనక చెప్పవలసివచ్చింది. విమర్శించడానికీ జోహారు చెయ్యడానికీ భేదం లేదు. ('బర్మాషెల్ న్యూస్' నుండి) ★

## 'ఎత్తుకు పైఎత్తు'

శ్రీ సారథీ స్టుడియోస్ వారి సాంఘిక చిత్రం "ఎత్తుకు పైయెత్తు" త్వరలోనే విడుదల కాబోతోంది. క్రొత్తనటుడు బాలయ్యను నిర్మాత రామకృష్ణప్రసాద్ గారు, ఈ చిత్రంలో పరిచయం చేస్తున్నారు. బాలయ్య ఇందులో నాయక భూమికను నిర్వహించారు. జానకి నాయిక. నాగయ్య, గుమ్మడి, పెరుమాళ్లు, మొదలగువారు ప్రముఖ భూమికలు నిర్వహించారు. ఈ చిత్రానికి రచయిత నార్ల చిరంజీవి, సంగీత దర్శకుడు వేణు. దర్శకుడు తాపీ చాణక్య

అరుణోదయ ఫిలింస్ వారు 'కన్నియిన్ శపథం' అనే తమిళ చిత్రాన్ని తెలుగులో డబ్ చేసి విడుదల చేయబోతున్నారు. ఇందులో అంజలీదేవి, రాజసులోచన, తంగవేలు, నంబియార్ పాల్గొన్నారు. మాటలూ పాటలూ శ్రీశ్రీ వ్రాస్తున్నారు. నిర్మాత జూపిటర్ వెంకటరామన్ ★

## వరద బాధితులకు సహాయం

చిత్తూరు, నెల్లూరు వరద బాధితుల సహాయార్థం డిశంబరు 20న మద్రాసు అభ్యుదయ కళాసమితి బృందం వాణీమహల్‌లో 'పెళ్ళి పెద్దలు' నాటకం ప్రదర్శించారు. దీనికి సుమారు పదివేల రూపాయలు వసూలైంది. రామకృష్ణమఠం వారి ద్వారా ఈ సొమ్మును సహాయ కార్యక్రమాలకు వినియోగిస్తున్నారు.

ఈ నాటకాన్ని శ్రీ పినపాటి వెంకటేశ్వర్లు, ఆర్. యస్. శర్మ, తోట సత్యం, పినపాటి రామారావు, యస్. వి. యల్. నరసింహాచారి, సీతంరాజు, వై. సత్యనారాయణ, వి. వి. రంగాచారి, వై. రామారావు, కుమారి పార్వతి ప్రదర్శించారు.

ఈ నాటకం వేయడానికైన ఖర్చునంతా ఈ బృందమే భరించి, వసూలైన మొత్తం అంతటినీ వరదబాధితులకు వినియోగించడం చెప్పుకోతగ్గ విషయం. ఈ బృందంలో చాలమంది నాటకానికి క్రొత్తవారైయినా, చక్కగా ప్రదర్శించారు. ఈ నాటక రచయిత శ్రీ సీతంరాజు ★

## సినీవార్తలు

(54 వ పేజీ తరువాయి)

శ్వరరావు, సావిత్రి, గిరిజ, నటిస్తున్నారు. దర్శకుడు తాతినేని ప్రకాశరావు.

* * *

చంద్రికా ఫిలింస్ వారి 'ఇంద్రజిత్' నిర్మాణం మొన్ననే ప్రారంభమైంది. ముఖ్య నటుడు ఎన్. టి. రామారావు [illegible]. నాయిక ఎస్. వరలక్ష్మి, గుమ్మడి, హేమలత, కాంతారావు, జగన్నాథరావు అనే క్రొత్తనటుడు ఇతర భూమికలు నిర్వహిస్తున్నారు. రచయిత సముద్రాల రాఘవాచార్య. సంగీత దర్శకుడు అశ్వత్థామ. దర్శకుడు ఎస్. రజనీకాంత్

అరుణా ఫిలింస్ వారి 'బొమ్మల పెళ్లి' జనవరి 11 విడుదల కాబోతోంది. శివాజిగణేశన్, రంగారావు, నాగయ్య, నల్ల రామమూర్తి, రమణారెడ్డి, జమున, శాంతకుమారి, ఋష్యేంద్రమణి, మైనావతి నటించారు. దర్శకుడు ఆర్. ఎం. కృష్ణస్వామి



'పాన్-సి-హింద్'లో దల్జీత్, నిగార్ సుల్తానా.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd, by S Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty Street Madras-1 Editor S Sambhu Prasad



భువనేశ్వరాలయశిల్పం

—ఫొటో: 'ఎన్నార్' రాజమండ్రి]

ఈ పాత
ఆటవస్తువు క్రొత్తదాని వలె
కనపడుతోంది



—కారణము. దీనికి
గుడ్‌లాస్ నెరోలేక్
పెయింటుతో రంగువేయుబడినది

గుడ్‌లాస్
నెరోలేక్
పెయింటులనే
కావాలి కోరండి



అందమైన రంగుల
పూత పూయుటకు
యివి అద్భుతమైన
పెయింట్లు

గుడ్‌లాస్ నెరోలేక్ పెయింట్స్ ప్రైవేట్ లిమిటెడ్

ఏజెంట్లు:
టి. టి. కృష్ణమాచారి & కంపెనీ,
పోస్టు బాక్సు నెం. 200, మద్రాసు